13

# అపరాధ పరిశోధన

రు.5.50 మే '83



అపరాధ పరిశోధన అనుబంధం—113

# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## మహిమగల దేవుడు

రచన: వసుంధర

## రాధ చావాలి

రచన: టెంపోరావ్

## స్లో పాయిజన్

రచన: జొన్నలగడ్డ రామలక్ష్మి

## ముగ్గురు ముద్దాయిలు

రచన: ఎమ్. వి. వి. సత్యనారాయణ

విషసర్పాలు - మూడవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—113
మే, 1983
వెల: రు. 5-50
ఏడాది చందా: 66 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామదామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
ఏ. వీ. మోహన్రావ్
వసుంధర
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# మహిమగల దేవుడు

వసుంధర

నాకు తెలుసు. నా జేబులోని కాగితాలు ఎంతో విలువైనవి. అవి ప్రస్తుతం నా జేబులో వుండడం నా అదృష్టం. కానీ ఆ అదృష్టం యెంతోసేపుండక పోవచ్చు. నేను త్వరగా నిర్ణయం తీసుకోవాలి.

ఆ కాగితాలు నా దగ్గరకు చేరినట్లు శత్రువులకు తెలిసేలోగా నేను వాటిని సురక్షిత ప్రాంతాలకు చేర్చాలి. పది రోజుల తర్వాతగానీ బాస్ ఇండియా రాడు. అంతవరకూ నేను ఏకాకిని....

కేవలం కాగితాలకు సంబంధించిన పనికోసం నేను సుధాకర్ ఉండే ఊరు వచ్చాను. నా అదృష్టంకొద్దీ సుధాకర్ ఊళ్ళోనే వున్నాడు.

"ఏమటిలా ఆకాశంనుంచి ఊడిపడ్డావ్?" అన్నాడతడు.

"కష్టాల్లో వున్నాను—" అన్నాను.

"కష్టాల్లో వున్నవాళ్ళు దేవుణ్ని వెతుక్కుంటూ

వెడతారు. కానీ నువ్వు నా వద్దకు వచ్చావు...." అని ఒక్క క్షణం ఆగి—"అవునూ—నీకు మా ఊరి దేవుడి గురించి యెవరైనా చెప్పారేమిటి?" అన్నాడు.

"మీ ఊరి దేవుడా?" అన్నాను ఆశ్చర్యంగా.

"ఆఁ" అన్నాడు సుధాకర్.

ఆ ఊళ్లో వేణుగోపాలుడి ఆలయం వుంది. ఆలయం లోని వేణుగోపాలస్వామి విగ్రహం కంచుతో చేయ బడింది. శిల్ప సౌందర్యానికి చరిత్రకారులు ఆశ్చర్యపడు తూంటారు. ఆ విషయమలా వుంచితే వేణుగోపాలుడి మహిమల గురించి చాలామంది చెప్పుకుంటూంటారు. ఆ స్వామి మాహాత్మ్యానికి ఆ ఊళ్ళో యెన్నో నిదర్శనా లున్నాయి. ఆయన దర్శనానికి యెక్కడెక్కడినుంచో భక్తులు వస్తూంటారు.

"నేను మీ దేవుడి గురించి వినలేదు. కానీ నాకు దేవుడి అవసరం మాత్రమున్నది. నేను చాలా పెద్ద కష్టంలో ఉన్నాను—" అన్నాను.

"ఏమిటా కష్టం?" అన్నాడు సుధాకర్.

"పైకి చెప్పుకోలేనిది—" అన్నాను.

సుధాకర్ నొక్కించలేదు—"అయితే ఆ దేవుడికే చెప్పుకోరాదూ—నెలరోజుల క్రితం మా అమ్మకు అంటు పట్టని వ్యాధి ఆయన మహిమతోనే తగ్గింది—"

నేను సుధాకర్‌తో కలిసి ఆలయానికి వెళ్ళాను. స్వామి దర్శనం చేసుకున్నాను. ఆ విగ్రహం ఏనాటిదో, ఆ శిల్పి యెవరో గానీ—స్వామి దర్శనం కాగానే ఏదో అనిర్వచనీయానందానుభూతి కలిగింది నాకు.. కాసేపు ప్రపంచాన్ని మరిచిపోయాను.

స్వామి మందహాసం చేస్తున్నాడు. ఆ మందహాసం

నుంచి వెన్నెలలు విరుస్తున్నాయి. ఆ స్వామి సమక్షముంటే ఇంక ప్రపంచంలో ఏమీ అవసరముండదనిపించింది.

గుడినుంచి బయటకు వచ్చేక తీవ్రంగా ఆలోచించసాగాను. కొంత సమాచారం సుధాకర్ని అడిగి తెలుసుకున్నాను.

ఆలయానికి సంబంధించి పూజారి ముఖ్యుడు. స్వామిని అలంకరించే నగలన్నీ వేరేచోట వుంటాయి. ఆ తాళాలు ధర్మకర్త వద్ద వుంటాయి. పండుగలకూ, కళ్యాణానికీ దేవుడిని నగలతో అలంకరిస్తారు.

మిగతా సమయాల్లో కూడా దేవుడిపైన కొన్ని నగలుంటాయి. వాటికి బాధ్యత పూజారిదే! ఆయనవద్ద గర్భగుడి తాళాలుంటాయి.

పూజారి పేరు గోపాలాచార్యులు.

సుధాకర్ని కోరాను — నన్ను పూజారికి పరిచయం చేయమని! సుధాకర్ నేను కోరినట్లే చేశాడు.

"నేను మీ ఇంటికి వస్తాను. మీతో మాట్లాడాలి!" అన్నాను పూజారితో.

"ఎందుకు?" అన్నాడు పూజారి ఆశ్చర్యంగా.

"నేను చాలా కష్టాల్లో వున్నాను. దేవుడిమీద నాకెట్టే నమ్మకం లేదు. కానీ వేణుగోపాలస్వామి గురించి నేను విని వున్నాను. ఈ రోజే స్వామి దర్శనం కూడా అయింది. నాకు దేవుడిమీద గురి కుదురుతోంది. అది దేవుడి మాహాత్మ్యమో, పరిస్థితుల కారణంగా నాకు మానసిక బలహీనత కలుగుతున్నదో చెప్పలేను. మీతో కాసేపు ఏకాంతంగా మాట్లాడాలి—" అన్నాను.

సుధాకర్ నన్ను వదిలిపెట్టాడు. నేను, పూజారి కలిసి ఆయానింటికి వెళ్ళాం.

## 2

పూజారి ఇంట్లో ఆయన, భార్య వున్నారు. ఆయన కిద్దరు కూతుళ్ళట. ఇద్దరూ మేనమామల యింట్లో ఉన్నారుట. ఇద్దరికీ పెళ్ళీడు వచ్చింది. పెళ్ళి కావలసి వున్నది.

"మీ కేమండీ-ఆ వేణుగోపాలస్వామి దయ వున్నది. పెళ్ళిళ్ళు నిర్విఘ్నంగా జరిగిపోతాయి—" అన్నాను.

"అదే అనుకుంటున్నాను నాయనా!" అన్నాడాయన "నీ విషమేమిటో చెప్పు!"

"నా కష్టం పైకి చెప్పుకోలేనిది. కష్టాల్లో వున్నవారు ఏం చేయాలి? పూజలు చేయించాలా? పూజలెలా చేయించాలి? అన్నింట్లోకీ ఏ పూజ శ్రేష్టమైనది?" అనడిగాను.

"ఈ ప్రశ్న నన్ను ఏకాంతంగా అడగాలా? నీ స్నేహితుడి సమక్షంలోనే అడుగవచ్చునుకదా!" అన్నాడు పూజారి ఆశ్చర్యంగా.

"ఆ పని చేసివుండేవాడిని. కానీ యెప్పుడూ దేవుడికి వ్యతిరేకంగా మాట్లాడే నేను సుధాకర్ ఎదుట పూజల గురించి మాట్లాడ్డానికి సిగ్గుపడ్డాను. నా పూజ విషయం మీరు రహస్యంగా వుంచాలి—" అన్నాను.

పూజారి నవ్వి — "ప్రతి ఒక్కడూ యేదో రోజున దేవుడి సన్నిధానంలో మోకరిల్ల వలసిందే! దీనికి సిగ్గు పడాల్సిన అవసరంలేదు. దేవుడి గొప్పతనాన్ని గుర్తించనంతకాలమే మనిషి సిగ్గుపడాలి—" అంటూ పూజారి దేవుడి ఉనికి గురించి నాకో పెద్ద ఉపన్యాస మిచ్చాడు.

ఆ ఉపన్యాసంలో నేను కొత్తగా తెలుసుకున్నదేమీ

లేదు. భారతదేశంలో ఏ అణువును కదిపినా ఇదే మాటలు చెప్పగలదు. అయితే నాకు పూజారితో అవసర మున్నది. అందుకని ఆయన ఉపన్యాసానికి పరవశాన్ని నటించాను. ఆయన మాటలు నాలో జ్ఞాననేత్రాన్ని తెరిపించినవని అన్నాను.

పూజారి చాలా సంతోషించాడు.

“మీరు పరమభక్తులు. భగవంతుడి సాన్నిధ్యం మీకు నిత్యం. మీవంటి అదృష్టవంతుల ఇంట ఒక్కరాత్రి బసచేసే అవకాశం నా కిప్పించండి. మీ ఇంటి భోజనం తిని—మీ యింట ఒక నిద్రచేస్తే నా కష్టాలు తీరిపోగలవని నాకు అనిపిస్తున్నది. దయచేసి నామాట కాదనకండి. మీరు కోరిన దక్షిణ ఇస్తాను....” అన్నాను.

పూజారి తడబడ్డాడు. తనంత గొప్పవాడిని కాదన్నాడు. ఆఖరున నా పొగడ్తలకు లొంగిపోయాడు.

ఆ రాత్రి పూజారి ఇంట్లోనే నా మకాం!

ఆ దంపతులు నన్నెంతో అభిమానంగా ఆదరించారు. వైష్ణవుల యింటి వంటలు బాగుంటాయంటారు. నిజమేనని పించింది. పూజారి నా వద్ద దక్షిణ యేమీ తీసుకోలేదు. ఒక్క రాత్రికి ఆతిథ్య మివ్వడం సద్బ్రాహ్మణ సంప్రదాయమనీ—అందుకు డబ్బు తీసుకోనడం అనాచారమవుతుందనీ ఆయన అన్నాడు.

ఆయన్నూ, ఆవిణ్నీ కూడా మాటలతో ఉబ్బేశాను.

రాత్రి మంచమెక్కాక—వాళ్ళెప్పుడు పడుకుంటారా అని నేను చూస్తున్నాను. తిన్న భోజనానికి నాకు నిద్ర రావలసిందే—కానీ నా వృత్తి యెలాంటిది? నా కనులు వాచీనే చూస్తున్నాయి. చెవులు పూజారి దంపతుల గదిలోని అలికిడినే వింటున్నాయి.

రాత్రి ఒంటిగంట ప్రాంతాల లేచాను. వారి గదిని సమీపించాను. నా ముక్కుకు రుమాలు అడ్డంగా కట్టుకున్నాను.

పూజారి పడకగది కిటికీ తలుపు తీసి వున్నది. నేను కిటికీని సమీపించాను. జేబులోంచి చిన్న బాటిల్ తీశాను.

అది పోలిథీన్ బాటిల్. నొక్కితే అందులోని ద్రవం వాయురూపంలో గదిలో వ్యాపిస్తుంది. అది చాలా బలమైన మత్తుమందు. దాని ప్రభావం నాలుగు గంటలుంటుంది. స్ప్రే చేసిన అరగంట తర్వాత ఆ మత్తుమందు ఛాయలు—ఆ గదిలోగానీ—ఆ మనుషులపైగానీ కనిపించవు.

ఇటువంటివి అందరికీ లభించవు.

నేను కిటికీలోనికి చేయిపెట్టి బాటిల్ నొక్కాను.

తర్వాత పది నిముషాలాగి పూజారి పడక గదిలోనికి వెళ్ళాను. దంపతులిద్దరూ ఆదమరిచి నిద్రపోతున్నారు.

తాళాలు త్వరగానే దొరికాయి. గదిలో గోడకి తాళాల గుత్తి తగిలించి దానికి తన పైకండువా తగిలించాడు పూజారి.

ఇంక ఆలశ్యం చేయదల్చుకోలేదు.

గుడికి వెళ్లాను. గర్భగుడిలో ప్రవేశించాను.. దీపం వేశాను.

వేణుగోపాలస్వామి మందహాసం చేస్తున్నాడు.

"ఆహా! ఎంతటి ప్రశాంత వదనం...."

అప్రయత్నంగా స్వామికి నమస్కరించాను.

"భగవంతుడా! నాకు నీమీద నమ్మకం కలిగింది. ఇది ఏదో అవసరంలో కలిగిన స్వార్థపూరితమైన నమ్మకం కాదు. నీ సమక్షంలో కలిగిన ఒక విచిత్రానుభూతి!"

అనుకున్నాను.

ఇప్పుడు నా జేబులోని కాగితాలు దాచాలి.

ఇంతవరకూ అవి భద్రంగా ఉండడం నా అదృష్టం. ఇంకమీదట ఏ క్షణంలోనైనా ఆపద నామీద విరుచుకుని పడవచ్చును.

నేను విగ్రహాన్ని చుట్టూ పరీక్షించాను. మామూలు కళ్ళకు కనబడని ఓ పగులు నాకు కనబడింది. ఆ పగులును అనువుగా చేసుకుని నా జేబులోని కాగితాలను అందు లోనికి జారవిడిచాను. ఆ కాగితాలను మళ్ళీ బైటకు ఎలా తీయాలీ అన్నది నేనాలోచించ దల్చుకోలేదు. బైటకు తీయడానికి వీలుకానంత సురక్షితస్థలంలో ఆ కాగితా లుండడం ఎంతైనా అవసరం నాకు!

తిరిగి పూజారి ఇంటికి వెళ్ళాను. తాళాలు యథా స్థలంలో వుంచాను. మర్నాడు పూజారి భార్యకు ఓ చీర కూడా కొనిచ్చాను.

ఆ రోజే ఆ గ్రామం వదిలిపెట్టాను.

# 3

రెండు రోజులపాటు ఇష్టం వచ్చినట్లు తిరిగాను. నన్నెవరైనా అనుసరిస్తున్నారేమో తెలియదు. కానీ నేను మాత్రం వేటాడబడుతున్న జంతువులా తిరిగాను. రోజులు గడుస్తున్నకొద్దీ నాలోని ధైర్యం పెరగసాగింది.

నా శత్రువులను చాలా తెలివిగా బోల్తా కొట్టించాను. వాళ్ళకు నా ఉనికి తెలిసే అవకాశం లేకుండా నేను తీసుకున్న జాగ్రత్తలన్నీ ఫలించాయన్నమాట! మొద టినుంచీ నేనేం చేశానో వరుసగా స్ఫురణకు తెచ్చు కున్నాను.

ఉన్నట్లుండి ఉలిక్కిపడ్డాను.

శత్రువులను తప్పుదారి పట్టించడంకోసం నేను నా దగ్గరున్న కాగితాలకు నకళ్ళు తీసి వాటిలో తప్పుడు సమాచారం యెక్కించాను.

నా ఆలోచనేమిటంటే నేను శత్రువులకు దొరికిపోతే నాదగ్గర వాళ్ళకు కాగితాలు కూడా దొరకాలి. అవే అసలు కాగితాలన్న అదుర్దాను నేను నటించాలి. వాళ్ళవి లాక్కుని నన్ను వదిలిపెడతారు. లేని పక్షంలో కాగితా లెక్కడున్నదీ చెప్పమని వాళ్ళు నన్ను చిత్రహింసలకు గురిచేస్తారు. చిత్రహింసలు నా శరీరానికి కొత్తకాదు. కానీ వీలున్నంతవరకూ వాటినుంచి తప్పించుకొనడం మంచిది కదా!

నేను నకళ్ళు తయారుచేశాక రెండు రకాలూ రెండు జేబుల్లో పెట్టుకుని తిరుగుతున్నాను. వాటిని ఒక జేబు లోంచి ఒక జేబులోకి మార్పిడిచేస్తూ గుర్తుపెట్టుకుం టున్నాను. ఇప్పుడంతా స్ఫురణకు తెచ్చుకొనడంలో నాకు అనిపించింది—నేను దాచిన కాగితాలే నకళ్ళు.... అసలైనవి నా దగ్గరే ఉన్నాయి.

చటుక్కున జేబులోని కాగితాలను బైటకు తీశాను. కాగితాలకు నకళ్ళు తీశాక నేను వాటి జోలికి వెళ్ళి చాలా కాలమైంది.

కాగితాలను పరిశీలించగానే నాకు అర్థమైపోయింది.

అవే అసలు కాగితాలు....

నా మనసులోని ప్రశాంతత మాయమయింది.

నేను ఇంత ఘోరమైన పొరపాటు యెలా చేశాను?

వేణుగోపాలస్వామి ఆలయంలో ఆస్వామి దివ్య సుందర విగ్రహం చూస్తూ కొద్ది క్షణాలపాటు నేను మైమరచినమాట నిజం! ఆ మైమరపులో నేనీ పొరపాటు

చేశానా? లేక తనను కానిపనుల కుపయోగించుకుంటు న్నందుకు స్వామి అలిగి అప్పుడు నేనా పొరపాటు చేసేలా నా మనసు మార్చేడా?

స్వామికి నా మనసు మార్చగల శక్తి వున్నప్పుడు— నేను తనను కానిపనుల కుపయోగించుకోవడం ఇష్టం లేనప్పుడు-నన్నసలు గర్భగుడికే రాకుండా చేయగలదే.... మరి....

నాలోని ధైర్యం సన్నగిల్లసాగింది.

ఇంత ఘోరమైన పొరపాటుచేసిన నేను ఇంకా యెలాంటి పొరపాట్లు చేశానో — శత్రువులు నన్ను వెన్నంటి వున్నారేమో!

ఈ కాగితాలను యెలాగో అలా రక్షించాలి....

వ్యవహారం మళ్ళీ మొదటికి వచ్చింది....

ఈ కాగితాలు దాచడానికి వేణుగోపాలస్వామిని మించిన సాధనంలేదు. మళ్ళీ నేను అక్కడికే వెళ్ళాలి.

లేడికి లేచిందే పరుగు. నా వృత్తిలోనూ అంతే!

రాత్రి పన్నెండుగంటల ప్రాంతాల నేనా ఊరు చేరాను. మరో అర గంటలో పూజారి ఇల్లు చేరాను. ఆపైన వేణుగోపాలస్వామి గర్భగుడి.

విగ్రహం వెనుక....

నేనెంత వెతికినా ఆనాటి ఆ బీట కనిపించలేదు. సాధారణంగా నావల్ల ఇలాంటి పొరపాట్లు జరుగవు. విగ్రహానికున్న బీట ఎక్కడుందో కూడా చాలా బాగా గుర్తున్నది. కానీ ఈ బీట ఏమైపోయింది?

నేను మరీ మరీ శోధించాను. విగ్రహానికి యెక్కడా బీట లేదు.

మరి నా కాగితాలేమైపోయాయి?

సుధాకర్ మాటలు నాకు గుర్తు వచ్చాయి. ఈ ఊరి వేణుగోపాలస్వామి మహిమలకు ఎన్నో ప్రత్యక్ష నిదర్శనాలున్నాయి. నా విషయంలోనూ అదే జరిగింది.

స్వామిని నేను నా అవసరానికి ఉపయోగించుకో బోయాను. అది స్వామికి నచ్చలేదు. నాకు బుద్ధి చెప్ప దల్చుకున్నాడు. ఆనాడు తన విగ్రహానికి పగుళును సృష్టించాడు. ఈనాడు మాయం చేశాడు.

అయితే నేను చెడ్డవాడిని కాదు. అందుకని స్వామి నన్ను హెచ్చరించదలిచాడు తప్పితే శిక్షించాలనుకో లేదు. నేను కోల్పోయినవి నకలు కాగితాలు మాత్రమే!

అప్రయత్నంగా విగ్రహానికి మోకరిల్లి — యింత మహిమాన్వితుడివైన నీ కరుణ నామీద వుండగా నేనెటువంటి శత్రువులకూ భయపడనవసరం లేదు. ఈ కాగితాలు నా వద్దనే వుంచుకుంటాను. ధైర్యంగా మసలుతాను—" అని మనసులో అనుకున్నాను. యెదురుగావున్న విగ్రహం నన్నాశీర్వదించినట్లే నాకు తోచింది.

గుడిలోంచి బయటపడ్డాను. పూజారి ఇంట్లో తాళా లుంచి బయటకు వచ్చాను. అప్పుడు వున్నట్లుండి నా మనసు ప్రమాదాన్ని పసిగట్టింది. కానీ అప్పటికే ఆలస్య మైంది. యెవరో వెనకనుంచి నన్ను గట్టిగా అదిమి పట్టారు. నాకు మత్తుమందు వాసన చూపిస్తున్నారు.

నేను ప్రతిఘటించాలనుకున్నాను. కానీ వల్ల కాలేదు.

## 4

మెలకువ వచ్చేసరికి ఓ గదిలో వున్నాను. నా చేతులు వెనక్కి విరిచి కట్టారు. కాళ్లు కూడా తాళ్ళతో కట్టబడి వున్నాయి.

నేనో కుర్చీలో వున్నాను. నేనున్న గదికి ఒక్కటే

తలుపు. తలుపు మూసి వుంది. గుమ్మానికి పక్కగా ఓ కుర్చీ. అందులో ఓ వృద్ధశాయుడు కూర్చుని కునికిపాట్లు పడుతున్నాడు. అతగాడు భయంకరంగా వున్నాడు. మనిషి మంచి ఎత్తరి. కండలు తిరిగి ఉన్నాడు. నున్నగా గీసిన గుండు. పెద్ద మీసాలు. సినిమాల్లో రాక్షసుడి వేషం వేయాలంటే ఏ మేకప్పూ అవసరంలేదు. వున్న పళంగా నటించడానికి పనికి వస్తాడు.

నేను గట్టిగా దగ్గాను. ఆ మనిషి కదిలాడు. నిద్ర కాస్త మత్తుగా పట్టిందేమో—రవంత ఉలిక్కిపడి కళ్ళు నులుముకుని అప్పుడు నా వంక చూశాడు. నేను తన వంకే చూస్తూండడం గమనించి చటుక్కున లేచి నా దగ్గరకు వచ్చి—"మెలకువ వచ్చిందా!" అన్నాడు.

"ఊఁ" అన్నాను.

వాడు నవ్వాడు. నేనూ నవ్వాను.

"ఎందుకు నవ్వావు?" అన్నాడు వాడు.

"ఈ గదిలో నువ్వు తప్ప యింకెవ్వరూ లేరు. అందుకని నీతో పరిచయాన్నాశించి నవ్వాను—" అన్నాను.

"ఇంక నవ్వకు—" అన్నాడు వాడు కటువుగా.

"ఏం?" అన్నాను.

"మనుషులు నవ్వితే నేను చూడలేను. అందుకని నవ్వే మనుషుల్ని ఏడిపించడం నా వృత్తిగా పెట్టుకున్నాను—" అన్నాడు వాడు.

నా నవ్వు దానంతటదే ఆగిపోయింది — "దురద వేస్తోంది. చేతికట్లు విప్పుతావా?" అన్నాను.

"విప్పను—" అన్నాడు వాడు.

"ఏం?"

"ఎదుటి వాళ్ళకు ఏ విధంగానూ సాయపడకూడ దన్నది నా సిద్ధాంతం—" అన్నాడు వాడు.

"మరైతే నువ్వీ గదిలో ఎందుకున్నట్లు?" అన్నాను.

"నువ్వీ గదిలోంచి బయటకు పోకుండా ఆపడానికి. యెప్పుడైనా నవ్వబోతే ఆ నవ్వును ఏడుపుగా మార్చ డానికి!"

"బ్రావ్ రే!" అన్నాను.

"ఏం?"

"నువ్వు నాకంటె చాలా బలంగా కనబడుతున్నావు. కానీ నీకు నేనంటే భయంలాగుంది. నన్ను తాళ్ళతో కట్టి ఆపైన కాపలాకు కూర్చున్నావు—" అన్నాను.

ఇలాంటి గుండుగాళ్ళకు నెత్తిమీద వెంట్రుకలు లేనట్లే లోపల మెదడు కూడా వుండదు. వీణ్ని రెచ్చ గొడితే నా చేతికట్లు విప్పుతాడేమోనని ఆశ! ఒకసారి బంధవిముక్తుడినైతే ఆపైన అదృష్టం పరీక్షించుకోన వచ్చును!

గుండుగాడు నా వంక అదోలా చూసి—"నా ధైర్య సాహసాల విషయమై, బలపరాక్రమాల విషయమై నీ సర్టిఫికెట్లు నాకొద్దు. నేను నీ కట్లు విప్పను—" అన్నాడు.

"పోనీ — నేనిప్పుడెక్కడున్నానో చెబుతావా?" అన్నాను.

"చెప్పను—" అన్నాడు వాడు.

"అయితే — ఇంకా నా దగ్గర నిలబడ్డమెందుకు? పోయి ఆ కుర్చీలో కూర్చుని కునికిపాట్లు పడు—" అన్నాను చిరాగ్గా.

వాడు వెళ్ళిపోయి మళ్ళీ కుర్చీలో కూర్చున్నాడు.

"చెప్పినమాట విన్నావు. గుడ్!" అన్నాను.

"మంచిమాటలు నేనెప్పుడూ వింటాను...." అన్నాడు వాడు.

వాడితో మాట్లాడి ప్రయోజనంలేదు. వాడు సుశిక్షితుడిలా కనబడుతున్నాడు.

మరి నేనిప్పుడెక్కడున్నాను? నన్నెవరు బంధించారు. ఆ శత్రువులేనా? నా వద్దనున్న కాగితాలు వాళ్ళకు దొరికిపోయాయా?

నా పాంటు జేబులో ఏవో కాగితాలున్నట్లే స్ఫురిస్తున్నది నాకు. కానీ అవేమిటో—ఎలా తెలుస్తుంది? చేతులు, కాళ్ళు.... రెండూ నా స్వాధీనంలో లేవు.

నన్ను బంధించినది ఆ శత్రువులే అయిన పక్షంలో వాళ్ళు ముందా కాగితాలను తీసుకుంటారు. సరైన కాగితాలని నమ్మకం కుదిరితే నన్ను చంపేస్తారు. అవి నకిలీ కాగితాలని అనుమానం వస్తే నన్ను చిత్రహింసలు పెడతారు.

ఇంతవరకూ రెండూ జరుగలేదు. అంటే ఏమి జరిగి ఉంటుంది?

నా బుర్ర చురుగ్గా పనిచేస్తోంది.

నన్ను మత్తుమందిచ్చి బంధించారు. ఆ తర్వాత ఇదే నాకు స్పృహ రావడం! స్పృహ లేకుండా నేనిక్కడ ఎంతకాలం పడి వున్నానో!

గదిలో చూస్తూంటే నాకు పగలో, రాత్రో తెలియడంలేదు. కానీ కడుపులో ఆకలి! దాన్నిబట్టి చూస్తూంటే బహుశా నేను వీళ్ళకు పట్టుబడి ఒకపూటైనా దాటి ఉండాలనిపిస్తోంది.

"ఆకలి!" అన్నాను.

"అయామ్ సారీ!" అన్నాడు గుండు మనిషి.

"ఆకలేస్తే తిండిపెట్టక, దురదవేస్తే గోక్కోనీక— ఇక్కడ నన్నేం చేస్తారు?" అంటూ అరిచాను.

"నాకు తెలియదు—...." అన్నాడు గుండుమనిషి.

అప్పుడే ఉన్నట్లుండి మూసిన గది తలుపులు తెరుచుకున్నాయి. గుమ్మంలో ఓ కొత్త మనిషి ప్రత్యక్షమయ్యాడు.

"నమస్కారం సార్!" అన్నాను.

కొత్త మనిషి నవ్వి—"నేనెవరో తెలియదుకదా— నాకు నమస్కారమెందుకు పెట్టావు?" అనడిగాడు.

"నేను నమస్కారం పెట్టలేదు — నమస్కారం అన్నాను—" అన్నాను.

కొత్త మనిషి తమాషాగ కొద్ది క్షణాలసేపు నవ్వి - "నన్ను నవ్వించావు. అందుకు ప్రతిఫలంగా నిన్నేడిపించడం నాకిష్టంలేదు ..." అన్నాడు.

"ఏడ్వడం నాకూ ఇష్టంలేదు సార్!" అన్నాను.

"అయితే నేనడిగిన ప్రశ్నలకు సూటిగా బదులివ్వు." అన్నాడు కొత్త మనిషి.

"నాకు తెలిసినంతవరకూ సూటిగానే చెబుతాను—" అన్నాను.

"ఎవరు నువ్వు?" అన్నాడా కొత్త మనిషి.

"నిరుద్యోగినని చెబితే చాలా, పేరు కూడా చెప్పాలా?" అన్నాను.

"నా ప్రశ్న ఉద్దేశ్యమది కాదు—" అన్నాడా కొత్త మనిషి సాలోచనగా—"మా మనుషులు నిన్ను రెండుసార్లు వేణుగోపాలస్వామి ఆలయం గర్భగుడిలో చూశారు. అక్కడ నీకేం పని?"

"మీ మనుషులకక్కడేం పని?" అన్నాను.

"నీవు తెలియంది తెలుసుకుందుకు ప్రయత్నించవు. తెలిసింది చెప్పడానికి ప్రయత్నించు—" అన్నాడు కొత్త మనిషి.

"ఎందుకని?"

"నాకు నిన్ను ఏడిపించడం ఇష్టంలేదని ముందుగానే చెప్పాను. అది అభిప్రాయం కాదు. హెచ్చరిక!"

అతనేం చెబుతున్నాడో నాకు అర్థమయింది. అనవసరంగా నేను వీళ్ళని రెచ్చగొట్టకూడదు. అవసరమైనపుడు యెలాగా తప్పదు!

"ఆలయంలో దొంగతనం చేయాలనుకున్నాను. పూజారి యింట్లోంచి తాళాలు తీయడం సులభమే అయింది. కానీ నా మనసు అంగీకరించలేదు. నేను ఆస్తికుణ్ణి కాదు. కానీ ఆ స్వామి విగ్రహంలో ఏమి మహాత్మ్యమున్నదో కానీ అనుకున్న పని చేయలేక పోయాను. ఒక ప్రయత్నం చేసి ఫెయిలైనాక మళ్ళీ గుండె దిటవు చేసుకుని రెండో ప్రయత్నం చేశాను. అప్పుడూ ఫెయిలయ్యాను. అక్కణ్ణించి బైటపడే ముందు నేను దేవుడికి మోకరించాను కూడా!" అన్నాను.

కొత్తమనిషి నా వంక అదోలా చూసి—"నువ్వు చెప్పేది అబద్ధం. నువ్వా విగ్రహాన్ని పరీక్షించావు. చాలా క్షుణ్ణంగా పరీక్షించావు. పరీక్షించి ఏదో తెలుసుకున్నావు. నువ్వేం తెలుసుకున్నావో నాకు చెప్పాలి!" అన్నాడు.

"నేనా విగ్రహం చూసి తెలుసుకున్న విశేషం ఒక్కటే—అదెంతో మహామహిమాన్వితం. ఆ దేవుడు

మహిమగల దేవుడు—" అన్నాను.

"నిజం చెప్పాలి—" అన్నాడా కొత్త మనిషి.

"నేను నిజమే చెప్పాను...."

"సరే—నువ్వు చెప్పినవన్నీ నిజాలే! నువ్వు మామూలు నిరుద్యోగివి. అయితే నీ జేబులోని కాగితాల మాటే మిటి?" అన్నాడతడు.

అతడడిగినది వెంటనే నాకు అర్థమైపోయింది. ఆ కాగితాల గురించి ఏమి చెప్పాలి? వాటం చూస్తే ఇతడికి కాగితాల గురించి తెలిసినట్లు లేదు. ఈ అవకాశాన్ని నేనెలా ఉపయోగించుకోవాలి?

"ఏ కాగితాలు?" అన్నాను. అతడు జవాబిస్తాడనీ అందువల్ల నాకు ప్రయోజనముంటుందనీ కాదు. టైము.... ఆలోచించుకు నేందుకు టైము కావాలి నాకు....

"నీ జేబులోని కాగితాలని ముందే అన్నాను...."

"నా జేబులో చాలా కాగితాలున్నాయి. చూస్తే కానీ చెప్పలేను—"

అతడు నన్ను సమీపించి నా పాంటు జేబులోంచి కాగితాలు తీసి—"ఇవి!" అన్నాడు.

నేను వాటిని చూసి "వీటి సంగతి మీకెందుకు?" అన్నాను.

"తెలియంది తెలుసుకు నేందుకు ప్రయత్నించకు. తెలిసింది చెప్పు!" అతడు కాస్త కటువుగా అన్నాడీ మాటలు.

"ఈ కాగితాలు నా ఆరో ప్రాణం—" అన్నాను.

"ఎందుకని?"

"ఇవి నాకు రోడ్డుమీద దొరికాయి. ఈ కాగితాలతోపాటు ఓ చీటీ కూడా ఉన్నది. ఈ కాగితాలు

యెవరికైనా దొరికిన పక్షంలో ఫలానా ఆసామీకిస్తే పదివేల రూపాయలు బహుమతిగా ఇవ్వబడుతుందని రాసి వుంది. నేనా అవకాశం ఉపయోగించుకోవాలనుకున్నాను....'' అన్నాను.

“ఈ కాగితాల పేరు చెప్పి పదివేల రూపాయలు సంపాదించవచ్చుగదా — అయినా మళ్ళీ దొంగతనానికెందుకు పాల్పడ్డావు?'' అన్నాడా కొత్త మనిషి.

“ఈ రోజుల్లో ఏ వ్యాపారమైనా ప్రారంభించాలంటే పదివేలేం చాలతాయి? ఆ డబ్బుకి దేవుడి నగలు జతపర్చాలనుకున్నాను. మీ పాలబడ్డాను....''

“నీ మాటలు నమ్మబుద్ధి కావడంలేదు—'' అన్నాడతను.

“ఎందుకని?'' అన్నాను.

“నీ ముఖంలో భయం, బెదురు కనబడ్డం లేదు. ఇలాంటి చోటకు వచ్చినవాడు ప్రాణాలు గుప్పిట్లో పెట్టుకుని కూర్చుంటాడు. నీకున్న తెగింపు, చొరవ నా అనుచరుల్లోనే ఎవరికీ ఉన్నట్లు లేదు....'' అన్నాడతను.

“సార్....సార్....పోనీ నాకు మీ దగ్గర ఏదైనా ఉద్యోగం ఇప్పించకూడదూ?'' అన్నాను. నేను అసహాయ స్థితిలో ఉన్నానని అతడనుకోవడం కోసం ఈ మాటలన్నాను. ఆ మాటలు బాగానే పనిచేశాయి.

“ఈ కాగితాలు యే అడ్రసుకివ్వాలి!'' అన్నాడతను.

“సుందర్రావుగారు—వాల్తేర్ అప్ లాండ్సు....'' అంటూ అడ్రసంతా చెప్పి—“ఓసారి చూశానంటే చాలు—యేదైనా నాకు కంఠతా వచ్చేస్తుంది—అందుకే ఆ చీటీ వెంటనే చింపిపారేశాను. నా తెగింపు, చొరవ

మాత్రమే కాకుండా ఇది కూడా గుర్తుంచుకుని నాకు ఉద్యోగం ఇచ్చే విషయం ఆలోచించండి-" అన్నాను.

"ప్రస్తుతంలో నీకుద్యోగం ఇప్పించే అవకాశాలు లేవు. నిన్ను ప్రాణాలతో ఉంచాలా, కూడదా అన్నదే ఇంకా తేల్చుకోవాలి...." అన్నాడతను.

"ఎలా తేల్చుకుంటారు?"

"ఈ కాగితాలను సుందర్రావుకు పంపి...." అన్నాడతను.

అదే నాకాశ్చర్యం కలిగించింది. సుందర్రావు చూడ్డానికి మామూలు గృహస్థులా ఉంటాడు. కానీ మా సంస్థకు మూలపురుషుల్లో ఆయనొకడు. నా చేతికి చిక్కిన కాగితాలు ఆయనకందజేయాలన్నది నా కోరిక. కానీ నేను డైరెక్టుగా వెళ్ళడానికి లేదు. నన్నెవరైనా అనుసరిస్తున్నారేమోనని నాకు భయం. పోస్టు చేద్దామంటే ఈమధ్య మామూలు ఉత్తరాలే పోస్టలు డిపార్టుమెంట్లో గల్లంతై పోతున్నాయి. ఈ కాగితాలను నేను పోగొట్టుకోలేను. ఇప్పుడివి సుందర్రావుకు పంపితే — కాగల కార్యం గంధర్వులే తీర్చినట్లవుతుంది.

"మీరు పంపడంవల్లే నాకు పదివేల రూపాయలు నష్టం—" అన్నాను.

"నీకు పదివేలు ఎక్కువా, ప్రాణాలు ఎక్కువా?" అన్నాడతను.

నేనింక నోరెత్తలేదు.

నేను ప్రాణప్రదంగా చూసుకుంటున్న ఆ కాగితాలు నా చేయిదాటి పోయాయి. అవి సుందర్రావును చేరాలన్నది నా ఆకాంక్ష.

ఆయన ఆ కాగితాలను గుర్తించడమే కాదు—అవి

నా దగ్గర్నుంచి వచ్చినట్లూ నేనాపదలో ఉన్నట్లూ కూడా గుర్తించ గల్గుతాడు. యెందుకంటే ఆ కాగితాల చివర నేను నా గురించి నాలుగు మాటలు కోడ్‌లో వ్రాశాను. అవి నా ద్వారాకాక మరెవరిద్వారా నా మనుషుల చేతుల్లో పడ్డా నేను ఆపదలో వున్నానని అర్థం.

కాస్త అవకాశం లభిస్తే—ప్రస్తుతం నేనున్న పరిస్థితిని కూడా కోడ్ లాంగ్వేజిలో సుందర్రావుకు తెలియపర్చాలని ఉన్నది. కానీ వీళ్ళు చాలా జాగ్రత్తపరులు. నాకెటువంటి అవకాశమూ ఇవ్వలేదు.

“ఆకలి!” అన్నాను ఆశగా.

“సుందర్రావు దగ్గరకు మా మనిషి వెళ్ళి వచ్చేదాకా నువ్వు ఆకలిని భరించక తప్పదు....” అన్నాడతను.

నేను వేణుగోపాలస్వామిని తల్చుకుంటూ-“స్వామీ! నీ లీల ఏమిటో అర్థంకావడంలేదు. నిన్ను పూర్తిగా నమ్మిన క్షణంనుంచీ నాకీ గతి పట్టింది—” అనుకున్నాను. అలా అనుకున్నందుకు నేను బాధపడలేదు. జైలు పాలైతే గోపన్నకే రాముడిమీద కోపం వచ్చింది—నేనెంతటివాణ్ని!

## 5

ఎవరో నన్ను తట్టి లేపారు.

ఇప్పుడు నాకు నిజంగా చాలా నీరసంగా వుంది. అతి కష్టంమీద శక్తి తెచ్చుకున్నాను. కళ్ళు తెరిచాను.

అతన్ని గుర్తుపట్టాను.

“మా మనిషి వచ్చాడు. పదివేలు తెచ్చాడు. అందులో సగం నీదే! నిన్ను వదలిపెడుతున్నాం. కానీ నీ అడ్రసిచ్చి వెళ్ళు. అవకాశముంటే నీ కుద్యోగమిస్తాను—....”

"ఆకలి!" అన్నాను సర్వ శక్తులూ క్రోడీకరించుకొని.

నా కట్లు విప్పారు. భోజనానికి యేర్పాట్లు జరిగాయి. ఆవురావురుమంటూ తినేశాను. వెయ్యి ఏనుగుల బలం వచ్చింది నాకు.

"ఆకలి తగ్గిందా?" ఆప్యాయంగా అడిగాడతడు.

తల వూపాను.

"ఇవిగో నీ అయిదు వేలు!" అన్నాడతడు.

"ఆయన నిజంగానే పదివేలిచ్చాడా?" ఆశ్చర్యాన్ని నటించాను.

"ముందేమీ ఇవ్వలేదు. మా మనిషి అడిగితే ఓసారి ఆ కాగితాలు మళ్ళీ చూసుకుని గొణుక్కుంటూ డబ్బు ఇచ్చాట్ట—" అన్నాడతడు.

"మనిషి మంచివాడే!" అన్నాను.

"అవును—నీ ప్రాణాలు నిలబెట్టాడు కదా!" అన్నాడతడు.

నేనేం మాట్లాడలేను.

అతడితో కలిసి ఆ గదిలోంచి బైటపడ్డాను. గుండు గాడు మాత్రం ఆ గదిలోనే వుండిపోయాడు. వాడి కది శాశ్వత నివాసం కాబోలు.

గది బయట దారి సన్నగా ఇరుగ్గా వుంది. అక్కడ కాస్త చీకటిగా కూడా వుంది.

"ఇక్కడ జరిగినదంతా నువ్వు మర్చిపోవాలి. నీ జ్ఞాపక శక్తి చాలా గొప్పదని చెప్పావు. అందుకని మరీ మరీ చెబుతున్నాను—" అన్నాడతడు.

"ఇక్కడ జరిగినదంతా మర్చిపోవాలి—అన్న విషయమొక్కటే గుర్తుంచుకుంటాను—...." అన్నాను.

ఇద్దరం నెమ్మదిగా నడుచుకుంటూ ఓ హాల్లో ప్రవేశించాం.

"మొదట్లో నువ్వు ప్రమాదకరమయిన మనిషివని అనుమానించాము. నీ అమాయకత్వం తెలిశాక నిన్ను వదిలిపెడుతున్నాము. అయితే ఓ విషయం గుర్తుంచుకో. ఈ ప్రపంచంలో నలుగురూ నడిచే దారిన నడిస్తే ప్రయోజనం లేదు. శక్తి సామర్థ్యాలున్నవాళ్ళు వాటిని ఉపయోగించుకోవాలి—" అన్నాడతడు.

హాల్లో వెలుగు బాగా ఉంది. అక్కడ కొన్ని కుర్చీలు ఉన్నాయి. వాటిలో ఇద్దరు మనుషులు కూర్చుని ఉన్నారు. మమ్మల్ని చూస్తూనే వాళ్ళిద్దరూ లేచి నిలబడ్డారు.

"బాస్! పాల్ మీ కోసం అరగంట నుంచి ఎదురు చూస్తున్నాడు...." అన్నాడిద్దరిలో ఒకడు. రెండో వాడు పాల్ అనీ, నాతో వున్నతడు ఓ పెద్ద ముఠాకు బాస్ అనీ అప్పుడే అర్థమయింది.

పాల్ ఏదో అనబోయి నా వంక చూసి సందేహంగా ఆగిపోయాడు.

"ఇతణ్ని పంపించి వస్తాను...." అన్నాడు బాస్.

"ఇతడెవరు? మీ వద్దకెలా వచ్చాడు?"

బాస్ వివరాలు చెప్పలేదు—"అనుమానంమీద కస్టడీలోనికి తీసుకున్నాం. అమాయకుడని తెలిసి వదిలేస్తున్నాము. కానీ మనిషి చాకులాంటివాడు. ఎలాంటి చోటయినా బెదురు, భయం ఉండదు. మన లాంటి వాళ్ళకు పనికొస్తాడు!"

పాల్ వెంటనే—"అయితే ఇతన్ని పంపించేయకండి. నేను నాతో తీసుకుని వెడతాను—" అన్నాడు.

అప్పుడు కాసేపు నన్నక్కడే కూర్చోపెట్టి పాల్, బాస్ ఏవో రహస్య మంతనా లాడుకున్నారు. వాళ్ళ వ్యవహారమేమిటో నాకు తెలియలేదు. అది పూర్తికావ డానికి మాత్రం పదిహేను నిముషాలు పట్టింది.

తర్వాత పాల్ నాతో—"పద!" అన్నాడు.

నా కళ్ళకు గంతలు కట్టబడ్డాయి. నేను నడుస్తు న్నాను. ఎక్కడికో తెలియదు. అలా కొంతదూరం నడిచి కారెక్కాను.

కా రెటు ప్రయాణం చేసిందో నాకు తెలియదు.

కా రొకచోట ఆగింది. నేను మళ్ళీ నడిచాను.

## 6

నా గంతలు విప్పేసరికి నేనో పెద్ద హాల్లో ఉన్నట్లు గుర్తించాను. కళ్ళు సరిగ్గా ఆనక ఓసారి నులుము కున్నాను.

"వెల్ కమ్ మిస్టర్ ఆనంద్!"

కాస్త పరిచితమయిన కంఠమే అది నాకు. ఉలిక్కి పడ్డాను. అంటే నేను శత్రువుల వలయంలో చిక్కు కున్నానా?

"నీ కోసం తెగ గాలిస్తూంటే—వెతకబోయిన తీగలా నువ్వు మా పాల్ కంట బడ్డావు. మా పాల్ నిన్ను వెంటనే గుర్తుపట్టాడు. తెలివిగా ఇక్కడకు తీసుకుని వచ్చాడు. నౌ—యూ షుడ్ టాక్—వేరార్ దోజ్ పేపర్స్—" అన్నాడతడు.

అతడి పేరు పులి. అసలు పేరు మా కెవ్వరికీ తెలియదు కానీ పులి అన్నది అతడికి తగిన పేరు. అతడు మామూలు పులి కాదు. మనిషి రక్తం రుచిమరిగిన పులి. నేను కాగి తాలకోసం రంగంలోకి దిగగానే నా వివరాలు పూర్తిగా

పులికి చేరిపోయాయి. అతడి వేట ఆరంభమయింది. ఈ రోజు నే నతడికి దొరికాను.

నేను మాట్లాడకుండా పులి వంక నే చూస్తున్నాను. అతడు నా వంక పులిలా చూస్తున్నాడు. ఏ క్షణంలో నైనా పంజా విసరడానికి సిద్ధంగా ఉన్నవాడిలా ఉన్నాడతడు.

రంగంలోకి దిగబోయే ముందే పులి గురించిన హెచ్చరికలు నాకు అందాయి. పులి బారినుంచి నన్నెవ్వరూ రక్షించలేరు. నన్ను నేనే రక్షించుకోవలసి ఉన్నది. ఎందుకంటే....

పులి సామాన్యుడు కాదు. అతడికి సంఘంలోని ప్రముఖుల అండ ఉన్నది. అతడు చేసే దురాగతాలకు ప్రజానాయకు లనబడే వారి ప్రోత్సాహమున్నది. కొందరి మనుగడకు అతడు అవసరం. పొలంలో ఎలుకలు బాధించకుండా పాములుంటాయి. పాముల వల్ల మనుషులకు ప్రమాదముండవచ్చును. కానీ వాటి ఉనికి సృష్టిలోని భాగం. సంఘంలో పులి కూడా అటువంటివాడు.

మా సంస్థవారు పులితో చాలాసార్లు తలపడ్డారు. అతడి ఫోటోగ్రాఫ్సును నేను చాలా చూశాను. అతడి నడక, అలవాట్లు అన్నీ నాకు చలన చిత్రాలుగా చూపారు. మా వాళ్ళు పులిని సాధించలేకపోయారు. కొన్ని పర్యాయాలు అతడి కార్యక్రమాలకు విఘ్నం కలిగించగలిగారు. కొన్ని పర్యాయాలు ఓడిపోయారు. ఏది ఏమైనా పులి పులిలాగే ఉన్నాడు.

“వెల్ మిస్టర్ ఆనంద్ — ప్లీజ్ స్పీక్!”

పులిని ముఖాముఖీ కలవడం ఇదే ప్రథమం నాకు.... ఏం మాట్లాడాలి? చిత్రహింసలకు సిద్ధపడడం తప్పితే

నాకు మార్గ మేముంది?

"ఏం మాట్లాడను?" అన్నాను.

"నా క్కావలసినవి కాగితాలు...."

"అవి నా దగ్గర లేవు...."

"ఎక్కడున్నాయి?"

"ఇప్పుడు నన్నెక్కణ్నుంచి తెచ్చారో—అక్కడ!"

"వాట్!" అన్నాడు పులి—"నేను నమ్మను...."

"వాళ్ళు నన్ను కాగితాల కోసమే తీసుకుని వెళ్ళారు...."

"వాళ్ళెవ్వరో నాకు తెలుసు. కాగితాలతో వాళ్ళకు పనిలేదు...."

"మరి వాళ్ళు నన్నెందుకు తీసుకుని వెళ్ళినట్లు?" అన్నాను.

"అది నువ్వే చెప్పాలి...." అన్నాడు పులి.

"నేను వాళ్ళదగ్గరకు కాగితాలతో వెళ్ళాను. ఇప్పుడు నావద్ద కాగితాలు లేవు. ఆ కాగితా లిచ్చినందుకు ప్రతిఫలమని చెప్పి వాళ్ళు నాకు అయిదువేలు కూడా ఇచ్చారు—" అంటూ జేబులోని డబ్బు తీశాను.

పులి నావంక అదోలా చూశాడు. నా మాటల నతడు నమ్మినట్లే కనబడింది. క్షణం సాలోచనగా—"అయితే వాళ్ళ కా కాగితా లెందుకు?" అన్నాడు.

"నీ కెందుకు?" అన్నాను.

పులి నావంక కోపంగా చూశాడు. కానీ ఏమీ అనలేదు. ఎందుకంటే అతడింకా ఆలోచనలో ఉన్నాడు.

"వెల్ మిస్టర్ పులీ—దయతో నన్ను వదిలిపెట్టు. నేను నా వృత్తికి సలాంకొట్టి ఈ అయిదువేలతోటే ఏదయినా వ్యాపారం ప్రారంభిస్తాను—...." అన్నాను.

"నిన్ను చూస్తూంటే విలువయిన వస్తువు పోగొట్టు కున్నవాడిలా అనిపించడంలేదు నాకు. ఏందుకైనా మంచిది—నిజం తెలిస్తే చెప్పేయ్...." అన్నాడు పులి.

"నాకు తెలిసినదంతా చెప్పేశాను ..." అన్నాను.

"ఆ విషయం మా కుతుబుద్దీన్ చూస్తాడు—...." అన్నాడు పులి.

అప్పుడు కుతుబుద్దీన్ నా ముందు ప్రత్యక్షమైనాడు.

నల్లని శరీరం. ఆరడుగుల ఎత్తు. చిన్న అంగవస్త్రం లాంటిది కట్టుకున్నాడు. వాడి కళ్ళు అగ్ని గోళాల్లా ఉన్నాయి. వంటికి నూనె రాసుకున్నాడేమో నిగ నిగ లాడుతున్నది.

"వీళ్ళందరికీ ఇలాంటి మనుషులెక్కడ దొరుకుతారో" అనుకున్నాను.

"సరిగ్గా అయిదు నిముషాలు గడువు. ఈలోగా మాకు పనికివచ్చే నిజాలేమయినా ఉంటే చెప్పేసేయ్! లేదా ఓ పావుగంటసేపు కుతుబుద్దీన్ నీతో ఆడుకుంటాడు. ఆ పావుగంటలోనూ నీ కూడా తెలియని నిజాలు బయట పెడతావు...."

"నావద్ద నిజంగానే నిజాలేమీ లేకపోతే...."

"ఆ విషయం మాకు తెలియాలన్నా కుతుబుద్దీన్ ఓ పావుగంటసేపు నీతో ఆడుకోక తప్పదు...."

నేను పులి మాటలు వింటున్నాను. కుతుబుద్దీన్ వంక చూస్తున్నాను. ఏం చేయాలా అని ఆలోచిస్తున్నాను. నేనిప్పుడేమి చెప్పినా పులి నమ్మడు. ఆ కాగితాలివ్వడం మినహా మరో మార్గం లేదు. అదృష్టవశాత్తూ ఆ కాగితాలు సుందర్రావును చేరుకున్నాయి. మరి నా కోసం సుందర్రావేమి ఏర్పాట్లు చేశాడో!

పులి టైము గురించి హెచ్చరిస్తున్నాడు. కుతుబుద్దీన్ ఏకాగ్రతతో నా వంకే చూస్తున్నాడు.

నేను ఆ హాలును శ్రద్ధగా గమనించాను.

అందులో అప్పుడు పులి—నేను—కుతుబుద్దీన్ మాత్రం ఉన్నాం.

హాలు విశాలమైనది. నాలుగు గుమ్మా లున్నాయి. అన్ని తలుపులు మూసి ఉన్నాయి. నేను—పులి—కుతుబుద్దీన్.

పులి నన్ను హెచ్చరిస్తున్నాడు. నేను టైము లెక్క పెట్టుకుంటున్నాను. నా మనసులో ఏమున్నప్పటికీ కళ్ళలో మాత్రం భయాన్ని ప్రదర్శిస్తున్నాను.

"ఇంక సరిగ్గా ఒక్క నిముషం—అనగా అరవై సెకన్లు టయిముంది...." అంటూ పులి తన జేబులోంచీ రివాల్వర్ తీశాడు.

పులి—అతడి చేతిలో రివాల్వర్!

కుతుబుద్దీన్—అతడి చూపులు!

నేను....ఒక్కణ్ణి....నిరాయుధుణ్ణి .... చిత్రహింసలకు గురి కాబోతున్న వాణ్ణి....

"అయిదు సెకన్లు...."అన్నాడు పులి.

నేను గదిలో దూరాన్ని గణించుకుంటున్నాను. శరీరాన్ని అడ్జస్టు చేసుకుంటున్నాను.

"గడువై పోయింది....కుతుబుద్దీన్!" అన్నాడు పులి.

కుతుబుద్దీన్ నన్ను సమీపించాడు. అతడి కదలికనుబట్టి నేనూహించాను—అతడు నన్నేం చేయబోతున్నాడో!

కుతుబుద్దీన్ కు మించిన ఏకాగ్రత నాకున్నది! నేను పొందినటువంటి శిక్షణ కుతుబుద్దీన్ పొంది ఉంటాడని అనుకోను.

కుతుబుద్దీన్ కాలికి బూట్లున్నాయి. వాటి చివర స్టీలు పటకా ఉన్నది. అతడిప్పుడు నన్ను కాలుతో తన్నబోతున్నాడు. అతడి బలం ముందు నా బలం చాలదు. అతణ్ని సాధ్యమైన యుక్తితో సాధించాలి. కానీ నే నెటువంటి యుక్తి పన్నడానికి వీల్లేకుండా అవతల పులి—అతడి చేతిలో రివాల్వర్!

పులి ఈ విధంగా ఎందరిని చిత్రహింసలు పెట్టాడో! మా సంస్థలో పులి గురించిన కథలు చాలా వున్నాయి. అవి వింటే జగదేక వీరులకు కూడా గుండెలు జలదరిస్తాయి.

కుతుబుద్దీన్ కాలు ఎత్తాడు.

"అమ్మో!" అని పెద్దగా అరిచాను నేను. అతడు తన్నకుండా నే తన్నబడెనట్లుగా గాలిలోకి ఎగిరాను. నా అంచనా తప్పలేదు. అలా ఎగురుతూ నే—సరాసరి పులి చేతిలోని రివాల్వర్ అందుకున్నాను.

ఇది పులి ఎదురుచూడని విశేషం!

కుతుబుద్దీన్ నన్ను తన్నినట్లే అతడు భావించాడు.

"వెల్—మిస్టర్ పులీ! ఇప్పుడు నువ్వు నా చేతిలోకి వచ్చావు—" అన్నాను కటువుగా.

నా చేతిలో రివాల్వర్—నా ముందు పులి—మాకు కాస్త దూరంగా కుతుబుద్దీన్.

"డామిట్—" అన్నాడు పులి కోపంగా.

"నాకు నీమీద కోపంలేదు. నేనిప్పుడు నిన్నేమీ చెయ్యబోవడం లేదు. నువ్వు నా మాటలు నమ్మడంలేదు. అందుకని ఇలా తెగించవలసి వచ్చింది. ఇట్సాల్ రైట్—ప్రస్తుతానికి నేను కోరేది-ఇక్కణ్నించి బయటపడడం-బయటపడేముందు నాకో ప్రశ్నకు జవాబు కావాలి!"

అన్నాను.

“నేను చెప్పను....” అన్నాడు పులి.

“చెప్పకపోతే ఏం జరుగుతుందో తెలుసుగా....”

“నాకు చావు భయంలేదు. నన్ను చంపి ఇక్కణ్నించి నువ్వు ప్రాణాలతో బయటపడలేవు....” అన్నాడు పులి.

“నేను నిన్ను చంపుతాననుకుంటే అది నీ భ్రమ! రివాల్వర్ నిన్ను బెదిరించడానికేగానీ — నీ మీద ప్రయోగించడానికి కాదు. నేనేం చేస్తానో తెలుసా?” అంటూ నా కుడిచేతి వేళ్ళతో పులి కుడి భుజంమీద తమాషాగా నొక్కాను.

“అబ్బా—” అన్నాడు పులి బాధగా.

“నాకు తెలిసిన విద్య ఇదే! ఇప్పుడు నీకు కలిగిన నొప్పి అరగంట ఉంటుంది. ఇలాంటి నొప్పులు నీకు ఒళ్ళంతా కలిగించగలను. ఇది శాంపిల్ మాత్రమే!”

“ఏమడుగుతావో—అడుగు....” అన్నాడు పులి.

“నన్ను నువ్వు ఇంకో ముఠానుంచి పట్టి తెచ్చావు. నీకూ ఆ ముఠాకీ సంబంధమేమిటి? ఆ ముఠా మధ్యకు వెళ్ళాలంటే దారి ఏమిటి?” అన్నాను.

“అదో స్మగ్లింగ్ ముఠా — వాళ్ళు సంపాదించిన వస్తువుల్ని మేము అంతర్జాతీయంగా రవాణా చేస్తుంటాం—” అన్నాడు పులి.

“ఆ ముఠా అడ్రసు....”

“గండు పిల్లి వీధిలోని ఎర్ర మేడ!”

“నువ్వు నిజమే చెబుతున్నావా?” అన్నాను.

“ఆఁ.”

“అయితే నేనిప్పుడా ముఠా మధ్యకు వెళ్ళబో

తున్నాను. నువ్వు చెప్పిందాంట్లో నిజానిజాలు తెలుసుకోవడానికి నాకొక్కటే దారి—...." అంటూ ఈసారి అతడి యెడమ భుజంమీద తమాషాగా నొక్కాను.

"అబ్బా!" అన్నాడు పులి బాధగా.

"తేలు కుట్టినట్లుంది కదూ.... ఈ బాధ జీవితాంతం అలాగే వుంటుంది. ఉపశమనం కావాలంటే నేను మంత్రం వేయాలి. నువ్వు చెప్పిన ఎర్ర మేడలో నా పని ఎంత త్వరగా అయిపోతే అంత త్వరగా వచ్చి నీకు మంత్రం వేస్తాను. నువ్వు నా కోసం వేణుగోపాలస్వామి ఆలయంలో యెదురు చూస్తూ వుండు—" అన్నాను.

"ప్లీజ్-ఈ బాధ భరించలేకున్నాను...." అన్నాడు పులి.

"మిస్టర్ పులి! నా అదృష్టం బాగుండకపోతే ఇలాంటి కేకలు నా నోటినుండి రావలసింది—అప్పుడు నువ్వు వికటాట్టహాసం చేస్తూ నిజం చెప్పు....నిజం చెప్పు. అంటూ నాకు తెలియని నిజాన్ని చెప్పించాలనుకుంటూ వుండేవాడివి. కొంత బాధను నువ్వు భరించక తప్పదు. ముందు నన్ను ఈ పల్లోంచి మర్యాదగా బయటపడనీ... ఆపైన వేణుగోపాలస్వామి ఆలయం....గుర్తుందిగా!" అన్నాను.

## 7

గండుపిల్లి వీధి....ఎర్ర మేడ....

అంతవరకూ నాకు పులి కరెక్టుగానే చెప్పాడు. అయితే నేను వెంటనే అక్కడికి వెళ్ళలేదు.

నేను వెళ్ళబోయేది శత్రువుల స్థావరంలోకి...వాళ్ళకు దయాదాక్షిణ్యాలు లేవు సరికదా—క్రూరంగా ఆడుకునే సరదా కూడా వుంది.

ముందుగా పల్చటి బులెట్ ప్రూఫ్‌లో ఉడుపులు ధరించాను. అది నాకు సగానికి పైగా ధైర్యాన్నిచ్చింది. శత్రువు లూహించలేని చిల్లర ఆయుధాలను సమకూర్చుకున్నాను. ఆ పైన పులినుంచి తెచ్చిన రివాల్వర్ ఉన్నది.

ఒక్క మాటలో చెప్పాలంటే నేనిప్పుడు వన్ మాన్ వార్ మెషీన్!

మేడ చుట్టూ ఓసారి ప్రదక్షిణం చేశాను. ఇలాంటి మేడల్లోకి దొడ్డిదారిన వెళ్ళడం మంచిది. అది నాకు కనబడింది.

మేడకు వెనుక భాగాన ఓర వాకిలిగా తెరచివున్నది తలుపు.

నేను అందులోంచి అడుగు పెట్టాను.

ఎవ్వరూ లేరు అక్కడ!

నాకు తెలుసు.... పులి ఈ ముఠాను హెచ్చరించడు.. నా పని ఎంత త్వరగా ముగిసిపోతే అంత మంచిది పులికి.. అతడా బాధను భరించలేడు. వేణుగోపాలస్వామి ఆలయంలో నాకోసం యెదురుచూస్తూంటాడు.

నేను మేడంతా కలయ దిరిగాను.

అక్కడక్కడ మనుషులున్నారు. వాళ్ళు పనివాళ్ళ లాంటి వాళ్ళు. తీరి కూర్చుని వాళ్ళను రెచ్చగొట్టడం నాకిష్టం లేదు. అందుకని వారికంట పడకుండా నే మేడంతా తిరిగాను. మొత్తంమీద నన్ను పాల్ చూసిన హాలు కనబడింది. అక్కణ్నించి వెతుక్కుంటూ—గుర్తు తెచ్చుకుంటూ నన్ను బంధించిన గదికి వెళ్ళాను.

గది తలుపులు మూసి వున్నాయి.

తోశాను.

లోపల గుండుగాడు కునికిపాట్లు పడుతున్నాడు.

కాస్త దూరంగా ఓ మనిషి బంధించబడి వున్నాడు. అతడు సరిగ్గా నా పరిస్థితిలోనే వున్నాడు.

నేను లోపల అడుగుపెట్టి తలుపు మూసి గుండు గాణ్ని భుజంతట్టి—"హలో మిస్టర్ గుండూ!" అన్నాను.

వాడు నన్ను చూసి ఉలిక్కిపడ్డాడు.

"గుర్తున్నానా?"

కొద్ది గంటల క్రితం ఇక్కడే ఉన్నాను. మళ్ళీ ఇక్కడికి వెతుక్కుంటూ వచ్చాను. వాడికి భయంగా వున్నదో, ఆశ్చర్యంగా వున్నదో నాకు తెలియదు.

"నీ అంతట నువ్వు ఇక్కడికొచ్చావా?" అన్నాడు ఆశ్చర్యంగా.

"నన్ను ప్రశ్నలడక్కు. నేనడిగిందానికి బదులు చెప్పు—" అన్నాను.

"నన్నిలా అనడానికి ఎంత ధైర్యం—" అంటూ వాడు నామీదకు చెయ్యెత్తాడు. ఆ చేతిని ఒడుపుగా పట్టుకుని ఒక్కసారి లాగాను. వాడు మూడు పల్టీలుకొట్టి ఆశ్చర్యంగా నా వంక చూసి "ఎవరు నువ్వు?" అన్నాడు.

"నన్ను ప్రశ్నలడక్కు. నే నడిగిందానికి బదులు చెప్పు...." అన్నాను.

వాడు మళ్ళీ నాకు ఎదురు తిరిగాడు.

ఇష్టం లేకపోయినా వాణ్ని చావబాదడం నాకు తప్పలేదు.

వాడో ఆర్డినరీ గూండా! నేను అంతర్జాతీయ శిక్షణ పొందిన వాణ్ని! నాముందు వాడెంత?

ఒక విధంగా వాణ్ని మెచ్చుకోవాలి. వాడు నా చేతుల్లో చావు దెబ్బలు తిన్నాడు తప్పితే నా ఒక్క

పళ్ళనూ బదులివ్వలేదు. అక్కడ బంధించబడిన వ్యక్తిని బంధవిముక్తుణ్ని చేసి ఆ స్థానంలో గుండుగాడిని బంధించాను.

"సమయానికి వచ్చి రక్షించారు — లేని పక్షంలో నేనేమైపోయేవాడినో—" అన్నాడా మనిషి.

"నీ గురించి చెప్పు!" అన్నాను.

అతడెవరో తెలుసుకునేందుకు నాకెంతో సేపు పట్టలేదు. అతడు సుందర్రావు మనిషి. నా కాగితాలందుకోగానే సుందర్రావితణ్ని పంపాడు. ఇతడా మనిషిని అనుసరిస్తూ ఈ ఎర్ర మేడను చేరుకున్నాడు. మేడలో ప్రవేశించి కొన్ని రహస్య ప్రాంతాలను శోధిస్తూ దొరికిపోయాడు. ఈ గదిలోకి వచ్చాడు.

అతడికి నేనెవరో చెప్పాను.

"మీకు సాయపడ్డంకోసం సుందర్రావుగారు పంపించారు. మీరు నాకు సాయపడ్డారు—" అన్నాడతడు. అతడు తన పేరు చలం అని చెప్పాడు.

చలాన్ని తీసుకుని ఆ గదిలోంచి బయటపడ్డాను.

"ఓ గదినిండా పురాతన వస్తువుల్ని చూశాను. వీళ్ళు బహుశా వాటిని విదేశాల్లో అమ్ముతూండాలి...." అన్నాడు చలం.

"నన్నా గది వద్దకు తీసుకుని వెళ్ళు!" అన్నాను.

చలం నన్నో గది వద్దకు తీసుకుని వెళ్ళాడు. ఆ గదిని చూస్తూంటే నా కళ్ళు చెదిరిపోతూయి.

ఎక్కడెక్కడినుంచి సంగ్రహించారో మరి! అక్కడ ఎన్నో అద్భుత శిల్పాలున్నాయి. వాటిని చూస్తూ ఉలిక్కిపడ్డాను.

నన్నమితంగా ఆశ్చర్యపరచిన ఆ విగ్రహం వేణు

గోపాలస్వామిది!

నేనా విగ్రహాన్ని సమీపించాను.

ఈ విగ్రహం ఇక్కడికెలా వచ్చింది?

నా మెదడు శీఘ్రంగా పని చేస్తున్నది.

వేణుగోపాలస్వామి ఆలయంలోంచే నన్ను వీళ్ళు ఎత్తుకుని వచ్చారు. ఆ విషయంలోనే వీళ్ళు నన్ను అనుమానించారు.

నేను చటుక్కున విగ్రహాన్ని సమీపించాను. వెనక్కు వెళ్ళాను. అక్కడ నేను చూసిన పగులు వున్నది.

అంటే—... నేను మొదట చూసిన విగ్రహం ఇదే నన్నమాట! స్వామి మహిమ కారణంగా ఆ పగులు మాయమయిందనుకున్నాను. కానీ ఇలా జరిగిందనుకోలేదు. ఆ విగ్రహంపై ఈ స్మగ్లర్ ముఠా కన్ను పడిందన్న మాట! వారా విగ్రహాన్ని మార్పిడీ చేయాలనుకున్నప్పుడు నేను అడ్డం వచ్చి వుంటాను. ఆ మరుసటి దినం వారది మార్పు చేసి వుంటారు. తర్వాత నేను మళ్ళీ అక్కడకు వచ్చాను.

విగ్రహం విషయంలో అనుమానించిన ఏ ప్రభుత్వాధికారిగానో వారు నన్ను భావించి వుండవచ్చును. అందుకే నన్ను బంధించి-నన్ను పరీక్షించి-సుందర్రావు కారణంగా నా అమాయకత్వాన్ని నమ్మి నన్ను వదిలిపెట్టేశారు.

ఇది వేణుగోపాలస్వామి అసలు విగ్రహం!

టూకీగా నేను చలానికి అసలు విషయం చెప్పాను.

ఇద్దరం ఆ విగ్రహాన్ని తీసుకుని ఆ మేడలోంచి బయటపడ్డాం.

అంత సులభంగా బయటపడగలమని నేననుకోలేదు. ఇంతవరకూ ఆ ఎర్ర మేడలో ఇలాంటి ప్రమాదం జరిగి

వుండదు.

చలం పోలీస్ స్టేషన్‌కు వెళ్ళాడు—ఆ ఎర్ర మేడను స్వాధీనపర్చుకునే ఏర్పాటు చేసేందుకు...

## 8

వేణుగోపాలస్వామి ఆలయానికి వెళ్లాను. అక్కడ పులి నాకోసం యెదురుచూస్తున్నాడు. సరిగ్గా అప్పుడే పూజారి గర్భగుడి తలుపులు వేస్తున్నాడు. నా చేతిలోని విగ్రహాన్ని చూసి ఆయన తెల్లబోయాడు.

"పూజారిగారూ! ఇది అసలు విగ్రహం.." అన్నాను.

పూజారి కళ్ళలో ఆశ్చర్యంకంటె భయం యెక్కువ కనిపించింది.

"పూజారిగారూ! కూతుళ్ళ పెళ్ళిళ్ళకోసం మీరు డబ్బుకు గడ్డితిన్నారు. వేణుగోపాలస్వామి విగ్రహాన్నే అమ్మేశారు. మీ సాయం లేనిదే ఈ వ్యవహారం ఇంత గుట్ చిప్ గా జరుగదు. కానీ మీరు నమ్మిన దేవుడి మహిమను మీరు తప్పు అంచనా వేశారు. ఆయన నన్నీ వ్యవహారంలోకి లాగి తను యథాస్థానం చేరుకుంటున్నాడు.." అన్నాను.

పూజారి వణికిపోతున్నాడు.

"పూజారిగారూ! భయపడకండి—శ్రీ వేణుగోపాలస్వామి జోలికి వచ్చినందుకు మొత్తం ఆ ముఠాయే పట్టుబడబోతున్నది. మిమ్మల్నెవ్వరూ ఏమీ చెయ్యరు. విగ్రహాన్ని పునఃప్రతిష్ఠ చేయడంలో మీ పాత్ర ఏమీ లేదనడానికి—ఇదిగో ఇతడు సాక్షి!" అంటూ పులిని చూపించాను.

పూజారికి ముట్టవలసిన డబ్బు ముట్టే వుంటుంది. ఈ వ్యవహారంలో ఆయన నష్టపోయిందేమీ ఉండదు.

పూజారి విగ్రహాన్ని త్వరగా యథాస్థానంలో ఉంచి నకలు విగ్రహాన్ని అక్కణ్నించి తొలగించాడు.

"పూజారిగారూ! మీరు సాయపడిన ఆ ముఠా ఇంకా ఇలాంటి విగ్రహాలను చాలా సంపాదించింది. అవన్నీ పోలీసుల కస్టడీలోకి వెడుతున్నాయి. ఈ విగ్రహాన్ని మాత్రం నేను కూడా తీసుకుని వచ్చాను. ఎందుకంటే ఎంతో మహిమగల ఈ దేవుణ్ని త్వరగా యథాస్థానానికి చేర్చాలని నాకు అనిపించింది...." అన్నాను.

"మిస్టర్ ఆనంద్ .... బాధ...." అన్నాడు పులి.

"నీకు మంత్రం వేయాలికదూ — వేస్తాను. నేను అన్నమాట తప్పను. కానీ మిస్టర్ ....ఒక విషయం గుర్తుంచుకో.... దేవుడు వరమిచ్చినా పూజారి వరమివ్వ డంటారు. ఆ విధంగా మీరు సామాన్య ప్రజలకు ప్రభుత్వం నుంచి అందే సాయం చేరకుండా చేస్తున్నారు. అయితే మా వేణుగోపాలస్వామి ఒక కొత్త విషయం ఋజువు చేశాడు. పూజారి వరమిచ్చినా దేవుడు వర మివ్వడని....అందుకనీ దేవుణ్ని నమ్ముకుని శేష జీవితం జైల్లో గడుపు...." అన్నాను.

పూజారి అక్కణ్నించి భయం భయంగా వెళ్ళి పోయాడు. నాకు పూజారిమీద కోపంలేదు. సామాజిక సమస్యలు, ఆర్థిక పరిస్థితి ఆయన్నలా దిగజారదీశాయి. అందుకు భగవంతుడే ఆయనకీవిధంగా దారి చూపించాడు.

నేను పులిని సమీపించాను. అతడి భుజాల మీద తమాషాగా రాస్తున్నాను.

గర్భగుడి కటకటాలలోంచి వేణుగోపాలస్వామి విగ్రహం చిరునవ్వులు చిందిస్తోంది.

—:అయిపోయింది:—

# రాధ చావాలి

## టెంపోరావ్

ఏక్ కండిషన్డ్ గదిలోకి వయ్యారంగా నడుస్తూ ఆమె వచ్చింది. బాస్ ధనంజయరావు కేసి చిరునవ్వుతో చూసింది. అతడు నవ్వాడు. "సిడౌన్" అన్నాడు.

క్షణకాలం గదిలో నిశ్శబ్దంగా వుంది. అమోఘమైన ఏ ప్రకృతి దృశ్యాన్నో చూస్తున్నట్లు అతడామెవైపు చూస్తూ వుండిపోయాడు.

రిసీవర్ ఎత్తాడు. అటువైపునుంచి వేరొక కంఠం వినబడింది.

"మేరీ, ఎవ్వరూ నా గదిలోకి రాకూడదు. చాలా ముఖ్యమైన పనులు చూస్తున్నాను. ఏదైనా అర్జంటైతే ఫోన్ చేసి మాట్లాడు" అన్నాడతను.

"అలాగే సార్" అంది మేరీ.

అతడు రిసీవర్ పెట్టేశాడు. టేబుల్ మీద వేర్వేరు రంగుల్లో మూడు ఫోన్లు వున్నాయి.

ధనంజయరావు కోటీశ్వరుడు. అతడికి షుగర్ మిల్స్,

సిమెంట్ ఫాక్టరీలు వున్నాయి. అతడి ఫాక్టరీలు అనేక రాష్ట్రాల్లో వున్నాయి.

అతడి వయసు నలభై దాటింది. పొడుగ్గా, పచ్చగా వుంటాడు. అమెరికన్ క్రాపు. గోల్డ్ రిమ్ కళ్ళజోడు అతడి మొహంలాగే మెరుస్తూ వుంటుంది. ధనంజయరావు కింద పనిచేసేవాళ్ళు భయభక్తులతో అతడి ముందు ప్రవర్తిస్తూ వుంటారు.

అతడి ముందు ప్రేమ మౌనంగా కూర్చుంది. తనీ కంపెనీలో చేరి యింకా సంవత్సరం కాలేదు. అయినా ఆమె వేగంగా మెట్లెక్కి ఎన్నో ప్రమోషన్లని సాధించింది. మొదట్లో అందరికీ ఆమే టైపిస్టు! నెల తిరిగేలోగా ఆమె ధనంజయరావుకి టైపిస్టు అయింది. మరికొన్ని నెలల్లో ఆమె అతడి సెక్రెటరీగా రూపొందింది. అతడి పెర్సనల్ సెక్రెటరీ! ఎవరికి ఏం కావలసినా ఆమెనే అడగాలి!

దైవం ఆమెకు అందమయిన రూపాన్ని ప్రసాదించాడు. తన అందంతో ఆమె లోకాన్ని జయించు కొంటోంది.

"ప్రేమా, నువ్వు నాతో సింగపూర్ రావలసింది. వాటే బ్యూటిఫుల్ సిటీ!" అన్నాడతను.

ఆమె తీయగా నవ్వి వూరుకుంది. అతడి ముందు మాట్లాడే ధైర్యం ఆమెకు లేదు.

"డోంట్ బాదర్! సింగపూర్‌కి యిది నా ఆఖరి విజిట్ కాదుగా! మళ్ళా వెళ్తాను. ఈసారి నువ్వు రావచ్చు!"

ఆమె జవాబివ్వలేదు.

"నీ కోసం ఒక వుంగరం కొని తెచ్చాను. డైమండ్

రింగ్!"

ఆమె తృప్తిపడింది. తనకోసం అతడు డైమండ్ రింగు తెచ్చాడా? ఒకవైపు ఆనందపడ్తూ ఆమె మరోవైపున భయపడ్తోంది.

"లోపల గదిలోకి వెళ్దాం, పద!" అన్నాడతను.

ఆమె గుండె వేగంగా కొట్టుకోసాగింది. ఎంతో గొప్పవాళ్ళు అయితే గాని అతడు లోపల గదిలోకి తీసుకువెళ్ళడు!

అతను లేచాడు. రమ్మన్నట్లు ఆమె వంక చూశాడు. అయస్కాంతంలా అతడి చూపు ఆమెను లాగింది.

అతడు తలుపు తోసి లోపలకు వెళ్ళాడు. వెనకనే వెళ్ళిందామె.

మరో ఏర్ కండిషండ్ గది. అంత అందమైన గదిని ఆమె ఎక్కడా చూడలేదు. నేలమీద లినోలియమ్. చక్కటి సోఫాలు, టీపాయిలు. కొంచెం దూరంలో వెల్వెట్ దుప్పటి పర్చిన స్ప్రింగ్ కాట్, ఫోమ్ బెడ్, తలగడలు!

"కూర్చో! ఫీల్ ఎట్ హోమ్!" అన్నాడు ధనంజయ రావు.

నవ్వుతూ ఆమె పెద్ద సోఫాలో కూర్చొంది. అతడామె ప్రక్కనే కూర్చున్నాడు. ఆమె కళ్ళలోకి తీక్షణంగా చూశాడు.

"సింగపూర్ లో ఒక బ్యూటీ పోటీ జరిగింది. మిస్ సింగపూర్ ని ఆ నాడు ఎనుకొన్నారు. ఆమె తలమీద నేను కిరీటం పెట్టాను. ఆమెను చూస్తుంటే నువ్వు నాకు గుర్తొచ్చావు. నువ్వు సింగపూర్ లో వుంటే మిస్ సింగపూర్ నువ్వు అయేదానవు. నీ తలమీద నేను కిరీటం

పెట్టేవాడిని!"

అతడి మాటలు విని ఆమె లోలోపల మురిసిపోతోంది. తన భర్త యిలా మాట్లాడడు. ఇంటికి రాగానే, "ప్రేమా, నా అండర్ వేర్ ఎక్కడ వుంది?" అని అరుస్తాడు.

ధనంజయరావు సూటు లైట్ కాంతిలో మెరుస్తోంది. కోటు జేబులోంచి ఎర్రటి పెట్టెను అతడు తీసి ఆమెకిచ్చాడు.

"తెర్చి చూడు!"

ఆమె తెర్చింది. లోపలున్న ఉంగరంవైపు చూసింది. రింగులో అమర్చిన డైమండ్ ధగ ధగ మెరుస్తోంది.

"బాగుందా?"

ఆమె ఏమీ చెప్పలేకపోయింది. ఉంగరాన్ని చూస్తూ వుండిపోయింది.

అతడు ఆమెవైపు నవ్వుతూ చూశాడు.

"మన దేశంలో యీ ఉంగరం ధర లక్ష రూపాయలు వుంటుంది," అన్నాడతను.

వుంగరాన్ని ఆమె వేలుకు పెట్టాడతడు. ఆమె చేతివైపు క్షణకాలం చూశాడు.

"ఆ ఉంగరం వుండవలసిన చేతిమీద వుంది!" అన్నాడతను.

ఆమె గుండె అరోహమయంగా కొట్టుకుంది.

"ప్రేమా, మాట్లాడు! నన్ను చూసి భయపడకు! నేను ప్రస్తుతం నీ బాస్ కాను. నీ భక్తుడిని!"

క్షణకాలం ఆమె మాట్లాడలేదు. మెల్లిగా ఆమెకు ధైర్యం వచ్చింది.

"ఈ ఉంగరం అత్యద్భుతంగా వుంది. నాలా

ఆఫీసుల్లో పని చేసేవాళ్ళ చేతికి యిది వుండకూడదు!"

"డోంట్ బి సిల్లీ! నువ్వు నా పెర్సనల్ సెక్రెటరీ! నీకు సరైన వుంగరం అది."

"చూడండి! దీన్ని చూసి నా భర్త గాభరాపడ్డాడు. ఇంత విలువైన ఉంగరం నాకిచ్చారని చెప్తే ఆయన అనుమానిస్తారు" అందామె.

"ఇది డైమండ్ రింగని అతడికి చెప్పకు! రోడ్డువారగా అమ్మేవాడి దగ్గర రూపాయికి కొన్నానని చెప్పు!"

"అది సాధ్యమా?"

అతడు నవ్వాడు. జేబులోంచి మరో రింగు తీశాడు. అచ్చంగా పెట్టెలో వున్న డైమండ్ రింగులా వుందది.

"ఇదెంతో తెలుసా? ఒక రూపాయికి ఎవరేనా మన దేశంలో కొనొచ్చు. ఈ ఉంగరం నీ భర్తకు చూపించు! అతడు అనుమానిస్తే వెళ్ళి ఖరీదు కనుక్కోమను. దాని ధర ఒక రూపాయి మించదని అతడు కనుక్కుంటాడు. నిన్ను అనుమానించడు. అటుపైన నిర్భయంగా అసలు డైమండ్ రింగ్‌ని నువ్వు వేలికి పెట్టుకోవచ్చు!"

"చాలా ఆలోచించారు!" అందామె.

అతడు విచిత్రంగా నవ్వాడు.

"ఎంతో ఆలోచించి యిన్ని ఫాక్టరీలు నెలకొల్పిన నేను యీ చిన్న విషయం గురించి ఆలోచించకుండా వుంటానా?" అన్నాడతను.

"నేను యిక్కడకు వచ్చినప్పటినుంచీ మీరు నన్ను ఎంతో అభిమానంతో చూస్తున్నారు. మమ్మల్ని యీ జీవితంలో మరువలేను" అందామె.

అతడి చేతులు అమాంతంగా ఆమెను చుట్టేశాయి.

చటుక్కున ఆమె ఎర్రటి పెదిమలను అతను ముద్దెట్టుకున్నాడు.

"ఈ జీవితంలో యిటుపైన మనం ప్రేమలో మునిగి తేలుతూ వుంటాం! మన బంధం ఏనాటిదో, దాన్ని ఎవ్వరూ విడదీయలేరు!" అన్నాడతను.

## 2

అయిదింటికల్లా రామచంద్రమూర్తి ఆ రోజు యింటికొచ్చాడు. తాళం తెరిచి లోపలకు వెళ్ళాడు.

సంవత్సరం నుంచి అతడు ఆ ఫ్లాట్‌లో నివసిస్తున్నాడు. చిన్న హాలు, పక్కనే పడగ్గది, వాటి వెనుక వంట గది, పక్కనే బాత్రూమ్, టాయిలెట్.

ఆరు గంటలదాకా ఆమెకోసం ఎదురు చూశాడతను. ఆమె రాలేదు. ఇంతకు ముందు ఆమె ఆరు లోపల వచ్చేసేది. పెర్సనల్ సెక్రెటరీ అయ్యాక ఎప్పుడు యింటికొస్తుందో వూహాతీతంగా వుంది.

గాస్ స్టవ్ మీద కుక్కర్ పెట్టి అతడు ముందుహాల్లో కూర్చున్నాడు. ఏడు దాటాక యింటిముందు అంబాసిడర్ కారు ఆగింది. ఆమె కిందకు దిగింది. కారు ముందుకు పోయింది.

హాల్లోని పేము కుర్చీలో ఆమె కూర్చుంది. గదిలో లైట్ వెలుగుతోంది. అతడామెవంక నవ్వుతూ చూశాడు.

"ప్రేమా, అలిసిపోయినట్లున్నావు?" అన్నాడతను.

"ఆఫీసు పనంటే ఆడుకోడం కాదు!" అందామె.

"ఎక్కువగా ఆడినా మనుషులు ఆడిపోతారు. వుండు హాట్ కాఫీ తెస్తాను."

"వద్దు, బయల్దేరేముందు తాగాను."

అతడు మళ్ళా కుర్చీలో కూర్చుండిపోయాడు. ఆమె

వంక నవ్వురూ చూశాడు.

"మీ బాస్ సింగపూర్ నుంచి వచ్చారా?"

"ఇవాళే వచ్చారు" అందామె.

ఆమె వేలిమీదున్న ఉంగరాన్ని అప్పుడు చూశా డతను. డైమండ్ ధగ ధగ మెరుస్తోంది. నకిలీ ఉంగ రాన్ని హేండ్ బాగ్‌లో వుంచుకుని అసలు వుంగరాన్ని పెట్టుకున్నందుకు ఆమె లోలోపల గాభరాపడింది.

అతడు ఉంగరంపై పే చూస్తున్నాడు.

"ఆ రింగ్ చాలా బాగుంది. ప్రెజంటా?" అతడు ప్రశ్నించాడు.

ఆమె ఉంగరం తీసి అతడి కిచ్చింది.

"దీని వెల ఎంత వుంటుందో చెప్పండి!"

అతడా వుంగరాన్ని యిటూ, అటూ తిప్పిచూశాడు. "సహజ కాంతితో మెరుస్తోంది. నేను వజ్రాలవ్యాపారిని కాను. దీని వెల చాలా వుంటుంది" అన్నాడతను.

"పది రూపాయిలిస్తే వెంటనే మీకు అమ్మతాను" అతడు తృళ్ళిపడ్డాడు.

"అంత తక్కువా?"

"రూపాయిచ్చి రోడ్డుపక్కన అమ్మేవాడి దగ్గర కొన్నాను. ఐదు రూపాయిలు చెప్పి రూపాయికిచ్చాడు" అందామె.

"వాళ్ళంతే!" అన్నాడతను.

ఆమె సంతోషించింది. ఇటువైపు తనకు బెంగలేదు.

ఆమె కుర్చీలోంచి లేచి పడగ్గదిలోకి వెళ్ళింది. వెను కనే వెళ్ళాడతను. అతడిచ్చిన ఉంగరాన్ని వేలుకు పెట్టు కుంది.

"ఇప్పుడు వంట చేయాలి!" అందామె.

"టైంట అయిపోయిందిలే. నువ్వు అలసిపోయి వస్తావని నాకు తెలుసు."

నవ్వుతూ అతడివైపు చూసిందామె. ఆమె బుగ్గలమీద సొట్టలుపడ్డాయి. ఆమె విశాల నేత్రాలు తళతళ మెరుస్తున్నాయి.

"ప్రేమా!" అని అతడామెను కౌగలించుకున్నాడు.

ఉద్రేకంతో ఆమెను పదే పదే ముద్దెట్టుకున్నాడు.

"ఉండండి, బట్టలు మార్చుకోవాలి" అందామె.

అతడు మంచంమీద కూర్చున్నాడు. ఆమె దుస్తులు కింద పడుతున్నాయి. అతడు ఆమెవైపే చూస్తున్నాడు.

తటాలున లైట్ ఆరిపోయింది. కాస్సేపట్లో ఆమె మేక్సీలో వుంది. మళ్ళా లైట్ వెల్గింది. అతడిని చూసి ఆమె చిలిపిగా నవ్వింది.

"దొంగా, లైట్ ఆర్పేసి మళ్ళీ స్విచ్ నొక్కావా?" అన్నాడతను.

"దొంగతనంగా చూసేవాళ్ళకు అదే శిక్ష!" అంది ప్రేమ.

రామచంద్రమూర్తి ఆలోచిస్తున్నాడు. వాళ్ళ పెళ్ళయి సంవత్సరం దాటింది. అప్పుడప్పుడు సరదాగా పోట్లాడుకున్నా జీవితం సుఖంగా సాగిపోతోంది. మొదట్లో తనకంటె తక్కువ సంపాదించే ప్రేమ ఇప్పుడు తన జీతానికి రెట్టింపు గడిస్తోంది.

దేనికీ లోటులేదు. ఆమె మాటలు విని అతడు ఆలోచనల్లోంచి తృళ్ళిపడ్డాడు.

"గుడ్ న్యూస్!" అందామె.

ఆమెవంక ప్రశ్నార్థకంగా చూశాడతను.

"కంపెనీ మనకు ఫోన్ యిస్తుంది. ఫోన్ బిల్లు కంపెనీ చెల్లిస్తుంది."

"ప్రేమా, నువ్వు బాగా పెరిగిపోతున్నావు. నేను గొంగళిలా వేసినచోటే పడున్నాను. ఎదుగూ బొదుగూ లేదు!" అన్నాడతను దీనంగా.

అతడివంక ఆమె సూటిగా చూసింది.

"మనిద్దరిలో ఎవరో ఒకరు వృద్ధిలోకి రావడం మంచిదేగా!" అందామె.

"ఆ, మంచిదే. మనలో మార్పులు రానంతకాలం!" అన్నాడతను.

"ఏమిటి మీ గొడవ?"

"ఏమీ లేదులే! ఆకలిగా వుంది. భోజనం చేద్దాం పద" అన్నాడతను.

## 3

ధనంజయరావు కుషన్డ్ కుర్చీలో వెనక్కివాలి కలలు కంటున్నాడు. మొదట్లో కొంత అభ్యంతరం చెప్పినా ప్రేమ పూర్తిగా తనదైంది.

ఈసారి ఆమెను తనతో లండన్ న్యూయార్క్ నగరాలకు తీసుకువెళ్ళాలి! కాని తన భార్య రాధ ఒప్పుకుంటుందా?

తలుపు తోసుకుని ప్రేమ లోపలకు వచ్చింది. అతడి దగ్గరగా వెళ్ళి చూస్తూ నిలబడింది.

"మన ఆఫీసులో నాయర్ అనేవాడున్నాడు. మనల్ని అతను రహస్యంగా గమనిస్తున్నాడు" అందామె.

"వాడా, గోపాల నాయరా?" అన్నాడు ధనంజయరావు.

అతడి కెదురుగా ఆమె కూర్చుంది. ధనంజయరావు

ఆలోచించి అంతా గ్రహించాడు.

గోపాలనాయర్ చిన్నతనంలో తనింట్లో నౌఖరుగా వుండేవాడు. అప్పటినుంచీ అతను తన భార్యకు బాగా తెలుసు. ఎన్నో కంపెనీలు పెట్టాక నాయర్‌ని తనే కంపెనీకి బదిలీ చేశాడు. తను ఏం చేస్తున్నదీ గమనించమని రాధ అతడిని నియమించి వుంటుంది.

తనకూ, ప్రేమకూ వున్న బంధం గురించి నాయర్ తెల్సుకుంటాడు. తన భార్యతో చెప్తాడు. అతడిని ఆపాలి!

ధనంజయరావు ఆమెవైపు చూశాడు.

"ప్రేమా, డోంట్ బాదర్. నాయర్ చాలా చిన్న చేప. మన్ని ఏమీ చేయలేడు."

"చూడండి, నేను పెళ్ళయినదాన్ని. మీకు భార్య వుంది. మనల్ని గురించి ఏదేనా దుష్ప్రచారం జరిగితే తలెత్తుకు తిరగడం కష్టం" అందామె.

"నాయర్‌తో నేను మాట్లాడుతాను" అన్నాడతను.

ఆ నాటి రాత్రి తొమ్మిది ప్రాంతంలో గోపాల నాయర్ రైలుపట్టాలకు పక్కనే వున్న రోడ్డుమీద ఒక చోట నిలబడి వున్నాడు. తన బాస్ కారుకోసం ఎదురు చూస్తున్నాడు.

9-30 కి బాస్ కారు వచ్చి అతడి పక్కనే ఆగింది. నాయర్ అతడికి వినయంగా నమస్కరించాడు.

"నువ్వు వస్తావో రావో అనుకున్నాను!" అన్నాడు ధనంజయరావు.

"అదేమిటి సార్? ఇరవైయేళ్ళపైగా మీ దగ్గర పనిచేస్తూ రాకుండా వుంటానా?"

కారు వెనుక సీటువైపు చూశాడు ధనంజయరావు.

అక్కడున్న ఇద్దరు మనుషులు కిందపడిగారు. వాళ్ళిద్దరూ గూండాల్లా వున్నారు.

సీటుమీద కూర్చుని ధనంజయరావు లైటర్‌తో సిగరెట్ వెలిగించాడు. నాయర్ వైపు నవ్వుతూ చూశాడు.

"నాయర్, పట్టాలకు అటువైపున నా శత్రువు ఒకడున్నాడు. అతడు నన్ను ముప్పతిప్పలూ పెడుతున్నాడు. ఈ యిద్దరిలో నువ్వు వెళ్ళి అతడిని ఇక్కడకు తీసుకురా. అతడికి ఏం కావాలో కనుక్కుని యిచ్చేద్దాం. అతడి యిల్లు నీకు చూపిస్తారు" అన్నాడతను.

"అలాగే సార్!" అన్నాడు నాయర్.

నాయర్, వెనకనే వాళ్ళిద్దరూ పట్టాలవైపు కదిలారు. అప్పుడే వస్తూన్న ఎలక్ట్రిక్ ట్రెయిన్ హెడ్‌లైట్ కాంతి వాళ్ళమీద పడింది.

"ఎందుకీ తొందర! ట్రెయిన్ పోయాక పట్టాలు దాటుదాం" అన్నాడతడు.

"అదే మంచిది" అన్నాడు రెండోవాడు.

వాళ్ళ మాటలు విని నాయర్ ఆగాడు. ఇద్దరూ అతడి వెనకనే నిలబడ్డారు. ట్రెయిన్ దగ్గర కొస్తోంది.

ధనంజరావు కారును స్టార్టుచేసి గేరులో వుంచాడు. అమాంతంగా వెనక నిలబడిన వాళ్ళిద్దరూ నాయర్‌ని పట్టాలమీదకు బలంగా తోశారు. శబ్దం చేస్తూ ట్రెయిన్ దూసుకుపోయింది. భయానకమైన నాయర్ అరుపులు చీకట్లో ధ్వనించాయి.

గూండా లిద్దరూ చీకట్లో పారిపోయారు. ధనంజయరావు కూర్చున్న కారు రోడ్డున్మట దూసుకుపోయింది.

హఠాత్తుగా ట్రెయిన్ ఆగింది.

## 4

ఆమె టైం చూసింది. రామచంద్రమూర్తి ఆమెవైపు చూస్తున్నాడు.

"ప్రేమా, యింత రాత్రివేళ వెళ్ళాలా?" ప్రశ్నించాడతను.

"రేపు ఇటలీనుంచి స్కూటర్ ఫాక్టరీవాళ్ళు వస్తున్నారు. వాళ్ళ సహకారంతో యిక్కడ ఒక స్కూటర్ల ఫాక్టరీని ధనంజయరావుగారు స్థాపిస్తున్నారు. ఇవాళ రాత్రి మా ఆఫీసులో అందరూ పని చేస్తున్నారు. వెళ్ళక తప్పదు" అందామె.

టైమ్ పది కావస్తోంది. ఇంటిముందు కారు ఆగింది. ఆమె భర్తకు చెప్పి బయటకు వెళ్ళింది. కారులో కూర్చుని తలుపు మూసింది. కారు వెంటనే వెళ్ళిపోయింది.

కారులో ఎవరున్నారో రామచంద్రమూర్తి స్పష్టంగా చూడలేకపోయాడు.

కారును పోనిస్తున్న ధనంజయరావు ఆమె చేయిని పట్టుకుని నిమిరాడు. అతడికి దగ్గరగా జరిగి ఆమె కూర్చుంది.

"నాయర్ యిటుపైన మనవైపు చూడడు. మనల్ని గురించి ఎవ్వరితోనూ మాట్లాడడు!" అన్నాడతను.

ఆమె అతడి చెయ్యిని నిమిరింది.

"ఈ మధ్య నా భర్తకి అనుమానం ఎక్కువవుతోంది. యివాళ నేనిలా రావడం ఆయనకిష్టం లేదు" అందామె.

అతడు కారును మెల్లిగా పోనిచ్చాడు.

"ప్రేమా, నే నింతవరకూ యెవ్వరినీ ప్రేమించలేదు. నిన్ను చూశాక ప్రేమ అంటే ఏమిటో నాకు అర్థమైంది. నువ్వు తప్ప మరెవ్వరికీ నా హృదయంలో స్థానం లేదు" అన్నాడతను వుద్రేకంతో.

ఆమె అతడికింకా దగ్గరగా జరిగింది.

"నీ కోసం ఒక మేడ తీసుకున్నాను. నువ్వూ, నీ భర్తా వెంటనే అక్కడకు మారొచ్చు. అక్కడకు వెళ్ళి చూద్దామా?"

"పదండి చూద్దాం?" అందామె.

ఆమె ఆలోచిస్తోంది. తను పేదరికంలో పుట్టింది. చిన్నప్పుడు ధరించడానికి మంచి దుస్తులు లేవు. తండ్రి మరణించాడు. తండ్రి కొచ్చిన కొద్ది డబ్బుతో తల్లి యిల్లును నడిపేది. ఎలాగో ఆమె బి. ఎ. పాసయింది. అమ్మ పోయింది. మావయ్య యింటికి ఆమె చేరుకుంది.

మావయ్య యిల్లు ఆమెకు నచ్చలేదు. అత్తయ్య గోగి పెట్టేది. మావయ్య చూపు ఎప్పుడూ తనమీదే వుండేది. మరి కొంతకాలం అక్కడుంటే మావయ్య కామానికి తను బలై పోవలసినది!

ఆ సమయంలో రామచంద్రమూర్తి ఆమెను బస్ స్టేండ్‌లో చూశాడు. ప్రేమించాడు. వెంటనే అతడిని పెళ్ళాడి బయటపడింది.

ఇదంతా ఆమె సింహావలోకనం చేసుకుంటోంది. గేటు దాటి లోపలకు దూసుకెళ్ళి పోర్టికోలో కారు ఆగింది.

ఒక గూర్ఖా వినయంగా వచ్చి యిద్దరికీ నమస్కరించాడు.

ధనంజయరావు, ప్రేమ కిందకు దిగారు. అతడు

ముందు తలుపుకున్న గాడ్‌రెజ్ తాళం తెర్చాడు. ఇద్దరూ లోపలకు వెళ్ళారు.

అతడు స్విచ్‌లు నొక్కాడు. రెండు ఫ్లోరసెంట్ లైట్లు ప్రకాశవంతంగా వెల్గాయి.

పెద్ద హాలు. మొజయిక్ ఫ్లోరింగ్ మెరుస్తోంది. మధ్యలో ఖరీదయిన రోజ్‌వుడ్ సోఫాలున్నాయి. సోఫాల పక్కన వాల్‌నట్ వుడ్ టీపాయిలు.

కింద చాలా గదులున్నాయి. ఇద్దరూ మెట్లెక్కి పైకెళ్ళారు. ఎర్‌కండిషండ్ పడగ్గది. గదిలో చల్లగా వుంది. డబుల్ స్ప్రింగ్ కాట్. పైన ఫోమ్‌బెడ్. గోడలకు అందమైన పెయింటింగ్స్ వేళ్ళాడుతున్నాయి. ఒకవైపున గోడలో అమర్చిన వార్డ్‌రోబ్. ఇదంతా ఏదో కలలో చూస్తున్నట్లు ఆమె నలువైపులా తిలకిస్తోంది.

"దీనికి అద్దె ఎంత?" అడిగిందామె యటాచ్డ్ బాత్‌రూమ్‌ని చూస్తూ.

ధనంజయరావు గంభీరంగా నవ్వాడు.

"నీ యింటికి నువ్వు అద్దె యిచ్చుకోడం ఏమిటి? ఈ యింటి టైటిల్ డీడ్స్ నీ పేర వున్నాయి. ఇది నీ ఇల్లు."

ఆమె గుండె దడదడలాడింది. అతడు చెప్పింది నిజమా? ఇంత పెద్ద యిల్లు తనదా?

అమాంతంగా ఆమె అతడిని కౌగలించుకుని, పెదిమలను బలంగా, వుద్రేకంతో ముద్దెట్టుకుంది. ఆమెను మెల్లిగా తీసుకెళ్ళి అతడు పరుపుమీద పడుకోబెట్టాడు. ఆ క్షణంలో ఆనందం ఆమె హృదయంలోంచి పొంగి, శరీరాన్ని ఆవరించి, కళ్ళలో మెరుస్తోంది. ఆమెవైపు చూస్తూ పక్కనే కూర్చున్నాడతను.

పరుపుమీద ఆమె వెల్లకిలా పడుకుంది. మోకాళ్ళ

పైకి వున్నాయి. ఆమె పాదాలవైపు చూశాడతను. చిన్న పాదాలు. బంగారం ముద్దలా వున్నాయి. ఆమె పాదాన్ని మెల్లిగా పట్టుకున్నాడు. ఆమె లేచి కూర్చోబోయింది.

“అలాగే పడుకో!” అన్నాడతను.

ఆమె తీయగా నవ్వింది.

“ఈ యిల్లు చూసి నా భర్త ఏమనుకుంటాడు?”

అతడు వెంటనే జవాబివ్వలేదు. ఆమె కళ్ళలోకి సూటిగా చూశాడు.

“నేనేదేనా చెయ్యదలిస్తే అది చేసుకుపోతాను. ఎవరు ఏమనుకుంటారని బాదర్ అవను, ఎవరేనా అడ్డొస్తే వార్ని తొలగిస్తాను!” అన్నాడతను. ఆమె మౌనంగా విన్నది.

“ప్రేమా, నీ భర్త ఒక చిన్న కంపెనీలో ఆటో మొబైల్ పార్ట్స్ సేల్స్ మాన్‌గా వుంటున్నాడు. అతడితో నీకు భవిష్యత్తు లేదు. నా భార్యకూడా అంతే. ఒక పరిస్థితిలో ఆమెను నేను పెళ్ళాడాను. కాని ఆమె మీద నాకు ప్రేమలేదు. నీతో వుంటే చంద్రకాంతిలో విహరిస్తున్నట్లు వుంటుంది. అటువంటి అనుభూతులను నేను నా భార్యనుంచి పొందలేను. మన కలయికను వాళ్ళు ఒప్పుకోవాలి. మనకు అడ్డొస్తే వాళ్ళను తొలగించాలి!”

గదిలో నిశ్శబ్దంగా వుంది. తనకోసం ఎంతమందినేనా అతడు తొలగిస్తాడు. ఎంత ప్రేమ! అతడి ప్రేమను వూహించుకుని ఆమె లోలోపల భయపడింది.

మెల్లిగా అతడామె చెయ్యిని పట్టుకున్నాడు. ఆమె వైపు ఆప్యాయంగా చూశాడు.

"నా మాటలను మరోవిధంగా అర్థం చేసుకోకు! ఈ జీవితంలో నిన్ను నేను వదలను."

ఆప్యాయంగా ఆమె చెయ్యి నొక్కి ముందుకు వాలాడు. ఆమెను ముద్దెట్టుకున్నాడు. ఆమె చేతులు అతడిని బలంగా చుట్టేశాయి.

మరో అరగంట తర్వాత ఇద్దరూ కిందకు దిగారు. ముందు తలుపుకు అతడు తాళంవేసి తాళంచెవుల గుత్తిని ఆమెకిచ్చాడు.

ఇద్దరూ కార్లో కూర్చున్నారు. అతడు కారును గేటు దాటి బయటకు పోనిచ్చాడు.

## 5

పడగ్గదిలో ఫ్లోరసెంట్ లైట్ వెల్గుతోంది. తలుపు తోసుకుని పక్క గదిలోంచి రాధ వేగంగా అతడి మంచం దగ్గరకు వెళ్ళింది.

అతడామెవైపు విసుగ్గా చూశాడు.

"ఏం కావాలి?" అడిగాడతను.

ఆమె అతడివైపు సూటిగా చూసింది.

"ఎంతో డబ్బు గడిస్తున్నావు. ఫాక్టరీమీద ఫాక్టరీ స్థాపిస్తున్నాయి, కాని లోలోపల మవ్యాక హాంత కడవు" అర్చిందామె.

అతడు విచిత్రంగా నవ్వాడు.

"రాధా, నా భార్యగా నువ్వీ భవనంలో సుఖంగా పడున్నావు. కిల్లర్ యిన్‌స్టింక్ట్ వుంటేగాని యీ లోకంలో ఎవరూ అఖండ విజయాన్ని సాధించలేరు. వింబల్‌డాన్ టెన్నిస్ పోటీల్లో నెగ్గాలంటే అది వుండాలి. వ్యాపారంలో జయించాలంటే అది కావాలి. అది నాలో వున్నందువలనే యింతగా నెగ్గుకొచ్చాను."

"సాయంత్రం పేపరు చూశావా?" అడిగిందామె.

"నా కంపెనీల షేర్ల విలువ యింకా పెరిగిందా?"

"ఎలక్ట్రిక్ క్రెయిన్ కింద ఒకతనుపడి మరణించాడు. అతడి పేరు గోపాల నాయర్. నీ కంపెనీలో పనిచేసే మనిషి!" అందామె.

"పూర్ ఫెలో! అతడికేమైంది?"

"పట్టాలు దాటుతూంటే అమాంతంగా క్రెయిన్ వచ్చేసుండాలని పోలీసులు భావిస్తున్నారు. కాని నాయర్ అంత ముసలివాడు కాదు. అతడు ప్రమాదవశాత్తూ మరణించి వుండడు. అతడిని యెవరో హత్యచేసి వుండాలి" అందామె.

"నాయర్ లాంటి అనామకుడిని చంపవలసిన అవుసరం ఎవరికి పడ్తుంది?"

ఆమె అతడివైపు సూటిగా చూసింది.

"ఆనాడు రంగరాజు ఏమయ్యాడు?" అందామె.

ఆ ప్రశ్న వినగానే అతడి మెదడు గతంలోకి దూసుకుపోయింది.

రంగరాజు రాజా షుగర్ మిల్స్ మేనేజింగ్ డైరెక్టర్. ఆ ఫాక్టరీని కొనడానికి తను ఎంతగానో ప్రయత్నించాడు. కాని రంగరాజు లొంగలేదు. అతడు వున్నంతకాలం ఫాక్టరీ తన చేతుల్లోకి రాదు.

ఆ రోజు రాత్రి హోటల్ మిలన్ ఐదో అంతస్తులో వున్న రూఫ్‌గార్డెన్‌లో బుఫేకమ్ డ్రింక్ పార్టీ సాగుతోంది.

పార్టీలో ఒక మంత్రి కూడా వున్నాడు. నూరు మంది పైన అతిథులు వున్నారు.

రంగరాజూ, తనూ స్కాచ్ విస్కీ సేవిస్తూ మాట్లాడు

కుంటున్నారు.

"మీ ఫాక్టరీ అమ్మనని మీరు అన్నందుకు నేను చాలా సంతోషిస్తున్నాను," అన్నాడతను.

"నన్ను అర్థం చేసుకున్నారు, థాంక్స్" అన్నాడు రంగరాజు.

విస్కీతో నిండిన గ్లాసులు పట్టుకుని తనూ, రంగ రాజూ పిట్టగోడ పక్కనే నిలబడ్డారు. తను కిందకు చూశాడు. అక్కడ ఆగివున్న కార్లు కనిపిస్తున్నాయి.

వాళ్ళ చేతుల్లోని గ్లాసులు ఖాళీ అయ్యాయి. తను విస్కీ బాటిల్ తీసుకుని రెండు గ్లాసుల్లోనూ మళ్ళా నిండుగా పోశాడు.

రంగరాజు కొద్దిగా తూలుతున్నాడు. అది తను గమ నించాడు. నలువైపులా చూశాడు. ఎవ్వరూ తనువైపు చూడ్డంలేదు.

అమాంతంగా తను రంగరాజును పిట్టగోడమీదనుంచి బయటకు నెట్టేశాడు. పక్కకు తిరిగి చూశాడు. ఒక యువతి తనవైపు చూస్తోంది. ఆమె జరిగింది గమనించి వుంటుంది.

తను వేగంగా ఆ యువతి పక్కకు జరిగాడు.

"నువ్వు నా భార్యవు కాబోతున్నావు. నిన్ను నేను వెంటనే పెళ్ళాడ్తాను. నన్ను కాపాడు!" అన్నాడు తగ్గు స్వరంలో.

"ఒప్పుకుంటున్నా" అందామె.

రంగరాజు కిందపడి మరణించాడు. తర్వాత ఆ ఫాక్టరీని తను కొనేశాడు.

ఆ పరిస్థితుల్లో తను పెళ్ళి చేసుకున్న యువతే తన భార్య రాధ!

అతను కనురెప్పలు చిట్లిస్తూ ఆమెవైపు చూశాడు.

"రాధా, రంగరాజు ఏమయ్యాడో నువ్వు చూశావు. కాని నాయర్ విషయం నువ్వు చెప్పినదాకా నాకు తెలియదు" అన్నాడతను.

"నువ్వు ఎప్పుడూ నిజం చెప్పవు. నాయర్ నాకు ఫోన్ చేసి మాట్లాడాడు. నిన్న రాత్రి అతడిని ఆ రైలు పట్టాల ప్రాంతంలో నిలబడమని నువ్వు చెప్పావట. అక్కడకు తొమ్మిది తర్వాత, పట్టాల పక్కన అతడిని నువ్వు ఎందుకు కల్సుకోవలసి వచ్చింది?" అడిగిందామె.

ధనంజయరావు జవాబివ్వలేదు. నాయర్ తన భార్యకు ఫోన్ చేయొచ్చు అనేదాన్ని గురించి అతడు ముందుగా ఆలోచించలేకపోయాడు.

రాధ దేవాంతకురాలు! ఆనాడు రంగరాజుకి జరిగింది చూసింది. నిన్న రాత్రి నాయర్ని తను అక్కడ వుండమన్నది ఆమెకు తెలుసు. అతడి మెదడులో తీవ్రంగా ఆలోచనలు సాగుతున్నాయి.

"అక్కడ వుండమన్నాను. కాని మరో పనిలో మునిగిపోయి దాని విషయమే మర్చిపోయాను" అన్నాడతను.

రాధ వెటకారంగా నవ్వింది.

"నీది చాలా మెథాడికల్‌గా నడిచే బుర్ర. నువ్వు ఏ విషయం మర్చిపోవు! నాయర్ పట్టాల దగ్గరకు వెళ్ళి నీకోసం ఎదురుచూస్తూ నిలబడ్డాడు. అదే రాత్రి ట్రెయిన్ కిందపడి చచ్చాడు. రంగరాజు పిట్టగోడమీద నుంచి కిందపడ్డాడు. నాయర్ పట్టాలమీద పడి ట్రెయిన్ చక్రాల కింద నలిగిపోయాడు. ఆనాడు రంగరాజును తోసినట్లే నువ్వు ఏదో చేసుంటావు!"

ధనంజయరావు లోలోపల గాభరాపడినా పైకి ప్రదర్శించకుండా జాగ్రత్తపడ్డాడు.

"నువ్వు అలా అనుకుంటే నేనేమీ చెయ్యలేను."

రాధ అతడి పక్కనే కూర్చుంది.

"మీ ఆఫీసులో పనిచేసే ప్రేమతో నువ్వు ఆడే నాటకం ఏమిటి?" అడిగిందామె.

"అదంతా నాయర్ చెప్పాడా?"

"చెప్పాడు. నిన్ను ఒక కంటితో చూస్తూవుండమని నాయర్‌కి నేను చెప్పాను. అది నువ్వు గ్రహించి వుంటావు. అతడిని నీ తోవలోంచి తొలగించావు!"

"కావచ్చు!" అన్నాడతను.

"రంగరాజు, నాయర్! వాళ్ళను గురించి నేను మాట్లాడితే నీకు ప్రమాదం. నేను చెప్పింది నువ్వు వెంటనే చెయ్యాలి! ప్రేమ నీ కంపెనీలో వుండకూడదు. ఆమెను పొమ్మను! ఆమెను నువ్వు మళ్ళా ఎప్పుడూ కలుసుకోకూడదు!"

"అలా చెయ్యకపోతే?"

"రంగరాజు ఎలా మరణించాడో బయటపడుతుంది. నాయర్‌కి ఏమైందో తెలుస్తుంది."

"రంగరాజు వాళ్ళ విషయం యింతకాలం దాచిపెట్టినందుకు నువ్వు నాతో యిరుక్కుంటావు!" అన్నాడతను.

"నేను ఏమయినా ఫరవాలేదు. నిన్ను నాశనం చేస్తాను. ఈనాడు అనేకమంది నిన్ను గొప్ప పారిశ్రామికవేత్తగా భావిస్తున్నారు. నీ నిజరూపాన్ని వాళ్ళకు చూపిస్తాను. నీ మొహంమీద అందరూ ఉమ్మేతారు!"

అతడు లేచాడు. టేబుల్ మీదున్న స్కాచ్ విస్కీని

ఒక గ్లాసులో పోసుకుని, సోడా కలిపాడు. తాగుతూ ఆమెవైపు చూశాడు. అతడి మెదడులో ఆలోచనలు సాగుతున్నాయి.

"రాధా, నువ్వు చెప్పినట్లు చేస్తాను. ప్రేమను పంపించేస్తాను. నాకు రెండు వారాలు టైము కావాలి."

"రెండు వారాలు టైము యిస్తున్నాను. ఈ గడువు యింక పొడిగించబడదు!"

అతడు గ్లాసులోని విస్కీని తాగేసి మళ్ళా పోసుకున్నాడు.

అతడివైపు అదోలా చూస్తూ రాధ తన గదిలోకి వెళ్ళిపోయింది.

విస్కీ తాగుతూ అతడు పరుపుమీద కూర్చున్నాడు. అతడి మెదడులో ఆలోచనలు సాగుతున్నాయి. రంగరాజునీ, నాయర్ని తొలగించినట్లే తను రాధను తన బాటనుంచి తొలగించాలి!

రాధ చావాలి! రెండు వారల్లో ఆమె మరణించాలి!

## 6

హేండ్ బాగ్ లోని నకిలీ ఉంగరాన్ని పొరబాటున వేలుకి పెట్టుకుని ప్రేమ ఆఫీసుకు వెళ్ళిపోయింది.

ఆమె హేండ్ బాగ్ లో వున్న మరో ఉంగరాన్ని రహస్యంగా తీసి రామచంద్రమూర్తి జేబులో దాచుకున్నాడు.

ఆమె వెళ్ళిపోగానే అతడు యింటికి తాళంవేసి బయటకు నడిచాడు.

ఆమె హేండ్ బాగ్ లో ఒకేరకమైన రెండు ఉంగరాలు వుండడం అతడు గమనించాడు. ఒక వుంగరాన్ని ఆమె తనకు చూపించి, ఒక రూపాయి యిచ్చి కొన్నానని

చెప్పింది. ఈ రెండో వుంగరం ఆమె బాగ్‌లో ఎందుకు వుంది?

బస్ స్టేండ్ వైపు నడుస్తూ అతడు ఆలోచిస్తున్నాడు. రెండో వుంగరాన్ని తనకోసం కొని ఆమె యివ్వడం మర్చిపోయిందా?

అతడు బస్సు ఎక్కాడు. అరగంట ప్రయాణం చేసి ఒకచోట దిగాడు. పాపాలాల్ అండ్ కంపెనీ బోర్డు చూసి అతడు మెట్లెక్కి పైనున్న షాపులోకి వెళ్ళాడు.

ప్రొప్రయిటర్ పాపాలాల్ అతడిని నవ్వుతూ ఆహ్వానించాడు.

“ఏం కావాలి సార్?” అన్నాడు పాపాలాల్.

రామచంద్రమూర్తి జేబులోంచి వుంగరం తీశాడు.

“దీని విలువ ఎంత వుంటుందో చెప్పగలరా?” అడిగాడతను.

పాపాలాల్ ఉంగరాన్ని తీసుకుని పరీక్షగా చూశాడు.

“ఇది చాలా ఖరీదైనది, సార్” అన్నాడతను.

“ఎంతకి కొనచ్చు?”

“లక్షపైన కళ్ళు మూసుకుని యివ్వొచ్చు.”

రామచంద్రమూర్తి గుండె స్తంభించిపోయినట్లు అయింది. అతడు మెల్లిగా తేరుకున్నాడు.

“మీరు కొంటారా?”

పాపాలాల్ అతడివైపు సూటిగా చూశాడు.

“ఇది మీదని రుజావు చేయగల్గితే మేం తప్పక కొంటాం.”

“మీరు ఎంత యిస్తారు?”

“లక్షా పదివేలు యిస్తాం.”

రామచంద్రమూర్తి వుంగరాన్ని తీసుకుని జేబులో పడేసుకున్నాడు.

"అంత ఖరీదైన వుంగరం జేబులో పెట్టుకుని తిరక్కూడదు. ఎవరేనా కొట్టేస్తారు!" పాపాలాల్ హెచ్చరించాడు.

రామచంద్రమూర్తి మెట్లు దిగి పేవ్ మెంటుమీద నడవసాగాడు. ప్రేమ యీ వుంగరాన్ని రూపాయికి కొన్నానంది. కాని దాని ఖరీదు లక్షా పదివేలు!

అంత ఖరీదైన వుంగరం ప్రేమకు ఎలా వచ్చింది? ఎవరిచ్చారు?

అతడు ఆఫీసుకు వెళ్ళలేదు ఇంటికి పోయి పడుకుని ఆలోచించసాగాడు. గతం గుర్తుకొచ్చింది.

బస్ స్టేండులో అతడు ఆమెను చూశాడు. ఆమె అతడికి నచ్చింది. పెళ్ళి చేసుకుంటానని అన్నాడతను. ఆమె మావయ్యతో మాట్లాడి అంతా నిశ్చయం చేశాడు. నెల తిరిగేలోగా అతడితో ఆమె పెళ్ళి అయిపోయింది.

పెళ్ళయినాక ఆమెతో అతడు మద్రాసులో కాపురం పెట్టాడు. అతడికొచ్చే కొద్ది జీతంతో జీవితం సాగిపోతోంది.

తను కూడా ఉద్యోగం చేస్తానని అందామె. ఈ రోజుల్లో భార్యాభర్తలిద్దరూ ఉద్యోగాలు చేయడం మంచిదని అందామె. అతడు ఒప్పుకున్నాడు.

తనకొచ్చే 600కి ఆమె జీతం కలిపితే యింకా బాగా జీవించవచ్చని అతడు ఆశించాడు.

ధనంజయరావు కంపెనీలో 300 జీతంమీద ఆమె టైపిస్టుగా చేరింది. రెండు నెలల్లో ఆమె బాస్ కి టైపిస్టు అయింది. ఆమె జీతం 750కి పెరిగింది.

ఆరు నెలల్లో ఆమె యింతా పెరిగిపోయింది. బాస్ కి పెర్సనల్ సెక్రటరీ అయింది. ఆమె జీతం రెండువేలు అయింది.

ఆఫీసు కారు పొద్దుటే వచ్చి ప్రేమను తీసుకు వెళ్తుంది. రాత్రి ఆఫీసు కారు ఆమెను యింటిముందు దింపుతుంది.

అంతేకాదు. లక్షరూపాయలు పైన విలువ చేసే డైమెండ్ రింగ్! ఆమెకు కంపెనీ పెద్ద యిల్లు కూడా యివ్వబోతోంది.

అతడి బుర్ర ఆలోచనలతో వేడెక్కుతోంది. ఆమెను మనస్ఫూర్తిగా అతడు ప్రేమించాడు. ఇంత వేగంగా తారాజువ్వలా ఆమె పైకి ఎలా ఎగరగల్గింది?

నాలుగేళ్ళ పైగా అతడు సేల్స్‌మన్‌గా పనిచేస్తున్నాడు. కాని ఒక మెట్టు కూడా పైకి వెళ్ళలేక పోయాడు.

ప్రేమ తనకు ద్రోహం చేస్తోందా? తనకు తెలియకుండా ధనంజయరావుతో ఆమె అక్రమ సంబంధాన్ని ఏర్పర్చుకుందా?

పెళ్ళికి ముందు ఎంతో అమాయకంగా వుండే ప్రేమలో ఎంత మార్పు! ఆమె సృష్టించిన ప్రవాహంలో తను కాగితం పడవలా కదిలి పోవలసి వస్తోంది!

ఆలోచించి, అలిసిపోయి అతడు నిద్రపోయాడు. భోజనం కూడా చేయలేదు.

ఎవరో తలుపును తట్టారు. అతడు మేలుకొని లేచాడు. గదిలో చీకటి!

అతడు లైట్ స్విచ్ నొక్కాడు. లైట్ వెల్గింది. అతడు చాలాసేపు పడుకుని వుండాలి. మెల్లిగా వెళ్ళి

తలుపు తెర్చాడు.

ప్రేమ హాల్లోకొచ్చింది. అలసటగా ఆమె పేము కుర్చీలో కూర్చుంది.

"కాఫీ తేనా?" అన్నాడతను.

ఆమె అతడివైపు సూటిగా చూసింది.

"ఏమిటి అలా వున్నారు?" అందామె.

"ఒంట్లో ఎలాగో వుంది. ఎక్కువగా నిద్రపోయాను. మరేం ఫరవాలేదు" అన్నాడతను.

"కంపెనీ యిచ్చిన యింటికి రేపు మారిపోదాం" అందామె.

"అలాగే మారుదాం" అన్నాడతను.

ఆమె కుర్చీలోంచి లేచి అతడి దగ్గరకు వచ్చింది.

"మీరు మొహం కడుక్కురండి. కొంచెం విశ్రాంతి తీసుకుంటే మీ ఆరోగ్యం బాగుపడుతుంది" అందామె.

అతడు జవాబివ్వలేదు. లోపలకు వెళ్ళాడు. చన్నీళ్ళతో మొహం కడుక్కున్నాడు.

పడగ్గదిలోకి వెళ్ళి తువ్వాలుతో మొహం తుడుచుకున్నాడు.

ఆమె దుస్తులు మార్చుకుంటోంది. ఆమెవైపు అతడు చూడలేదు.

హాల్లో వున్న పేము కుర్చీలో కూర్చున్నాడు. సిల్కు మేక్సీ ధరించి ఆమె హాల్లోకొచ్చింది.

"ఇదెలాగుంది?" అందామె.

"చాలా బాగుంది" అన్నాడతను.

"బాస్‌కి గార్మెంట్స్ ఫాక్టరీ వుంది. అక్కడ యిది కుట్టబడింది. ఆఫీసులో పనిచేసే వాళ్ళకు యివి తక్కువ ధరకు యిస్తారు" అందామె.

"ఎంతకిచ్చారు?"

"పదిరూపాయలు" అందామె.

"డామ్ చీప్!" అన్నాడతను.

"మీ కోసం రెండు టీ షర్టులు తెచ్చాను" అని ఆమె పడగ్గదిలోకి వెళ్ళింది.

పోలిథీన్ కవర్లలో వున్న రెండు టీ షర్టులను అతడికిచ్చింది.

"బాగున్నాయి!" అన్నాడతను.

"వేసుకు చూడండి! సైజు కుదరకపోతే రేపు మార్చి తెస్తాను" అందామె.

"రేపు వేసుకుచూస్తానులే" అన్నాడతను నిర్లిప్తంగా.

## 7

ధనంజయరావు టైము చూశాడు. పన్నెండు దాటింది. గదిలో ఫ్లోరసెంట్ లైట్ వెలుగుతోంది.

అతడు డ్రాయర్ లాగి అందులో వున్న సిరంజిని తీశాడు. ఇన్సులిన్ని సిరంజిలోకి ఎక్కించాడు. మెల్లిగా రాధ గది ముందుకు వెళ్ళాడు.

లోపలనుంచి ఆమె తలుపు వేసుకోలేదు. తలుపు తోసి అతడు లోపలకు వెళ్ళాడు.

జీరో వాట్ బల్బ్ వెలుగుతోంది. రాధ నిద్రపోతూ వుండాలి!

అతడు స్విచ్ నొక్కాడు. గదిలోని లైట్ వెల్గింది. అతడు పరుపువైపు నడిచాడు. అతడు వూహించినట్లే ఆమె నిద్రపోతోంది.

మెల్లిగా సూదిని ఆమె చేతిలోకి పోనిచ్చాడు. వులిక్కిపడ్తూ ఆమె కళ్ళు తెర్చింది. చేత్తో సిరంజిని తోయడానికి యమ ప్రయత్నం చేసింది.

అతడామె చెయ్యిని మోకాల్తో నొక్కిపెట్టాడు. ఇంజక్షన్ సూదివున్న చెయ్యిని ఆమె కదిల్చింది. కాని అప్పటికప్పుడే యిన్సులిన్ ఆమెలోకి ప్రవహించింది.

అతడు సిరంజిని లాగేశాడు. ఆమె లేచి కూర్చుంది. అతడివైపు చూసింది.

"నాకు ఏమిటి యింజెక్షన్ యిచ్చావు?" ప్రశ్నించిందామె.

అతడు హేళనగా నవ్వాడు.

"నీ ఆరోగ్యం బాగాలేదు! హాయిగా నిద్రపో!" అన్నాడతను.

ఇన్సులిన్ మూలంగా ఆమె రక్తంలోవుండే షుగర్ తగ్గిపోయింది. ఆమె అతడివైపు చూస్తోంది. కాని చూపు సరిగ్గా ఆనడంలేదు. కళ్ళు తిరుగుతున్నాయి.

ఆమె వెనక్కుపడి నిద్రపోయింది. ఆమె నాడిని అతడు పరిశీలించాడు.

రాధ తనకు రెండు వారాలు గడువు యిచ్చింది. రెండు వారాల్లో ఆమె పైకి ఎగిరిపోవాలి!

అతడు స్విచ్ ఆఫ్ చేసి తన గదిలోకి వచ్చాడు. సిరంజిని డ్రాయర్లో దాచేశాడు.

గ్లాసులో స్కాచ్ విస్కీ పోసుకుని సోడా కలిపాడు. తాగుతూ పడగదిలోని సోఫాలో కూర్చున్నాడు.

పక్కనున్న రిసీవర్ ఎత్తి అతడు ఒక నంబరు తిప్పాడు.

"హలో!" అంది ప్రేమ.

"కాంత యింట్లో ఎలా వున్నావు?"

"అఖండంగా వుంది. ఆయన యివాళ తొమ్మిదికే పడుకున్నారు" అందామె.

"అక్కడ నీ భర్తా, యిక్కడ నా భార్యా తొందరగా పడుకుంటే మనకు సమస్యలు వుండవు" అన్నాడతను.

"యూ ఆర్ రైట్" అందామె.

"ప్రేమా, యివాళనుంచి నీతో చెప్పినట్లు నా భార్యకు ట్రీట్ మెంట్ ప్రారంభించాను. ఆమె మానంగా నిద్రపోతోంది" అన్నాడతను.

"ఆమె రేపు లేస్తుందా?"

అతడు నవ్వాడు.

"రేపు నేను లేవని స్తేగా? మరో యింజక్షన్ ఇస్తాను. ఆమె అనారోగ్యంగా వుంది. ఎవ్వరూ ఆమె గదిలోకి వెళ్ళకూడదని చెప్తాను. పేరుకి డాక్టర్ కూనయ్య ట్రీట్ మెంట్ లో వుంటుందామె."

"ఇదంతా వింటూంటే నాకు భయంగా వుంది!" అంది ప్రేమ.

"ప్రేమా, ఇంతవరకూ ప్రేయసీ ప్రియులకు అడ్డొచ్చి వాళ్ళను చంపేసిందీ లోకం. ఇప్పుడు ప్రేయసీప్రియులు వాళ్ళ ప్రేమకు అడ్డొచ్చిన వాళ్ళను నిర్మూలించి కసి తీర్చుకోవాలి!"

"మీరు యిక్కడకు వెంటనే రండి" అందామె.

"నీ భర్త లేస్తాడేమో?"

"మీరిచ్చిన టాబ్లెట్ పాలల్లో కలిపి ఆయనకు యిచ్చాను. పాలు తాగి అవులిస్తూ ఆయన నిద్రపోయారు. పొద్దుటదాకా లేవరు" అందామె.

"ప్రేమా, వస్తున్నాను" అన్నాడతను.

రిసీవర్ పెట్టేసి ధనంజయరావు కిందకు దిగి తన గదివైపు వేగంగా వెళ్ళాడు.

# 8

వారం రోజులనుంచి రాధ కోమాలో వుంటోంది. డాక్టర్ కూనయ్య వస్తున్నాడు, వెళ్తున్నాడు. ఆమె గదిలోకి ధనంజయరావు తప్ప ఎవ్వరూ వెళ్ళడంలేదు.

ఒకరోజు రాత్రి భోజనం చేస్తూండగా అతడి ఇద్దరు పిల్లలూ అమ్మను గురించి అడిగారు.

“అమ్మకెలా వుంది?” అడిగింది ఆరేళ్ళ విజయ.

“అమ్మ యిక్కడకు రాదా?” అడిగాడు నాలుగేళ్ళ నాగేష్.

ధనంజయరావు వాళ్ళవైపు నవ్వుతూ చూశాడు.

“మీ అమ్మ ఆరోగ్యం త్వరలో బాగుపడుతుంది. డాక్టర్ కూనయ్య ఆమె కోసం ఎంతో పాటుబడుతున్నాడు” అన్నాడతను.

“అమ్మను మేం చూడొచ్చా?” అడిగింది విజయ.

“తప్పక చూడొచ్చు. భోజనం అయాక నేను మిమ్మల్ని ఆమె గదిలోకి తీసుకు వెళ్తాను” అన్నాడతను.

భోజనాలు అయ్యాక పిల్లల్ని ఆమె గదిలోకి తీసుకెళ్ళాడతను. రాధ మగత నిద్రలో వుంది. పిల్లలు ఆమెను చూస్తూ నిలబడ్డారు.

“ఇప్పుడు మీరు మీ గదికెళ్ళి హాయిగా పడుకోండి. మీ అమ్మ ఆరోగ్యం త్వరలో బాగుపడుతుంది” అన్నాడతను.

ఆయా పిల్లల్ని తీసుకుని వాళ్ళ గదివైపు వెళ్ళిపోయింది.

ఆ రోజు ఆదివారం. రాత్రి ఎప్పుడో రాధ మరణిం

-చింది.

పొద్దుటే డాక్టర్ కూనయ్య వచ్చి ఆమెను చూశాడు. చనిపోయిందని చెప్పి అతడు వెళ్ళిపోయాడు.

ధనంజయరావు తన పిల్లల్ని ముందు పెట్టుకుని ఏడుస్తూ కూర్చున్నాడు. అనేకమంది వచ్చి శవాన్ని చూసి వెళ్ళి పోయారు.

ప్రేమ విచారవదనంతో వచ్చింది. ధనంజయరావు ఆమెవంక ఏడుస్తూ చూశాడు.

"ప్రేమా, నువ్వు యివాళ యిక్కడే వుండు. నన్ను వదిలి వెళ్ళిపోవ" అన్నాడు తగ్గు స్వరంలో.

అతడి చుట్టూ అనేకమంది వున్నారు.

"రాధ నా భార్యగా పదేళ్ళుబాటు జీవించింది. నా కిద్దరు పిల్లల్నియిచ్చింది. ఆమెను నేను మర్చిపోలేను" అన్నాడతను అందరూ వినేటట్లు.

సూర్యాస్తమయం అయే లోపల వాన్‌లో ఆమె శవాన్ని స్మశానానికి తీసుకుపోయారు. వేలాది ప్రజల సమక్షంలో రాధ శరీరం దహనం చేయబడింది.

చీకటి పడ్డాక ధనంజయరావు ఇంటికి తిరిగివచ్చాడు. ప్రేమ అతడికోసం అక్కడే వేచి వుంది.

ప్రేమను తన పడగ్గదిలోకి తీసుకెళ్ళాడతను. నవ్వుతూ ఆమెవైపు చూశాడు.

"ప్రేమా, మన ప్రేమకు అడ్డుగా నిలబడిన నా భార్య వెళ్ళిపోయింది" అన్నాడతను.

ఆమె అతడివైపు నవ్వుతూ చూసింది.

"మొదట్లో నేను భయపడ్డాను. ఎవ్వరూ అనుమానించకుండా మీరు ఆమెను పంపగలిగారు" అందామె.

ధనంజయరావు ఆమెను కౌగలించుకుని, పెదిమలను

ముద్దెట్టుకున్నాడు.

"ప్రేమా, నువ్వు నాతో యిక్కడ, యీ భవనంలో వుండాలి!"

"నా భర్త వుండగా అది సాధ్యంకాదు" అందామె.

"నీ భర్తకు కూడా రాధకిచ్చిన ట్రీట్ మెంట్ యివ్వాలి!"

"నాకు భయంగా వుంది" అందామె.

"నీకు నామీద నమ్మకం వుందా?"

"వుంది."

"అయితే అంతా నాకు వదిలేయి. ఏం చేయాలో నేను చూస్తాను."

"మీరు చెప్పినట్లే చేయండి" అందామె.

రాత్రి పదిదాటాక అతడు కారులో తీసుకువెళ్ళి ఆమెను యింట్లో దింపాడు.

ఆమె వెళ్తూ వెనక్కి తిరిగి అతడివైపు చూసింది. అతడు బైబై చెప్పాడు.

కారును వెనక్కి తిప్పి అతడు గేటుదాటి పోనిచ్చాడు. ఇప్పుడతడికి ఆనందంగా వుంది. ఏదో బాండెడ్ లేబరీనుంచి బయటపడినట్లు భావిస్తూ అతడు కారును పోనిచ్చాడు.

# 9

గదిలో లైటు వెలుగుతోంది. పరుపుమీద అతడికి ఎదురుగా ఆమె కూర్చుంది. అతడామెవైపు సూటిగా చూశాడు.

"ప్రేమా, నిన్ను ప్రేమించి నేను పెళ్ళాడాను. కొంతకాలంపాటు మన జీవితం సుఖంగా సాగింది. కాని యిప్పుడు ఎన్నో లోపాలు నాకు కనిపిస్తున్నాయి"

అన్నాడతను.

ఆమె మాట్లాడలేదు.

"ప్రేమా, ఒక రోజు ఓ వుంగరం నాకు చూపించి రూపాయిచ్చి కొన్నానన్నావు. ఆ వుంగరం తీసుకువెళ్ళి నేను పాపాలాల్‌కి చూపించాను. దాని వెల లక్షా పది వేలు వుంటుందని పాపాలాల్ చెప్పాడు. ఆ వుంగరం గురించి నాతో ఎందుకు అబద్ధం చెప్పావు?"

ఆమె మాట్లాడలేదు.

"ప్రేమా, ఒక విషయం గుర్తుంచుకో! నువ్వు ఏం చేసినా నేను ఆనందిస్తాను. నువ్వు యీ లోకంలో విజయాన్ని సాధించినందుకు నేను సంతోషిస్తున్నాను."

"మీతో అబద్ధం చెప్పినందుకు నన్ను క్షమించండి. ఆ డైమండ్ రింగ్‌ను నా బాస్ సింగపూర్‌లో కొని తెచ్చి నాకిచ్చారు. మరో నకిలీ రింగుకూడా ఆయనే యిచ్చారు" అందామె.

అతడు ఆమెవైపు చూశాడు.

"ఈ యింటికి నువ్వు ఎంత అద్దె యివ్వాలి?" అడిగాడతను.

"నాకింకా తెలియదు."

"ప్రేమా, నిజం చెప్పు! నన్ను చూసి భయపడి అబద్ధం చెప్పకు. నేను నీ తోవకు అడ్డురాను. అవుసరమైతే నీకు పూర్తిగా స్వేచ్ఛ చేకూర్చి నేను బయటకు పోగలను."

ఆమె తీవ్రంగా ఆలోచిస్తోంది. అతడు ఆమెవైపే చూస్తున్నాడు.

"ప్రేమా, ధనంజయరావుకి నీనుంచి ఏం కావాలి?"

మెల్లిగా ప్రశ్నించాడతను.

"నేనంటే ఆయనకెంతో ప్రేమ. నేను లేకుండా ఆయన బ్రతకలేరు. ఈ ఇల్లు నా పేర ఆయన కొన్నారు" అందామె ధైర్యంగా.

అతడామె చెయ్యి పట్టుకున్నాడు.

"నిజం చెప్పినందుకు నిన్ను మెచ్చుకుంటున్నాను. నాకంటె వెయ్యిరెట్లు గొప్పవాడు నిన్ను అంతగా ప్రేమిస్తున్నందుకు సంతోషం. కాని నువ్వు అతడి పుంపుడుగత్తెగా వుండడం నాకిష్టంలేదు. నేను నీకు విడాకులిచ్చేస్తాను. అటుపైన ఆయనతో నీ పెళ్ళి అయేటట్లు చూస్తాను. నేను ఎల్లప్పుడూ కోరేది నీ ఆనందం" అన్నాడతను.

అతడివంక ఆమె ఆశ్చర్యంగా చూసింది.

టెలిఫోన్ మ్రోగింది. ఆమె ఫోన్‌వైపు వెళ్ళింది. రామచంద్రమూర్తి బాత్‌రూంలోకి వెళ్ళి తలుపు దగ్గరగా మూశాడు.

"హలో!" అందామె.

"ప్రేమా, యీ రాత్రినుంచి నీ భర్తకు ట్రీట్‌మెంట్ ప్రారంభిస్తాను. రెండు వారాల్లో అంతా అయిపోతుంది. అటుపైన మనం స్వేచ్ఛగా జీవించవచ్చు" అన్నాడు ధనంజయరావు.

"అదంతా అనవసరం" అందామె.

"ప్రేమా, ఏమైంది?"

"నా భర్తతో మన్ని గురించి అంతా చెప్పేశాను. ఆయన నా తోవకు అడ్డురానన్నారు. మీరు యిక్కడకు వచ్చి ఆయనతో మాట్లాడవచ్చు" అందామె.

"ప్రేమా, నీ భర్తని మెచ్చుకుంటున్నాను. మనం ముగ్గురం కూర్చుని మాట్లాడుదాం. ఏం చేయవలసిందీ ఆలోచిద్దాం."

"వెంటనే రండి" అందామె.

రామచంద్రమూర్తి గదిలోకొచ్చాడు.

"ఆయన యిక్కడకొస్తున్నారు. మనం మాట్లాడి అంతా సెటిల్ చేద్దాం అన్నారు" అందామె.

"గుడ్! మనలా యితర్లు తమ సమస్యలను పరిష్కరించుకో గల్గితే లోకంలో పోట్లాటలూ, హత్యలూ వుండవు" అన్నాడతను నవ్వుతూ.

# 10

పోర్టికోలో కారాపి ధనంజయరావు వుషారుగా కిందకు దిగాడు.

ముందు తలుపు తెర్చి వుంది. అతడు మెట్లెక్కి పైకి వెళ్ళాడు. ప్రకాశవంతంగా లైటు వెల్గుతున్న పడగ్గది లోకి ప్రవేశించాడు.

అక్కడి దృశ్యాన్ని చూసి తారెత్తిపోయాడు. గుండె దడ దడ కొట్టుకుంది.

రక్తం మడుగులో ప్రేమ వెల్లకిలా పడివుంది. పక్కనే పడున్నాడు రామచంద్రమూర్తి. అతడి కడుపులో కత్తి దిగివుంది.

బయటనుంచి కారు ఆగిన చప్పుడు వినపడింది. ఇన్స్పెక్టర్ రాజన్, నలుగురు కాన్స్టేబులతో గదిలోకొచ్చాడు.

"ఇక్కడనుంచి మాకెవరు ఫోన్ చేశారు?" అన్నాడు యిన్స్పెక్టర్.

నేలమీద పడున్న రామచంద్రమూర్తి మూలుగుతూ యిన్స్పెక్టర్‌కి సౌజ్ఞ చేశాడు.

ఇన్స్పెక్టర్ అతడి దగ్గరకు వెళ్లాడు.

"ఏమిటైంది? ఎవరు పొడిచారు మిమ్మల్ని?"

రామచంద్రమూర్తి తన వేలును ధనంజయరావువైపు చూపించాడు.

"నా పెళ్లాన్ని, నన్నూ పొడిచేశాడు ...ఆయనే!" అని అతడు పక్కకు పడ్డాడు.

ఇన్స్పెక్టర్ రాజన్ అతడి నాడిని పరీక్షించాడు. నీరసంగా కొట్టుకుంటోంది.

"ఇతడిని వెంటనే హాస్పిటల్‌కు తీసుకు వెళ్ళండి" అన్నాడు యిన్స్పెక్టర్ ఒక కాన్స్టేబులుతో.

రామచంద్రమూర్తిని యిద్దరు పోలీసులు కిందకు మోసుకుపోయారు. కారు కదిలిన చప్పుడు బయటనుంచి వినబడింది.

రక్తం మడుగులో పడున్న ఆమెను పరీక్షించి యిన్స్పెక్టర్ ధనంజయరావు వైపు చూశాడు.

"మీ పేరు?"

"ధనంజయరావు."

"వీళ్ళను ఎందుకు పొడిచి చంపారు?"

"నేను చంపలేదు. నేను యిక్కడకు వచ్చేసరికి వీళ్ళు ఆ స్థితిలో వున్నారు."

"కొన వూపిరితో ఆయన చెప్పిన మాటలకు కోర్టు ఎక్కువ విలువ యిస్తుంది" అన్నాడు యిన్స్పెక్టర్.

"ఆ కత్తి పిడిమీద నా వేలిముద్రలు వుండవు! పరీక్షించి చూడండి!"

"మీరు తుడిచిపారేస్తే వుండకపోవచ్చు!" అన్నాడు యిన్‌స్పెక్టర్.

"నాకు యీ హత్యలతో సంబంధంలేదు" అన్నాడు ధనంజయరావు కోపంగా.

"అది తర్వాత కోర్టులో తేలుంది. మర్డర్ చార్జి మీద మిమ్మల్ని అరస్టు చేస్తున్నా" అన్నాడు యిన్‌స్పెక్టర్ గంభీరంగా.

—: అయిపోయింది: —

# స్లో పాయిజన్

## జొన్నలగడ్డ రామలక్ష్మి

"మీరు రాత్రి రెండింటికి ఇంటికొచ్చారు—" అంది శైలజ.

"టైము చూడలేదు. కానీ ఆలస్యంగా వచ్చానని తెలుసు—" అన్నాడు ముత్యాలరావు అలక్ష్యంగా.

"ఆలస్యం ఎందుకయింది?"

"క్లబ్బులో పేకాడుతున్నాను. స్నేహితుల బలవంతంమీద చాలా సేపుండిపోయాను. టైము తెలియలేదు—"

"మీరు క్లబ్బునుంచి రాత్రి పదింటికే బయల్దేరారు" అంది శైలజ తాపీగా.

ముత్యాలరావు తడబడుతూ—"ఏమో—నేను టైము చూడలేదు—" అన్నాడు.

"టైము చూసినా చూడకపోయినా క్లబ్బునుంచి ఇంటికి రావడానికి పావుగంట చాలు. కానీ మీకు నాలుగు గంటలు పట్టింది—" అంది శైలజ.

"అయితే ఏమంటావ్?"

"మీరు రీటా యింటినుంచి మనింటికి వచ్చారని నాకు తెలుసు—"

ముత్యాల్రావు కంగారుగా — "రీటా యెవరు?" అన్నాడు.

"క్లబ్బునుంచి మనింటికి రావడానికి నాలుగ్గంటలు పట్టడానికి కారణమేమిటీ అని ఆలోచించండి. రీటా ఎవరో గుర్తు వస్తుంది—"

"నువ్వు నామీద డిటెక్టివుల్ని నియమిస్తున్నావా?"

"రీటా ఎవరో గుర్తొచ్చిందా?" అంది శైలజ.

"ఇంతకీ నీ ఉద్దేశ్య మేమిటి?" అన్నాడు ముత్యాల్రావు.

"ఇంకా అర్థం కాలేదా?" అంది శైలజ.

భార్యాభర్తలిద్దరూ ఒకరివంక ఒకరు చూసుకున్నారు. ఎన్నికల్లో ప్రత్యర్థులు అనుకోకుండా ఒకరికొకరు ఎదురుపడితే బహుశా అలాగే చూసుకుంటారేమో!

"అర్థంకాలేదు—" అన్నాడు ముత్యాల్రావు.

"అర్థమయ్యేలా చెప్పమంటారా?" అంది శైలజ.

"వద్దు—" అన్నాడు ముత్యాల్రావు.

"నా మనసులోని మాటను క్లుప్తంగా ఒక్క మాటలో అదీ రెండక్షరాల్లో చెప్పారు. చాలా థాంక్స్!" అంది శైలజ.

"ఏమన్నావ్?"

"మీరు క్లబ్బుకు వెళ్ళవద్దు రీటా దగ్గరకు వెళ్ళవద్దు. వద్దు అంటే అర్థమిదే!" అంది శైలజ.

"ఎందుకని వెళ్ళకూడదు?"

"ఎందుకు వెళ్ళాలి?"

ముత్యాల్రావు అదోలా ఆమెవంక చూసి—"ముందు నా ప్రశ్నకు జవాబు చెప్పు. తర్వాత నీ ప్రశ్న సంగతి ఆలోచిస్తాను—" అన్నాడు.

"మీరు ఆఫీసునుంచి ఎప్పుడు వస్తారా అని నేను ఎదురు చూస్తూంటాను. నాకోసం మీరు తిన్నగా ఇంటికి రావాలి. మనం కలిసి తిరగాలి. కష్టసుఖాలన్నీ కలిసి అనుభవించాలి—" అంది శైలజ.

"కష్టాలన్నీ నేను ఎప్పుడో అనుభవించేశాను. నాకు సుఖాలమీదనే మోజు——...."

"పోనీ మనిద్దరం ఎప్పుడూ కలిసివుంటే—అదే సుఖం కాదా!"

"నేను సుఖాలను వెతుక్కుంటున్నాను. నీ నుంచి దూరంగా పోవడంలో నాకు సుఖం కనబడుతోంది. క్లబ్బులో సుఖం కనబడుతోంది. రీటాలో సుఖం కనబడుతోంది—...." తెగించి అన్నాడు ముత్యాల్రావు.

"ఈ విషయం మీరు నాకు పెళ్ళికిముందు చెప్పలేదు—"

"పెళ్ళికి ముందు ఈ విషయం నాకు తెలియదు .."

"నాలో సుఖం ఎందుకు కనిపించదు మీకు?" అంది శైలజ.

"అది నేనేం చెప్పగలను?"

"నేను మీ జీవితానికో అర్థాన్నిచ్చాను...."

"అర్థం అంటే డబ్బు అయితే నీ మాట నిజమే!"

శైలజ క్రూరంగా అతడివంక చూసింది—"పెళ్ళికి ముందు ఎన్ని కలలు కన్నాను? అయిన వాళ్ళందరినీ ఎదిరించి ఒప్పించి మిమ్మల్ని చేసుకున్నాను. చివరికిలాగ

యింది—"

"పెళ్ళయ్యాక బయట సుఖాలను వెతుక్కోవడం మగవాడికి సహజం. క్లబ్బులో నా స్నేహితులందరూ ఇదే పని చేస్తున్నారు...."

"అందుకే మిమ్మల్ని క్లబ్బుకి వెళ్ళొద్దంటున్నాను..."

"నేను వెడతాను...."

"వీల్లేదు...."

"నువ్వెవరు నన్ను శాసించడానికి?"

"కట్టుకున్న భార్యను. ఈ రోజునుంచీ మీరు నేను గీచిన గీటు దాటడానికి వీల్లేదు...."

"దాటడం సంగతి అటుంచు. నిన్నసలు గీత గియ్యనివ్వను...."

"అయితే ఏం జరుగుతుందో తెలుసా?"

"నీ బెదిరింపులకు నేను లొంగను...."

"నేను లొంగదియ్యగలను మిమ్మల్ని...."

ఉన్నట్లుండి ముత్యాలరావు అదోలా నవ్వాడు. అతడు చటుక్కున వీధి గుమ్మంలోకి వచ్చాడు. అలా దారిన పోతున్న ముష్టివాడొకడు కనిపించాడు. "ఒరేయ్— ఇలా రా!" అని ముత్యాలరావు వాణ్ని పిలిచాడు.

వాడు వెంటనే గుమ్మంలోకి వచ్చాడు. వాడి కళ్ళలో ఆశ మెరుస్తోంది.

ఆ ముష్టివాడి వయసు పాతికేళ్ళకు మించదు. మనిషి దృఢంగానే ఉన్నాడు. రంగు మరీ అంత నలుపు కాదు. గడ్డం బాగా మాసి వుంది. కళ్ళు లోతుకుపోయి ఉన్నాయి. ఆ కళ్ళలో ఆకలి....

ముత్యాలరావు జేబులోంచి ఓ రూపాయనోటు తీశాడు.

ముష్టివాడు ఆశగా చేతులు చాపాడు.

ముత్యాలరావు వాడికా నోటు అందించాడు. ముష్టివాడికి కలిగిన ఆనందమింతా అంతా కాదు. తనకు చేతనైనంతగా ముత్యాలరావును పొగిడి వెనక్కి తిరిగాడు వాడు.

అప్పుడు ముత్యాలరావు వాడిని ఫెడీమని తన్నాడు.

అనుకోకుండా దెబ్బ తగలడంవల్ల ముష్టివాడు బోర్లా ముందుకు పడిపోయాడు. వాడు మళ్ళీ లేవడానికి కొద్ది క్షణాలు పట్టింది.

"ఏంటి బాబూ ఇది!" అన్నాడు వాడు.

ముత్యాలరావు వాణ్ని సమీపించాడు. ముష్టివాడు భయంగా తన చేతిలోని రూపాయినోటును గట్టిగా పట్టుకుని — "ఇచ్చిన డబ్బు వెనక్కి తీసుకోడం అన్యాయం బాబూ!" అన్నాడు.

ముత్యాలరావు నవ్వి — "నేను డబ్బు తీసుకుందుకు రాలేదు. నేను నిన్ను అకారణంగా తన్నాను కదా— అందుకు నీకు కోపం వచ్చిందో లేదో తెలుసుకుందామని!" అన్నాడు.

"ముష్టి వెధవని—నాకోపమేమిటి బాబూ!" అన్నాడు వాడు.

"అయితే రోజూ ఇదే టైముకి ఇక్కడకు రా! ఓ రూపాయిచ్చి ఓ తాపు తంతుంటాను—" అన్నాడు ముత్యాలరావు.

ముష్టివాడు చటుక్కున అతడి పాదాలమీద వాలి— "తప్పకుండా వస్తా బాబూ!" అన్నాడు.

ముత్యాలరావు వెనక్కి తిరిగాడు. గుమ్మంలో నిలబడి శైలజ ఇదంతా చూస్తోంది. అతడామెను సమీపించి—

"అర్థమయిందా?" అనడిగాడు.

"ఏమిటి?" అంది శైలజ.

"నీ భర్త నువ్వు గీచిన గీటు దాటకూడదనుకుంటే— అదిగో ఆ వెళ్ళిపోతున్నాడే—అలాంటి వాణ్ని పెళ్ళాడాల్సింది నువ్వు...." అన్నాడతను.

శైలజ కళ్ళు ఎర్రబడ్డాయి. ఆమె చటుక్కున చప్పట్లు కొట్టి ఆ ముష్టివాణ్ని పిలిచింది. వాడు భయంగానే వెనక్కి వచ్చాడు.

"పదకొండింటికి రా—అన్నం పెడతాను—" అన్నాదామె.

ముష్టివాడి మొఖం సంతోషంతో వెలిగిపోయింది.

ముత్యాలరావు కామె మాటలు అర్థమయినట్లు లేదు. అర్థం చేసుకోవాలని ప్రయత్నించనూ లేదు. అయితే అతడికి కోపం మాత్రం వచ్చింది.

## 2

"ఈ రోజు మా ఆవిడతో పోట్లాడాను—"

"ఇన్నాళ్ళ తర్వాత ఇప్పుడా?" అన్నది రీటా.

"అంటే?"

"మీరు నా వద్దకు రావడం ప్రారంభించి రెండు నెలలు దాటింది. పోట్లాట ఎప్పుడో రావలసింది—...." అంది రీటా.

"మిగతా వాళ్ళకూ నాకూ చాలా తేడా వుందిగా.." అన్నాడు ముత్యాలరావు గర్వంగా. అతడి అభిప్రాయంలో రీటా వద్దకు వచ్చే మిగతా వాళ్ళు రహస్యాలను దాచిపెట్టలేరు.

"వాళ్ళకూ మీకూ మరో తేడా కూడా ఉంది!"

"చెప్పు...."

"నా వద్దకు వచ్చేవాళ్ళు కొంతమంది బ్రహ్మచారులు. పెళ్ళికి ముందు మీరు నా వద్దకు రాలేదు. అదొక తేడా! పెళ్ళయిన వాళ్ళెవ్వరూ పెళ్ళయిన ఒకటి రెండేళ్ళ దాకా నా వద్దకు రాలేదు. మీరైతే పెళ్ళయి అర్నెల్లయినా తిరక్కుండా...."

"ఇంకా ఏమైనా తేడాలుంటే చెప్పు...." అన్నాడు ముత్యాల్రావు.

"చెప్పను—" అంది రీటా.

"ఎందుకని?" అన్నాడు ముత్యాల్రావు.

"అది నా వృత్తి రహస్యం—" అని రీటా నవ్వి— "కానీ ఒక్క విషయం చెప్పగలను. నా వద్దకు వచ్చే వాళ్ళందరిలోనూ మీరంటేనే నాకు ఎక్కువ ఇష్టం—" అంది.

"ఈ పొగడ్త కూడా నీ వృత్తికి సంబంధించినదేనా?"

రీటా నవ్వి— "మీరెలాగనుకున్నా నాకు అభ్యంతరం లేదు. నా మనసులోని మాట చెప్పాను—" అంది.

ఉన్నట్లుండి ముత్యాల్రావు టైము చూసుకుని— "అబ్బా—అప్పుడే ఒంటి గంటయింది—" అన్నాడు.

"అప్పుడే ఒంటి గంటయిందా—మనిద్దరం ఒకచోట ఉన్నామంటే టైము తెలియదు...." అంది రీటా.

ముత్యాల్రావు లేచాడు.

"ఇంటికి వెళ్ళగానే పోట్లాట తప్పదేమో!" అంది రీటా మళ్ళీ.

"పోట్లాటా—మరోటా? పక్కన పేనులా పడుం టుంది. అది పెళ్లాం. నేను పెనుగుణ్ణి—" అన్నాడు ముత్యాల్రావు.

"నేను ఎవరికీ పెళ్ళాన్ని కాకపోవడం నా అదృష్ట మనిపిస్తోంది మీ మాటలు వింటూంటే—" అంది రీటా.

"అసలీ లోకంలోని ఆడవాళ్ళంతా నీవలాగే ఉండి పెళ్ళాలన్నవాళ్ళు లేకుండా ఉంటే ఇంకా చాలా బాగుండేదని నాకు అనిపిస్తుంది—" అన్నాడు ముత్యాల్రావు. తన కోరిక తీరేది కాదన్న దిగులు కూడా అతడి కళ్ళలో కనబడుతోంది.

"ఈ విషయమై మీ భార్య అభిప్రాయం కూడా అడిగి తెలుసుకోండి—" అంది రీటా.

ముత్యాల్రావు అదోలా నవ్వాడు. ఆ నవ్వులోనే ఆ యిల్లు వదిలాడతను. సరిగ్గా పావుగంటలో ఇల్లు చేరాడతను.

ఆ రోజు ఆశ్చర్యం....

రోజూ అయితే అతడు కాలింగ్ బెల్ మ్రోగించాల్సి వచ్చేది. ఆ రోజు తలుపులు తెరిచే ఉన్నాయి.

అతడు గుమ్మంలో అడుగు పెట్టగానే సోఫాలో కూర్చుని ఉన్న శైలజ కనబడింది. ఆమెకు ఎదురుగా ఓ యువకుడు కూర్చుని ఉన్నాడు. ఇద్దరి చేతుల్లోనూ పేకముక్కలున్నాయి.

ఎవరా యువకుడు? అన్నది ముత్యాల్రావు మెదడులో మొదటిసారిగా మెదలిన ప్రశ్న!

ఆ యువకుడి ముఖం అతడికి స్పష్టంగా కనబడుతున్నది. ఇంట్లో ఆ గదిలో ట్యూబ్ లైట్ ప్రకాశం పగలును మరిపించేలాగుంది.

అడుగుల చప్పుడు విని శైలజ చటుక్కున లేచి నిలబడి—"అరే—వచ్చేశారే—" అంది.

ముత్యాలరావు మాట్లాడలేదు. ఆమె వంకా ఆ యువకుడి వంకా ఓసారి మార్చి మార్చి చూశాడు.

"అరే—మరిచేపోయాను — మీట్ మై ఫ్రెండ్ కిషోర్!" అంది శైలజ.

ఆ యువకుడు పేకముక్కలు బల్లమీద పడేసి—"నమస్తే!" అన్నాడు. ముత్యాలరావు కూడా అప్రయత్నంగా రెండు చేతులూ జోడించి — "నమస్తే!" అన్నాడు.

"కిషోర్ —నువ్వింక వెళ్ళవచ్చు. మళ్ళీ రేపు రాత్రి పదింటికిరా—" అంది శైలజ. అతను చకచకా నడుచుకుంటూ వెళ్ళిపోయాడు.

ఆ యువకుడు తనకంటె అందంగా వున్నాడు. తనకంటె బలంగా ఉన్నాడు. తనకంటె ఆకర్షణీయంగా ఉన్నాడు. తనకంటె చలాకీగా ఉన్నాడు. అన్నింటికీ మించి తను లేనప్పుడు ఇంట్లో వున్నాడు. తను రాగానే వెళ్ళిపోయాడు.

"అలా అనుమానంగా చూడకండి. వచ్చినప్పట్నించీ కిషోర్ ఆ సోఫాలోనే ఉన్నాడు. వీధి తలుపులు అలా తీసే ఉన్నాయి. మీరు చెడిపోతున్నారని నేనూ చెడిపోవడం నా అభిమతం కాదు...." అంది శైలజ.

"ఎవరా కిషోర్?" అన్నాడు ముత్యాలరావు.

"ఈ ప్రశ్నకు నేను చెప్పే జవాబు మీకు నచ్చదు. అసలు కిషోర్ని పావు తక్కువ రెండుకల్లా పంపించేద్దామనుకున్నాను. మీరు రెండింటికి వస్తారు కదా మీ కళ్ళబడడు అనుకున్నాను. కానీ మీరు పెందరాళే వచ్చేశారు. రేపు కూడా ఇలాగే ఒంటిగంటం పావుకు వచ్చే మాటయితే ముందే చెప్పండి. కిషోర్ని కాస్త

ముందుగానే పంపించివేస్తాను...." అంది శైలజ.

"వాడు రేపు కూడా వస్తాడా-ఎందుకు?" అన్నాడు ముత్యాలరావు.

"నా ఒక్కర్తికీ ఇంట్లో తోచడంలేదు. కాలక్షేపం కోసం అతన్ని రమ్మన్నాను—...." అంది శైలజ.

"తెగించావా?" అన్నాడు ముత్యాలరావు.

శైలజ మాట్లాడలేదు.

"మాట్లాడవేం?" ముత్యాలరావు రెట్టించాడు.

"ఏం మాట్లాడాలి?" అంది శైలజ.

"తెగించావా అనడిగాను. ఆ ప్రశ్నకు బదులివ్వాలి."

"అయ్యో—ఆ ప్రశ్న మీరడిగారా—ఇంకా నేనే అడిగానేమో మీరు బదులు చెబుతారేమోనని యెదురు చూస్తున్నాను...." అంది శైలజ.

ముత్యాలరావుకు ఇంతా అంతా అనరాని కోపం వచ్చింది. పళ్ళ బిగువున దాన్ని అణుచుకుని—"కాలక్షేపానికి ఏ పక్కింటి అమ్మాయినో రమ్మనొచ్చుగా—" అన్నాడు.

"అలా అడక్కపోవడానికి రెండు కారణాలున్నాయి—" అంది శైలజ.

ముత్యాలరావు వినడానికి సిద్ధంగా ఉన్నాడు. మాటల్లో భార్య చాలా తెలివైనదని అతడికి తెలుసు. అందువల్ల అతడికి కాస్త భయంగా కూడా ఉన్నది.

"మనింటికి మంచి పేరు లేదు. అర్ధ రాత్రిపూట ఆడపిల్లల్ని ఎవ్వరూ మనింటికి పంపరు—అది మొదటి కారణం—" అంది శైలజ.

"రెండో కారణం కూడా చెప్పు. విని సంతోషిస్తాను...." వెటకారంగా అనాలనుకున్నప్పటికీ కాస్త

ఇబ్బందిగానే అతడామాట అన్నాడు.

"మీరు ఓ బిచ్చగాడిని ఉదయం కాలితో తన్నారు. అదే బిచ్చగాడికి నా ప్రాపకం లభించగానే రెండు చేతులూ జోడించి నమస్తే చెప్పారు. ఎంతటి సామాన్యుడికైనా సమాజంలో ఎటువంటి స్థానం కల్పించగలనో తెలుసుకుంటారని ఈ పని చేశాను...." అంది శైలజ.

"అంటే వాడు...." ముత్యాలరావుకి నోట మాట రాలేదు.

"వాడి సంగతి తర్వాత .... ముందు మీ సంగతి ఆలోచించండి...."

# 3

ఏడాది క్రితం—

పరీక్ష ఫీజు కట్టడానికి ముత్యాలరావు వద్ద డబ్బు లేదు. అన్నేళ్ళ చదువూ వృధా పోతుందని అతడికి బెంగగా వుంది. ఆ సమయంలో అతణ్ణి శైలజ కలుసుకుంది. ఫీజు తను కట్టింది.

"కృతజ్ఞతతో మీకు నేను కట్టుబడి పోయాను—" అన్నాడతను.

"కృతజ్ఞత అనకుండా మరో పేరు ఆలోచించండి-" అంది శైలజ.

అప్పటికే వారిరువురి మధ్యా కొంత ప్రేమ ఏర్పడి ఉన్నది. అది ప్రేమ అని ఇద్దరికీ తెలియదు.

ముత్యాలరావు మంచి వక్త. అతడి ఉపన్యాసాల్లోని ఆదర్శాలు విని ముగ్ధురాలైంది శైలజ. తనకు తెలియకుండానే అతణ్ణి అభిమానించసాగింది. ఆమె మొదటిసారి కలుసుకుని మాట్లాడినప్పుడు ముత్యాలరావు వివరాలు

సేకరించాడు. అంతసులో ఆమె తనకు అందనిదని గ్రహించి చాలా దూరంగా వున్నాడు. కాలేజీ ఫీజు కట్టేక వారి చనువు పెరిగింది. చివరికది వివాహానికి దారి తీసింది.

శైలజ తండ్రి ఈ వివాహాన్ని వ్యతిరేకించాడు. శైలజ మొండి పట్టు పట్టింది.

ఆఖరికి ముత్యాలరావుకో మంచి ఉద్యోగంతో పాటు శైలజ దొరికింది. శైలజకు తండ్రి అయిదు లక్షలిచ్చాడు.

ముత్యాలరావు దశ మారిపోయింది. దానితో పాటే అతడి బుద్ధీ మారిపోయింది.

* * *

"ఆ బిచ్చగాడి సంగతి తర్వాత....ముందు మీ సంగతి ఆలోచించుకోండి...."

శైలజ అన్న మాటలు ముత్యాలరావు చెవుల్లో గింగురుమంటున్నాయి. శైలజ తన భార్య. ఆమె తనను ఎంత మాటన్నది?

శైలజ అండ తనకు లేకపోయి ఉన్నట్లయితే తనూ గు రింపులేని బికారిగా తిరుగుతూండేవాడు. ఆ బిచ్చ గాడికి మంచి వేషం వేసేసరికి తనకంటే డాబుగా తయారయ్యాడు.

ఉదయం తనన్నాడు—"భర్త పూర్తిగా నీ చెప్పు చేతల్లో ఉండాలనుకుంటే ఆ బిచ్చగాడిని చేసుకోవల సింది—" అని.

ఆ బిచ్చగాణ్ని తను చేసుకుంటే యెలా ఉంటాడో శైలజ చేతల్లో చూపించింది.

తెల్లవారుఝాముదాకా ముత్యాలరావుకి నిద్రపట్టలేదు. అప్పుడు మాత్రం గాఢంగా నిద్రపట్టింది. టైము ఎనిమిది

దాకేక శైలజ అతణ్ని లేపింది.

అతడు ఉలిక్కిపడి లేచి టైము చూసుకున్నాడు.

"రాత్రి మీకు సరిగ్గా నిద్రపట్టలేదా?" అంది శైలజ.

అతడు ముందు ఉలిక్కిపడ్డాడు. ఆపైన తడబడ్డాడు. జవాబు మాత్రం ఇవ్వలేదు.

"నేను మిమ్మల్ని ఇంకా ప్రేమిస్తున్నాను. అభిమానిస్తున్నాను. గౌరవిస్తున్నాను. అది నా అసమర్థత కాదు. ఆ విషయం గుర్తుంచుకోండి. నా సహనానికి పరీక్షను పెట్టకండి—" అంది శైలజ.

ముత్యాలరావు ఆలోచిస్తున్నాడు. శైలజ అందమైన యువతి. ధనికురాలు. తనను ప్రేమించింది. ఇంకా ప్రేమిస్తానంటోంది. ఆమెను తానెందుకు అలక్ష్యం చేస్తున్నాడు? ఆమె మనసు కష్టపెట్టాలని తానెందుకనుకుంటున్నాడు?

అతడికి బాబూరావు గుర్తుకొచ్చాడు.

## 4

ఆ రోజు ముత్యాలరావు ఆఫీసుకు వెళ్ళలేదు. బాబూరావింటికి వెళ్ళాడు. సాయంత్రం నాలుగింటి వరకూ బాబూరావు ఇంటివద్దనే ఉంటాడు. అతడు బ్రహ్మచారి. అయితే ఆడవాళ్ళ గురించి అతడికి వివాహిత పురుషుల కంటె చాలా ఎక్కువ తెలుసునని అనుభవ పూర్వకంగా ముత్యాలరావు తెలుసుకున్నాడు.

ముత్యాలరావు వెళ్ళేసరికి బాబూరావు ఇంట్లోనే ఉన్నాడు. గది తలుపులు సగం తెరిచి ఉన్నాయి. గది ఊడుస్తున్న పనిమనిషితో అతడు సరసాలాడుతున్నాడు. సిగ్గుపడుతూనే ఆ పిల్ల పనిచేసుకుని పోతున్నది. ముత్యా

్రావును చూస్తూనే — "రా — రా — కూర్చో—" అన్నాడు బాబూరావు.

ముత్యాల్రావు వెళ్ళి కూర్చున్నాడు.

"ఏమిటి విశేషం — ఈ సమయంలో వచ్చావ్!" అన్నాడు బాబూరావు.

"నీ సలహా కావాలి—అర్జంటుగా—" అన్నాడు ముత్యాల్రావు.

"దేనికి?" అనడిగాడు బాబూరావు.

ముత్యాల్రావు జరిగింది చెప్పి — "ఇప్పుడు నేనేం చేయాలి? నాకు తప్పు చేశానన్న అనుభూతి కలుగుతున్నది—" అన్నాడు.

బాబూరావు నవ్వాడు—"నీ భార్యకేదో అన్యాయం చేశానని నువ్వు అనుకుంటున్నావు. కానీ రీటా గురించి నువ్వాలోచించడం లేదు. నీ భార్యకు వచ్చిన లోటేమిటి? సమాజంలో గౌరవస్థానమున్నది. ఆమె బిడ్డలకు రక్షణ ఉన్నది. రీటాకు అటువంటివేమీ లేవు. కొందరు మగవాళ్ళ సుఖం కోసం ఆమె తన జీవితాన్నే త్యాగం చేస్తున్నది. అయినా ఆమె నీ ఆలోచనల్లోకి రాలేదు. మన సమాజపు తీరే అంత! త్యాగమూర్తుల్ని గుర్తించదు. స్వార్థపరులకు హారతి పడుతుంది—"

"నన్ను పెళ్ళి చేసుకోవడం ద్వారా నా భార్య మాత్రం త్యాగం చెయ్యలేదా?" అన్నాడు ముత్యాల్రావు.

"అని నేననుకోను. అయిదులక్షలు కూడా తీసుకురాగలిగిన ఆడదానికి నీకంటె మంచి మొగుడు దొరకలేదంటే అందుకు కారణమేదైనా ఉండదా? ఆమె వలవేసి నీ వంటి అమాయకుణ్ణి ఒకణ్ణి పట్టింది—"

ముత్యాలరావు ఆవేశపడుతూ—"నా భార్య గురించి తప్పుడు మాటలు అనవద్దు. నేను సహించలేను—" అన్నాడు.

"నేనేమీ అనడంలేదు. ఆలోచించమంటున్నాను. నీ స్థానంలో నేనుంటే ఏంచేసేవాడినో చెప్పమంటావా?" అన్నాడు బాబూరావు.

"ఊఁ."

"మన పూర్వీకులు చాలా తెలివైనవారు. ఆడదానికి మగవాడు మినహాయించి మరో రక్షణ ఉండకూడదన్నారు. ఆస్తికి, అధికారానికి అనర్హురాలన్నారు. ఎందుకు? డబ్బు, అధికారం చేతిలో ఉండే ఆడది నైతికంగా పతనమవుతుంది. అందుకేమాత్రమూ సందేహం లేదు. నా భార్య కనుక అయిదు లక్షలతో వస్తే ముందు ఆ డబ్బును నా పేరుకు మార్చుకుంటాను. ఆ తర్వాత ఒక సంవత్సరంలోగా ఆమెను ఫినిష్ చేస్తాను. రీటాలాంటి వాళ్ళను వెతుక్కుని హాయిగా కాలం గడుపుతాను—"

ముత్యాలరావు ఆలోచనలో పడ్డాడు.

"ఏమిటాలోచిస్తున్నావ్?" అన్నాడు బాబూరావు.

"ఫినిష్ చేయడం అంత సులభమా!" అన్నాడు ముత్యాలరావు.

"ఎంత సులభమో చెబుతాను...." అంటూ బాబూరావు లేచి గదిలోని బీరువా ఒకటి తెరచి ఓ చిన్న సీసా తీశాడు.

"ఇందులో చిన్న మాత్రలు వందకుపైగా వున్నాయి. వారానికి రెండు చొప్పున ఇవి తీసుకుంటే ఏడాది తిరక్కుండా చచ్చిపోవచ్చు. ఇది స్లో పాయిజన్. ఇది తీసుకుంటూండగా మధ్యలో డాక్టరు వద్దకు వెళ్లేటంత

సీరియస్ కంప్లయింట్సూ ఉండవు. ఉన్నట్లుండి ఓ రోజున ప్రాణం పోతుంది....”

“నిజంగా?” అన్నాడు ముత్యాలరావు ఆశ్చర్యంగా.

“దీని ఖరీదు ఇరవై వేలు. ఒక్కసారిగా ఈయనవల సరంలేదు. వాయిదా పద్ధతులలో తీర్చుకోనవచ్చును. నోటు రాసిచ్చి చెల్లువేసుకుంటే చాలు....” అన్నాడు బాబూరావు.

“సరే—అయితే ఆ సీసా ఇలా ఇవ్వు....” అన్నాడు ముత్యాలరావు.

## 5

“అరే—ఈ రోజు పన్నెండింటికే వచ్చేశారే...” అంది శైలజ.

ఆమె కిషోర్‌ని వెళ్ళిపొమ్మంది. కానీ ముత్యాలరావు ఆగమన్నాడు. కిషోర్ అతడివంక ప్రశ్నార్థకంగా చూశాడు.

“రోజూ—మా యింట్లో ఎందుకుంటావ్?” అన్నాడు ముత్యాలరావు తీవ్రంగా. కిషోర్ ఏదో బదులిచ్చేలోగా-“ఈ యింటికి నేను యజమానిని. నా అనుమతి లేనిదే నువ్వీ యింట్లో అడుగుపెట్టడానికి లేదు. ఇంకెప్పుడూ ఇలా రాకు—” అన్నాడు మళ్ళీ.

కిషోర్ మాట్లాడకుండా వెనుదిరిగాడు. ముత్యాలరావు అతడిని వెనుకనుంచి ఫెడీమని తన్నాడు. ఊహించని ఈ దెబ్బకు కిషోర్ బోర్లాపడిపోయాడు.

శైలజ కూడా ఇది ఊహించినట్లు లేదు. ఆమె ప్రమాన్పడి ఈ దృశ్యాన్ని చూస్తోంది. ముత్యాలరావు భార్యవంక తిరిగి—“నువ్వు ఎలాంటి మనిషిని ఎలాంటి స్థాయికి తెచ్చినా నా దృష్టిలో వాడి విలువ పెరుగదు”

అన్నాడు.

కిషోర్ నెమ్మదిగా లేచాడు. అతడి పెదాలు చిట్లినట్లున్నాయి. కొద్దిగా రక్తం కనబడుతున్నది.

ముత్యాల్రావు అతడి వంక రూపాయనోటు తీసి ఆడించాడు.

కిషోర్ అతణ్ని సమీపించాడు. ఆ రూపాయనోటు అందుకున్నాడు. ఓసారి ముత్యాల్రావు కళ్ళలోకి చూశాడు. తర్వాత ఉన్నట్లుండి ముత్యాల్రావు చెంప ఛెళ్ళుమనిపించాడు.

ఇలా జరుగుతుందని ముత్యాల్రావు ఏ మాత్రమూ ఊహించినట్లు లేదు.

కిషోర్ శైలజ వంక తిరిగి — "శైలజగారూ! నా తరఫున మీరతడికి అయిదు రూపాయలివ్వండి—" అని చరచరా వెళ్ళిపోయాడు.

ముత్యాల్రావు కొద్దిక్షణాలలాగే ఉండిపోయాడు.

"చూశారా—వాడే స్థాయికి ఎదిగాడో!" అంది శైలజ.

"వాడు నన్నెందుకు కొట్టాడో తెలుసా?" అన్నాడు ముత్యాల్రావు చెంప తడుముకుంటూ.

"తెలుసు...." అంది శైలజ.

"నువ్వనుకుంటున్న కారణం సరైనది కాదు. నీకు డబ్బుంది. నాకు లేదు. అందుకే వాడు నీ ఆదేశంమీద నన్ను కొట్టాడు ..."

"డబ్బున్నది నాకేననీ—మీకాదనీ నిజంగా మీరనుకునే పక్షంలో నా డబ్బును మంచినీళ్ళలా ఖర్చు పెట్టరు—" అంది శైలజ.

"అంటే?" అన్నాడు ముత్యాల్రావు.

శైలజ చటుక్కున అతడి చేతిలో అయిదు రూపాయలు పెట్టి—"ఇకమీదట మీరు డబ్బు ఇలాగే సంపాదించుకోండి—" అని వెళ్ళిపోయింది. ముత్యాలరావు మళ్ళీ దెబ్బతిన్నాడు.

శైలజ తన భార్య....ఆమె తనను ఎంతమాటన్నది?

అతడికి ఆవేశంతో శరీరం వణికింది. శైలజను అప్పటికప్పుడు నరికిపోగులు పెట్టాలన్న ఆలోచన కలిగింది.

ముత్యాలరావు ఆవేశాన్ని అణుచుకున్నాడు.

శైలజ బాత్రూముకు వెళ్ళింది. అతను బెడ్రూంలోకి దారితీశాడు. అక్కడ గ్లాసు గ్లాసులో నీళ్ళు. రోజూ రాత్రి శైలజ మంచినీళ్ళు తాగుతుంది. ఈ రోజింకా తాగలేదన్నమాట! ముత్యాలరావు చప్పున తన జేబులోని సీసాలోని మాత్రలు రెండు ఆ నీళ్ళలో వేశాడు. వెంటనే కరిగిపోయాయవి.

అతడు వెళ్ళి మంచంమీద పడుకున్నాడు. కొద్ది క్షణాల్లో శైలజ పడకగదిలోనికి వచ్చింది. వస్తూనే అతణ్ని సమీపించింది. అతడు కళ్ళు మూసుకుని వున్నాడు.

"మీరు నిద్రపోవడం లేదని నాకు తెలుసు—" అన్నదామె.

ముత్యాలరావు మాట్లాడలేదు.

"కోపం వచ్చిందా?" అన్నదామె. అతడు మాట్లాడకపోగా నుదుటిమీద చేయివేసి—"మీమీద నాకూ కోపంగానే ఉంది. అందుకు కారణం మాత్రం ప్రేమ" అన్నది.

ముత్యాలరావు చప్పున కళ్ళు తెరిచాడు—"నీకు నామీద ప్రేమలేదు. ప్రేమ ఉంటే ఆస్తంతా నీ పేరున ఉంచుకోవు—" అన్నాడు.

"ఆస్తి నా పేరున వున్నా అనుభవం మీదే! నా తదనంతరం నా ఆస్తి మీకే చెందుతుంది. ఆ విధంగా మీకు నన్ను హత్యచేసే అవకాశం కూడా ఇస్తున్నాను. ఇంకా ఏం కావాలి?" అంది శైలజ.

ముత్యాలరావు ఉలిక్కిపడి—"అయితే నేను నిన్ను హత్య చేస్తానని అనుమానిస్తున్నావా?" అన్నాడు.

"అలా చేసినా బాగుండును. అప్పుడిలా రోజూ చావాల్సిన అవసరముండదు—" అని శైలజ కళ్ళు తుడుచుకుంది.

ముత్యాలరావు నెమ్మదిగా — "నీకు చచ్చిపోవాలనుందా?" అనడిగాడు.

"నా విషయంలో మీరు తీర్చగల కోరిక అదొక్కటే నని నాకు తెలుసు. అదొక్కటీమాత్రం మిమ్మల్ని అడగను...." అంది శైలజ.

'అడక్కుండానే నీ కోరిక తీర్చగలనులే—' అనుకున్నాడు ముత్యాలరావు.

ఉదయం లేచేసరికి అక్కడ గ్లాసులో నీళ్ళు లేవు. ఎందుకో ముత్యాలరావు శరీరం వణికింది.

ఆఫీసుకు వెడుతూ ముత్యాలరావు భార్యతో—"ఈ రోజు రీటాను ఇంటికి తీసుకుని వస్తాను...." అన్నాడు.

శైలజ తెల్లబోయి భర్త వంక చూసింది.

"ఈ కిషోర్ వ్యవహారం నాకు నచ్చలేదు. అందుకని...."

"మీరు తప్పు నామీదకు నెట్టాలని చూస్తున్నారు. అసలు మీరు రీటాతో తిరగాల్సిన అవసరమేమిటో చెప్పండి...."

"రీటా నేను చెప్పినట్లు వింటుంది. నువ్వు నా మాట

వినవు. నాకంటే డబ్బెక్కువున్నదన్న గర్వం నీకుంది."

"నాకు గర్వంలేదు...."

"అది నేను నమ్మాలంటే నువ్వా అయిదు లక్షలూ వదులుకోవాలి. అప్పుడు నేను నీకంటే ఆస్తిపరుణ్నవు తాను...."

"అంతేనా మీ కాక్కావలసింది...."

"ఎస్...అప్పుడు రీటా ఈ యింటి గడపతొక్కదు."

"మీరూ రీటా యింటి గడప తొక్కకూడదు ..."

ముత్యాల్రావు కొద్ది క్షణాలు ఆలోచించి-"ఓ. కే-" అన్నాడు.

"నేను మిమ్మల్ని నమ్ముతున్నాను. మీరీరోజు రాత్రికి పెందరాళే యింటికి రండి—" అంది శైలజ.

"రాత్రికి కాదు. సాయంత్రానికే వచ్చేస్తాను. ఈ రోజు క్లబ్బుకు కూడా వెళ్ళను...." అన్నాడు ముత్యాల్రావు.

# 6

"ఆరే—ఈ రోజు పగలు వచ్చారేమిటి?" అంది రీటా.

"రాత్రికి పెందరాళే వస్తానని నా భార్యకు మాటిచ్చాను...."

"భార్యకు మాట ఇవ్వడమూ—అది నిలబెట్టుకోవాలనుకోవడమూ—. అంటే మీలో రాకూడని మార్పు వచ్చినట్టే లెక్క!" అంది రీటా.

"ఈ మార్పువల్ల నాకు అయిదు లక్షలు లాభం—" అంటూ ముత్యాల్రావు జరిగినదామెకు చెప్పాడు. స్లో పాయిజన్ గురించి మాత్రం చెప్పలేదు.

"నిజంగా—" అంటూ బలంగా కౌగలించుకుందామె

అతణ్ని.

"నీతో అబద్ధం చెబుతానా?" అన్నాడతను.

"అయితే ఎల్లుండికి నాకు రత్నాల నెక్లెస్ కావాలి." అంది రీటా.

"చూద్దాం—"

"అదేమిటి—రాజకీయ నాయకుల్లాగ ...."

"డబ్బాస్తున్నది కదా — ఇంకా నేను రాజకీయాల గురించి కూడా ఆలోచించాలి ...."

"మీరు రాజకీయాల గురించి ఆలోచించవద్దు. అప్పుడు నన్ను అలక్ష్యం చేస్తారు. మన మెప్పుడూ ఇలాగే ఉండాలి—" అంది రీటా.

"చూద్దాం—" అన్నాడు ముత్యాలరావు.

"అదిగో—మళ్ళీ చూద్దాం అంటున్నారు—" అంది రీటా.

"నువ్వంటే ఎంత మోజు లేకపోతే నేను ఇలా పగలు నీకోసం వస్తానో చెప్పు—" అన్నాడు ముత్యాలరావు.

రీటా మరి మాట్లాడలేదు.

ముత్యాలరావు తిన్నగా రీటా యింటినుంచి ఇంటికి వెళ్ళాడు. శైలజ అతణ్ని చూసి ఆశ్చర్యపడుతూ— "అరే—అన్న ప్రకారం వచ్చేశారే—" అంది. అతడి వెంట రీటా లేకపోవడం ఆమెకు ఎంతో సంతోషంగా ఉన్నది.

"ఇంక నువ్వు నీ మాట నిలబెట్టుకోవాలి—" అన్నాడు ముత్యాలరావు.

"నా మాట నేనూ నిలబెట్టుకున్నాను—" అంది శైలజ.

"మరి — నాకు కబురు పెట్టలేదేం?" అన్నాడు

ముత్యాల్రావు.

"మీకు కబురెందుకు?" ఆశ్చర్యంగా అడిగింది శైలజ.

"బాగుంది—డిపాజిట్ నా పేరున మార్చినపుడు నా సంతకాలు అవసరపడతాయికదా—" అన్నాడు ముత్యాల్రావు.

"వేవలాగనుకో లేదు——" అంది శైలజ.

"మరి— ...."

"మీరు కోరిన దేమిటి? నేను మీకంటె ఎక్కువ ఆస్తిని కలిగివుండరాదని....అందుకని ..."

"అందుకని...." కంగారుగా అడిగాడు ముత్యాల్రావు.

"ఆ అయిదు లక్షలూ కిషోర్ కిచ్చేశాను..."

"ఆఁ" ఉలిక్కిపడి నోరు తెరిచాడు ముత్యాల్రావు.

"నేను మీ నీడలో బ్రతకాలనుకుంటున్నాను. మీరు నాకు నీడ ఇవ్వాలనుకుంటున్నారు. నా డబ్బు మిమ్మల్ని విలాస జీవితంవైపు దృష్టి మళ్ళించింది. అలాంటప్పుడా డబ్బు నాకు ఉండకపోవడమే మంచిదనిపించింది. ఈ రోజు కాకపోయినా మరో రోజైనా నేను చేసిన పనికి మీరు హర్షిస్తారు. మనం మనంగా బ్రతకడం కోసం నేనీ నిర్ణయానికి వచ్చాను...." అంది శైలజ.

"ఎందుకు చేశా వీ పని?"

"మన సుఖం కోసం...."

శైలజ చెంప ఛెళ్ళుమంది.

"ఇప్పుడు సుఖంగా వుందా?"

శైలజ ఏదో అనబోయింది. మళ్ళీ ఆమె చెంప ఛెళ్ళుమంది.

"ఎవడా కిషోర్? వాడికి నువ్వు అయిదులక్షలెందు

కిచ్చావ్? ఏదో నాటకమాడుతున్నావు.... చెప్పు...."

శైలజ ఏదో చెప్పబోతోంది. కానీ అతడు జవాబు కోసం ప్రశ్నలడగడంలేదు. అయిదు లక్షల రూపాయలు అనామకుడికి పోయాయన్న కడుపు మంట అతడిలో ఇంతా అంతా అనలేని ఆవేశాన్ని కలిగించింది. అతడామెను చావగొడుతున్నాడు. కాసేపు ఆమె మౌనంగా భరించింది. చివరకు అరవడానికి సిద్ధపడింది. అరవకుండా అతడామె గొంతు పట్టుకున్నాడు.

ఆవేశంలో అతడి చేతులు ఆమె గొంతుచుట్టూ బిగుసుకుంటున్నాయి. అతడినుంచి విడిపించుకొనడానికామెకు బలం చాలలేదు.

కొద్ది క్షణాల్లోనే ఆమె నిర్జీవంగా తలవాల్చేసింది. అప్పుడు ముత్యాలరావు ఆవేశమూ తగ్గింది.

ముత్యాలరావు పట్టు సడలింది. శైలజ నేల కూలింది.

అతడు మామూలు మనిషయ్యాడు. చటుక్కున ఆమె మీదకు వంగి—"శైలూ!" అన్నాడు.

శైలజ కదలలేదు.

ముత్యాలరావుకి అనుమానం వచ్చింది. అతడామె నాడి, శ్వాస పరీక్షించాడు. ఆమె చనిపోయినట్లు గ్రహించడానికతడికెంతో సేపు పట్టలేదు.

"శైలజ చచ్చిపోయింది...." అన్న భావన అతణ్ని ఆపాదమస్తకమూ కదిలించింది.

శైలజ ఎలా చచ్చిపోయింది?....తనే చంపేశాడు... తను....తను హంతకుడు....

బాబూరావు తనకు సలహా యిచ్చాడు. ఓ పాడు స్లో పాయిజన్ కూడా ఇచ్చాడు, ఎవరూ అనుమానించని పద్ధతిలో శైలజను చంపవచ్చునని! కానీ తను అంతకాలం

ఆగలేక పోయాడు. ఆవేశపడి చేజేతులా ఆమెను చంపే
శాడు.

## 7

ముత్యాల్రావు దొంగకాదు. రౌడీ కాదు. గూండా
కాదు. నడమంత్రపు సిరి పట్టిన ఓ. సామాన్యుడు. తను
హత్య చేశానన్న నిజాన్ని అతడు జీర్ణించుకోలేకుండా
ఉన్నాడు.

ఇప్పుడేం చేయాలి?

అతడికి బాబూరావే గుర్తొచ్చాడు. వెంటనే
ముత్యాల్రావు లేచి — శైలజను ఎత్తి మంచంమీద
పడుకోబెట్టాడు. తలుపులు దగ్గరగా వేసి బైటకు
వచ్చాడు. ముందు ఇంటికి తాళం వేయాలనుకున్నాడు.
శైలజ ఇంట్లో వుండగా తను తాళం వేయడం ఇరుగు
పొరుగు లెవరైనా చూస్తే బాగుండదు. సాధారణంగా
ఈ సమయంలో ఇరుగుపొరుగు లెవరూ ఇంటికి రారు.
అందుకని తాళం వేయకూడదనే అతడు నిశ్చయించు
కున్నాడు.

అతడు బాబూరావు ఇల్లు చేరాడు. బాబూరావు
ఇంటి తలుపులు సాధారణంగా తెరిచే ఉంటాయి. ఆ
రోజవి ఓరవాకిలిగా వేసి ఉన్నాయి. లోపల్నుంచి
బాబూరావు మాట వినబడుతోంది. అతడు ఫోన్‌లో
మాట్లాడుతున్నాడు ఎవరితోనో!

"హలో! రేపటికి అన్న ప్రకారం పదివేలూ కట్టి
తీరాల్సిందే... ఒక్క క్షణం కూడా ఆలస్యం జరగ
డానికి వీల్లేదు.... నేను రీటాను ప్రయోగించి నిన్ను మోస
గించానంటావా? ... నిన్నెవడు మోసపొమ్మన్నాడు?...

నేను వెళ్ళి గంగలో దూకమంటాను....దూకతావా?....
నీ సుఖం కోసం నువ్వు తప్పుచేసి ఆపైన నన్ను తప్పు
పట్టడ మెందుకు? .... నీ రహస్యం దాచడానికి అన్న
ప్రకారం రేపు పదివేలూ ఇచ్చేయాల్సిందే—ఈ విషయమై
మరి మాటల్లేవు. ఫోన్ పెట్టేస్తున్నాను...."

బాబూరావు ఫోన్ పెట్టేసేలోగా ముత్యాల్రావు వెనుదిరిగాడు.

బాబూరావు బ్లాక్ మెయిలర్! ఈ విషయం తనకు తెలుసు. తన కతడు ఎన్నోసార్లు సగర్వంగా చెప్పు కున్నాడు కూడా!

"ప్రతి మనిషికీ కొన్ని రహస్యాలుంటాయి. అవి మనం తెలుసుకోవాలి. రహస్యాలు లేనివాళ్ళుంటారనుకో. అప్పుడు మనం సృష్టించాలి. ఆ తర్వాతనుంచి ఆ రహస్యాలే మనకు కనక వర్షం కురిపిస్తాయి. ఈ రహస్యం నువ్వు గుర్తుంచుకో—" అని బాబూరావు తొలి పరిచయంలో ముత్యాల్రావుకి చెప్పుకున్నాడు.

బాబూరావు బ్లాక్ మెయిలర్. తను హంతకుడన్న విషయం అతడికి తెలిస్తే—తప్పకుండా బ్లాక్ మెయిలింగ్ ప్రారంభిస్తాడు బాబూరావు. తన్ను బికారిని చేస్తాడు. ఈ విషయం ఇంకెవ్వరికీ తెలియనివ్వకూడదు. ఈ రహస్యం తనలోనే ఉండిపోవాలి....

ముత్యాల్రావు బుర్రలో పథకం మెరుస్తోంది.

తనిప్పుడు శవాన్ని మాయం చెయ్యాలి. ఆ తర్వాత సెలవుమీద ఊరు వదిలిపెట్టాలి. తిరుగుదారిలో ముత్యాల్రావు పోస్టాఫీసువద్ద ఆగాడు. అది అన్నివేళలా పనిచేసే పోస్టాఫీసు.

ముత్యాలరావు ఇన్‌లాండ్ లెటర్ కొన్నాడు. మామగారికి ఉత్తరం వ్రాశాడు.

"పూజ్యనీయులగు మామగార్కి నమస్కారములు

అనుకోకుండా నేను ఊరు వదిలి వెడుతున్నాను. మీ అమ్మాయి తానొక్కర్తీ ఉండలేనన్నది. అందుకని ఈ రోజు రాత్రి ట్రయిన్‌కు మీ యింటికి బయల్దేరి వస్తుంది.

నేను తిరిగి ఎప్పుడు వచ్చేదీ సరిగ్గా తెలియదు. బహుశా నెలరోజులు పట్టవచ్చును. రాగానే మీకు ఉత్తరం వ్రాస్తాను. విషయం తెలియబర్చడం కోసం ఈ ఉత్తరం వ్రాస్తున్నాను. అత్తయ్యగార్కి నమస్కారము లందజేయండి. అందర్నీ అడిగినట్లు చెప్పండి.

మీ అల్లుడు

ముత్యాలరావు—"

అడ్రసు వ్రాసి ఉత్తరం పోస్టుచేశాడు.

ఈ ఉత్తరం కారణంగా ఆమె గురించి తనకింకేమీ తెలియనట్లే అంతా భావిస్తారు. తను ఆమె శవాన్ని ముక్కలు చేసి కూడా తీసుకుని వెళ్ళి వివిధ ప్రాంతాల్లో పారేస్తాడు.

ఈ ఆలోచనలు ముత్యాలరావుని వణికింపజేస్తున్నాయి. అడుగు పడడం కష్టంగా ఉన్నదతడికి. ఆ విధంగా ఇల్లు చేరేసరికి ఆలస్యమయింది.

తలుపులతడెలా వేశాడో అలాగే ఉన్నాయి. ఇరుగు పొరుగుల్లో హడావుడి ఏమీ లేదు. అంటే ఎవరికీ ఇంత వరకూ ఏమీ తెలియలేదన్నమాట! ముత్యాలరావు తేలికగా నిట్టూర్చాడు.

తనిప్పుడేం చేయాలి?

ముందు శవాన్ని ముక్కలు చేయాలి. అందుకు కత్తినో కత్తిపీటనో ఉపయోగించాలి. ఈ ఆలోచనకు అతడి అణువణువూ వణికింది. కానీ తప్పుచేశాక ధైర్యం వహించక తప్పదు.

వంటింట్లో పనసకాయ కత్తి ఒకటి మంచి పదును మీద ఉన్నది. ఆ కత్తి పౌరుషంకొద్దీ శైలజ కొన్నది. పనసకాయ కొని—కొట్టించడం కోసం పొరుగింట్లో అడిగిందామె. అప్పుడు పొరుగింటావిడ — "మావద్ద కత్తి ఉన్నది. కానీ ఎరువు ఇవ్వం—" అని ఖచ్చితంగా చెప్పేసింది. పంతంవచ్చి శైలజ అప్పటికప్పుడు బజార్నించి కత్తిని తెప్పించింది.

ఆ రోజు పనసకాయ.... ఈ రోజు శైలజ.

# 8

ముత్యాల్రావు వంటింట్లోకి నడిచాడు. ఆ కత్తి ఎక్కడ ఉన్నదీ అతడికి తెలుసు. అటే నడిచాడు.

నాలుగడుగులు అటు వేశాడో లేదో ముత్యాల్రావు కళ్ళు పెద్దవయ్యాయి. ఎదురుగా గోడకు ఆనుకుని శైలజ నిలబడి ఉన్నది.

ముత్యాల్రావు అరవబోయాడు. కానీ తమాయించుకున్నాడు. ఆమె శైలజ కాదు. అది శవం! కళ్ళు తెరిచి వున్నాయి. రెప్ప వాలడంలేదు.

అయితే ఆ శవం బెడ్రూంలో ఉండాలి. ఇక్కడకెలా వచ్చింది? శవం నడిచి వచ్చిందా—....లేక....

ముత్యాల్రావు ఒక్క పరుగున బెడ్రూంలోకి వెళ్లాడు. బెడ్రూంలో శైలజ శవంలేదు. అతడికి ముచ్చెమట్లు పోశాయి.

ఎలా జరిగిందీ విచిత్రం?

శైలజ చనిపోలేదా?

కానీ .... తనా మెను పీకపిసికి చంపినమాట నిజం. ఆమె చనిపోయిన మాట కూడా నిజం. వంటింట్లో నిలబడి ఉన్న శైలజ శవంలా ఉన్నది తప్పితే జీవంలేదు. మరి.... ఆ శవం ఇక్కణ్నించి అక్కడకు ఎలా వెళ్ళింది?

ముత్యాలరావుకు భయంతో చెమటలు ధారాపాతంగా కారసాగాయి. అతడు మళ్ళీ వంటింటివైపు నడిచాడు. కానీ సగం నడిచేక అతడికి భయం వేసింది. శైలజ శవాన్ని చూడాలంటేనే అతడికి భయంగా ఉన్నది. అతడి మనసు కీడును శంకిస్తున్నది.

ముత్యాలరావు ముందు బాత్రూంలోకి వెళ్ళి రావా లనుకున్నాడు.

అప్రయత్నంగానే అతడు బాత్రూంలో ప్రవేశించాడు.

ఎదురుగా గోడకు ఆనుకుని శైలజ శవం!

కెవ్వుమన్నాడు ముత్యాలరావు. అలా అరిచేక తన కేక ఎవరైనా వింటారేమోనని భయం వేసింది. చటుక్కున వీధిలోకి వెళ్ళి చూశాడు. యెవ్వరూ లేరు.

ఓసారి తేలికగా నిట్టూర్చాడు.

ఏమిటీ విచిత్రం? శవం ఇల్లంతా ఎలా తిరుగుతోంది? శైలజ చచ్చికూడా తన్ను సాధించదల్చుకుందా?

ముత్యాలరావు మళ్ళీ బాత్రూంలోకి వచ్చాడు. ఈ పర్యాయం అతడికక్కడ శైలజ కనబడలేదు. తడబడుతూనే అతడు లోపలకు నడిచాడు. శవం కనబడలేదు.

ఒక్క నిమిషం ప్రశాంతంగా ఆలోచించాలి—అని అనుకున్నా డతను. మళ్ళీ బెడ్రూంలోకి నడిచాడు.

బెడ్రూంలో మంచంమీద వెల్లకితలా పడివున్నది శైలజ శవం. తనెలా పడుకోబెట్టాడో-అలాగే వున్నదా శవం!

'ఇప్పటికి నా మనసు నిమ్మితపడింది—' అనుకు న్నాడు ముత్యాల్రావు.

జీవితంలో తొలిసారిగా అదీ అనుకోకుండా హత్య చేశాడతను. ఆ కారణంగా కలిగిన భయంలో మనసు అనేక రకాల భ్రమలకు లోనయింది. అందువల్లనే ఆమె బెడ్రూంలో లేనట్లూ—బాత్రూంలోనూ, వంటింట్లోనూ ఉన్నట్లూ తనకు అనిపించింది.

అదంతా భ్రమ!

అతడు శవాన్ని సమీపించాడు.

శైలజ నిర్జీవంగా పడివున్నది. ఆమె చాలా మంచిది. తనను ప్రేమించింది. కానీ అతన్ని తల్చుకుందు కిప్పుడు సైము లేదు. ఆమె తన్ను ప్రేమించినప్పటికీ, మంచిదే అయినప్పటికీ—తన్ను బాగా రెచ్చగొట్టింది. హత్యకు ప్రోత్సహించింది. అది శైలజ తప్పుకాని పక్షంలో తన వంటి సామాన్యుడు ఒక నిండు ప్రాణం తీయగలడా?

ముత్యాల్రావు ఆమె కను రెప్పల్ని మూయడానికి వంగాడు. సరిగ్గా అప్పుడు అతడి భుజంమీద ఎవరిదో చేయిపడింది.

ఉలిక్కిపడి కెవ్వుమన్నాడు ముత్యాల్రావు. తర్వాత నెమ్మదిగా వెనక్కి తిరిగాడు.

# 9

"మొత్తానికి నువ్వు నీ భార్యను చంపేశావన్నమాట" అన్నాడు కిషోర్.

"లేదు.... నేను చంపలేదు—...." అన్నాడు ముత్యా

ర్రావు.

"నువ్వు కాకపోతే ఇంకెవరు చంపుతారు?" అన్నాడు కిషోర్.

"నువ్వు. నా భార్య కారణంగా నీకు అయిదు లక్షలు వచ్చింది. యెలాగో మోసంచేసి ఆస్తి నీ పేరుమీదకు మార్పించగలిగావు. ఆ తర్వాత ఆమెవల్ల నీకు ప్రమాద మంటుందనిపించింది చంపేశావు" అన్నాడు ముత్యాలరావు.

"నీ కథనం బాగుంది. కానీ ఋజువుండాలికదా!"

"ఉంది—" అన్నాడు ముత్యాలరావు.

"ఆ ఋజువు ప్రకారం కూడా నువ్వే హంతకుడి వౌతావు...."

"ఎలా?"

"నీ భార్య నీ కోరిక ప్రకారం ఈ రోజే మొత్తం ఆస్తినంతా నీ పేరుకు మార్చేసింది. నీ సంతకాలు రేపు తీసుకునే ఏర్పాటు జరిగింది—" అన్నాడు కిషోర్.

"ఏమిటీ?"

"నీ భార్య శైలజ నిన్ను మనసారా ప్రేమించింది. నీకోసం ఏమైనా చేయడానికి సిద్ధపడింది. నువ్వు తన్ను అలక్ష్యం చేస్తూంటే ఆ లోపం తనదే ననుకునేది. నిన్ను లాగైనా తనవాణ్ని చేసుకోవాలని తాపత్రయపడింది. అందుకు కారణం నువ్వు మహా ప్రేమ. పురుషుడివనీ కాదు, అపూర్వ లక్షణాలున్న వాడివనీ కాదు. జస్ట్ లవ్— అంతే! లవ్ ఈజ్ బ్లైండ్ అంటారు చూశావా—అదే జరిగిందామె విషయంలో!"

"ఇంతకీ నువ్వెవరు?" అన్నాడు ముత్యాలరావు.

"నేనొక ప్రయివేట్ డిటెక్టివ్ ను. ఆమె నీమీద

నిఘా వేయడం కోసం నన్ను రప్పించింది. నీ తప్పు లెంచడంకోసం కాదు ఆమె నన్ను నియమించుకత! నీ అమాయకత్వాన్ని దుర్మార్గులెవరైనా ఉపయోగించుకుని నిన్ను కష్టాలపాలు చేస్తారేమోనన్న భయంలో! ఆమెకు నీ గురించి అన్నీ తెలుసు—ఆఖరికి నువ్వియ్యాబోయిన స్లో పాయిజన్ గురించి కూడా!" అన్నాడు కిషోర్.

ముత్యాల్రావుకు భయంతోనూ ఆశ్చర్యంతోనూ నోట మాటరాలేదు—"నువ్వు .... నువ్వు .... డిటెక్టివువా?" అన్నాడు.

"అవును. నీ భార్య సిత ప్రజ్ఞురాలు. తన సమస్యలకు పరిష్కారం తనే వెతుక్కోవాలనుకుంటుంది. ఎట్టి పరిస్థితుల్లోనూ ధైర్యాన్ని విడనాడదు. నీ కాళ్ళు పట్టుకుని నిన్ను లొంగదీసుకోవాలనే ఉద్దేశంమామెకు లేదు. అయితే నీ దుర్మార్గత్వాన్ని ఆమె ఎక్కువ అంచనా వేసింది. నువ్వు చాలా మంచివాడివనీ — నేరంచేసే స్వభావం నీకు లేదనీ ఆమె నాకు చెబుతూండేది.

అందువల్లనే ఈ రోజు ఆమె నిన్ను ఆటపట్టించడానికో అబద్ధం చెప్పాలనుకుంటే నేనూ వారించనూ లేదు. ఆమెను నీనుంచి రక్షించాల్సిన అవసరంకోసం నన్ను నియమించలేదు. నిన్ను బాబూరావు రిటాలనుంచి రక్షించడంకోసం నన్ను నియమించింది. అయితే నే నూహించనిది జరిగిపోయింది. నిన్ను ఉరికంబం ఎక్కించినా—నాకు నీ భార్య శైలజను రక్షించలేక పోయానన్న బాధ అలాగే మిగిలిపోతుంది—" అన్నాడు కిషోర్ దిగులుగా.

"ఉరికంబం....ఉరికంబం...." అన్నాడు ముత్యాల్రావు...."వీల్లేదు అలా జరగడానికి వీల్లేదు...."

"నీ మొత్తం నేరాలన్నీ నేను ఋజువు చేయగలను,

హత్య చేయడంలో నీ భాగం తెలుసుకోవడంకోసమే నేను శవాన్ని అటూ యిటూ మార్చి నీ ముఖభావాలు పరీక్షించాను. శవాన్ని చూసి నీకు భయం, ఆశ్చర్యం కలిగాయి తప్పితే ఏడుపు రాలేదు. నీ కోసం అన్నీ త్యాగం చేయాలనుకునే భార్య దగ్గర్నుంచి నువ్వు ప్రాణాలు కోరితే—చట్టం చూస్తూ ఊరుకోదు. అదీ నీ ప్రాణాలు కోరుతుంది. పద — పోలీసుస్టేషన్ కు....” అన్నాడు కిషోర్.

“నేను రాను....” అన్నాడు ముత్యాల్రావు.

“ఇంక నువ్వు తప్పించుకోలేవు......” అన్నాడు కిషోర్.

ముత్యాల్రావు ఉన్నట్టుండి తన పిడికిలితో కిషోర్ తలమీద గట్టిగా మోదాడు. కిషోర్ తూలి కిందపడ్డాడు. అతడికి తలంతా దిమ్మెక్కిపోయింది. పడడంలో అతడి తల మంచానికి కొట్టుకుని కొద్దిగా రక్తం వచ్చింది.

ఆ వ్యవధి చాలు ముత్యాల్రావుకి.

కిషోర్ కదలడంలేదు. బహుశా అతడికి స్పృహతప్పి ఉండాలి.

ముత్యాల్రావు పాంటు, షర్టు వేసుకున్నాడు. వంటింట్లోకి వెళ్ళి పనసకాయ కత్తి తీశాడు. దాన్ని జాగ్రత్తగా బొడ్లో దోపాడు. ఇంట్లోంచి బయట పడుతూ మరోసారి బెడ్రూంలోకి తొంగిచూశాడు.

కిషోర్ కదులుతున్నాడు.

తను బయటపడినా ఎలాగూ పట్టుబడక తప్పదని తెలుసు ముత్యాల్రావుకి. తన జీవితం ఎలాగూ నాశనమై పోయింది. కానీ తనవల్ల కావలసిన కార్యం ఒకటి ఉన్నది.

# 10

ముత్యాలరావు ఇల్లు పోలీసులతోటీ చుట్టుపక్కల వారితోటీ చాలా హడావుడిగా ఉన్నది. కిషోర్ పోలీస్ ఇన్‌స్పెక్టర్‌కు జరిగిన కథంతా చెబుతున్నాడు. ఈ కథలో చాలా భాగం ఇరుగుపొరుగులకు తెలియదు.

కిషోర్ కథనం గురించి ఇన్‌స్పెక్టర్ ఆలోచిస్తున్నాడు. కిషోర్ పూర్తిగా నిజం చెబుతున్నాడా అన్న అనుమానం కూడా ఆయనకున్నది. ఆ సమయంలో అక్కడకు ముత్యాలరావు ప్రవేశించాడు. అతడి చేతిలో రక్తసిక్తమైన కత్తి ఉన్నది.

"హంతకుడు.... హంతకుడు...." కొందరు భయంగా అరిచారు. కొందరు ఆ ప్రాంతంనుంచి పారిపోడానికి ప్రయత్నించారు.

"అవును ఇన్‌స్పెక్టర్ గారూ.... నేను హంతకుణ్ణి...." అంటూ తన చేతిలోని కత్తిని జారవిడిచాడు ముత్యాలరావు. తన రెండు చేతుల్నీ ముందుకు చాపాడు — అరెస్టు చేయవచ్చునన్నట్లుగా!

క్షణాలమీద ముత్యాలరావు చేతులకు బేడీలుపడ్డాయి.

"నువ్వు నీ భార్యను ఎందుకు చంపావు?" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"నేను మొత్తం మూడు హత్యలు చేశాను ఇన్‌స్పెక్టర్ గారూ—" అన్నాడు ముత్యాలరావు.

కిషోర్ ఉలిక్కిపడి — "మూడు హత్యలా?" అన్నాడు.

"అవును. నేను సామాన్యుణ్ణి. నన్ను శైలజ ప్రేమించడం నా అదృష్టం. అయితే ఆ అదృష్టాన్ని గుర్తించకుండా ఆమెను స్లో పాయిజన్‌తో చంపాలను

కున్నాను. ఆమె ఎంత ఉన్నతురాలో ఈ రోజే నాకు అర్థమైనాక—అప్పటికే ఆవేశంలో నేనామెను హత్య చేసిన విషయం గుర్తించినాక.... నేనో కొత్త విషయాన్ని కనుగొన్నాను.

బాబూరావు, రీటా మొదట్నించీ స్వప్రయోజనాల కోసం నన్ను నా భార్యకు వ్యతిరేకంగా తయారుచేస్తున్నారు. వాళ్ళు నా మనసుపై స్లో పాయిజన్ లా పని చేశారు. నే నా విష ప్రభావానికి క్రమంగా గురవుతూ వచ్చి ఈ రోజుకు హత్యచేసే స్థితికి చేరుకున్నాను.

నా భార్య నాక్కాకుండా పోవడానికి కారణమైన స్లో పాయిజన్ ను నా మనసులోకి ఎక్కించిన ఆ దుర్మార్గుల బారినుండి కనీసం కొంతమందిని రక్షించడంకోసం—ఇంకో రెండు హత్యలు చేశాను. ఎలాగూ ఓ హత్య చేశానుకదా—ఇవి నాకు కష్టంకాలేదు. మొదటి హత్య చేశాక నా కెంత దిగులు కలిగిందో — ఈ హత్యలు చేశాక అంత సంతృప్తి నన్నావహించింది—ఇంక నాకు ఉరికంబమెక్కుతున్నానన్న బాధలేదు...." అన్నాడు ముత్యాల్రావు.

కిషోర్ ముత్యాల్రావు మాటల్లోని సారాంశం వెతుకుతున్నాడు. యే డబ్బుకోసం తనామెను చంపాలనుకున్నాడో, ఆ డబ్బు తనకామె ఇచ్చేసిందని తెలియగానే శైలజ ఔన్నత్యం ముత్యాల్రావుకి అర్థమయింది. కానీ అంతకుముందే అతడికామె ఔన్నత్యం యెందుకు తెలియలేదు?

—:అయిపోయింది:—

# ముగ్గురు ముద్దాయిలు

ఎమ్. వి. వి. సత్యనారాయణ

"ల్రాక్! హలో లాక్!" అరిచాడు డిటెక్టివ్ బాండ్.

"వస్తున్నా.... అరవక బాండ్!"

"ఎక్కడున్నావోయ్! అర్జెంట్. పుస్తకం ఒకటి రిఫరెన్స్ కావలసి వచ్చింది."

బాండ్ నిచ్చెన సీటుమీద కూలబడ్డాడు.

నిచ్చెన చుట్టూ ఎత్తయిన యినుపబీరువాలున్నాయి. బీరువాలో పుస్తకాలు వరుసగా అమర్చి వున్నాయి. బాండ్ చెయ్యి చాపాడు. పుస్తకం అందీ అందకుండా తగులుతోంది. రెండు మెట్లు దిగాడు. వూఁహూఁ! లాభం లేకపోయింది. మరల మెట్లు యెక్కి నిచ్చెన సీటుమీద కూర్చున్నాడు.

"బాండ్!" గుమ్మంలోంచే పిలుచుకుంటూ వచ్చాడు లాక్.

బాండ్ అతడిని ఆశ్చర్యంగా చూశాడు. లాక్ ఒంటిన టర్కిష్ టవల్ తప్ప ఏమీ లేదు. అతడి ఒంటిన

మంచినీటి బిందువులు ముత్యాల్లా మెరుస్తోన్నాయి.

"ఏం కావాలి బాండ్?" అడిగాడు లాక్.

"జలకాలాటల్లో మునిగితే నీకు లోకం తెలియదల్లే వుంది. ఎవడో వచ్చి నన్ను పిస్తోలుతో కాల్చి చంపేసినా సరే నువు యింత ధీమాగా వస్తావు!"

"నిన్ను చంపేవాడు ఎవడు బాండ్?"

"ఏం? నువు పరిశోధిస్తావా?"

లాక్ పకపక నవ్వి, నిచ్చెన ఎక్కాడు. "ఇంతకు నీకు ఏం పుస్తకం కావాలి బాండ్?" అన్నాడు. రెండో వైపు మెట్లమీద నిలబడి వున్నాడు.

"గోల్డు ఫింగర్."

"ఎందుకు?"

"గోల్డు ఫింగర్ గాల్ఫ ఆడుతోండగా బాండ్ 007 మాట్లాడిన కొన్ని సంభాషణలు అవసరమయాయి."

"అవే ఎందుకట?"

"నాన్సెన్స్..." బాండ్ నోరు టక్కున మూతపడింది. పోర్టికోలో రోల్స్రాయిస్ కారు ఆగింది. వెంటిలేటర్ లోంచి కారు కనిపిస్తోంది. ఎవరో తలుపు తెరచుకుని దిగారు.

"లాక్! త్వరగా దుస్తులతో దూరు. ఎవరో పార్టీ వస్తోన్నారు."

"పార్టీయా?" నోరు చప్పరించాడు లాక్.

బాండ్ హుందాగా మెట్లు దిగాడు.

గుమ్మంలో ఎత్తుమడమల జోళ్ళు శబ్దం చేశాయి.

లాక్ టవల్ సవరించుకోబోయాడు. బాండ్ అతడిని డొక్కలో గుచ్చాడు.

"లోపలికిపో. బట్టల్లో తగలబడు! రాకరాక పార్టీ

వస్తోంది!" గుసగుసలాడాడు బాండ్. లాక్ గదిలోకి తారాజువ్వలా పరుగెత్తాడు.

"నమస్తే మిస్టర్ బాండ్!" వీణ మీటినట్టయింది.

బాండ్ చకచక గుమ్మంలోకి నడిచాడు. కన్ను ఆర్పకుండా ఆమెనే చూడసాగాడు.

ఆమెకు పాతికేళ్ళుంటాయి. చక్కటి కనుముక్కుతోనూ, అవయవ సంపదా, బంగారు తీగలాంటి శరీరానికి అతుక్కుపోయిన బ్లవుజూ, మాచింగ్ అయ్యేలాగా బెనారస్ కాటన్ చీరా, మెడలో ముత్యాల హారమూ, చెవులకు స్టార్స్, ఎత్తుమడమల జోళ్ళూ, చేతికి వ్రేలాడుతూ వానిటీ బాగ్....అన్నింటికీ తోడు ఆమె పెదిమలమీద మందహాసం వుంది.

"నమస్తే...." హుందాగా చెయ్యి ఎత్తాడు బాండ్.

"ఏమిటలా చూస్తున్నారు?" అడిగింది ఆమె.

"ఇంత అందగత్తెకు పేరేమై ఉంటుందా అని!" వానిటీ బాగ్ మీద దృష్టి నిలిపాడు బాండ్.

"అక్కడ నా పేరు వుండదులెండి మిస్టర్ బాండ్!"

"ఎస్. అక్కడ లేదు."

"హుఁ! గడుసువారే!"

"అవును.... నేనూ అంతే!"

ఆమె, బాండ్ వులిక్కిపడి ప్రక్కకు చూశారు. లాక్! బాండ్ అతడిని నమిలి తినేసేలాగా చూశాడు. సూటువైపు చూచి నుదురు చిట్లించాడు.

"నా సూటు తగిలించావేం?" అడగబోయాడు బాండ్.

లాక్ అతడికి ఆ అవకాశం యివ్వదలచుకోలేదు.

"బాండ్! ఆమెను నిలబెట్టేశావు. మిస్ సుందరీ!

లోపలకు రండి. కూర్చోండి!" అన్నాడు లాక్ వినయంగా వంగి.

"ఎయిర్ యిండియా మహారాజ్!" నవ్వింది ఆమె.

"కాదు మిస్ సుందరీ! నా పేరు షెర్లాక్ హోంస్. ఈ జేమ్స్‌బాండ్ ముద్దుగా 'లాక్' అంటాడు. డిటెక్టివ్ లాక్!"

బాండ్ అతడి భుజం తట్టి కోపంగా అదిమి, "రండి మిస్...." అని దారితీశాడు.

"సుందరి!" అంది ఆమె.

"మీ పేరు నిజంగా సుందరేనా?" అడిగాడు బాండ్.

ఆమె నవ్వి వూరుకుంది. లాక్ డ్రాయింగ్ రూంలోకి దారితీశాడు.

ముగ్గురూ ఎదురెదురు కుర్చీలలో కూర్చున్నారు. ముగ్గురి మధ్యలో రౌండ్ టీపాయ్ వుంది.

"నేను ఒక కేసు విషయమై మీ వద్దకు వచ్చాను" అంది ఆమె.

"చెప్పండి మాడం!" అన్నాడు బాండ్ కుర్చీలో వెనక్కు వాలి.

లాక్ కళ్ళు మూసుకుని తదేకంగా వింటున్నాడు.

"నా దగ్గర దొంగనోట్లున్నాయి."

బాండ్ కళ్ళు చికిలించాడు. "వుండవచ్చు. అసలు మన దగ్గరకు వచ్చేవి అసలు నోట్లా, దొంగ నోట్లా అని నాకూ ఓ అనుమానం వుంది" అన్నాడు.

"కరెక్ట్! నా పర్స్‌లోకి దొంగనోట్లు ఎలా వచ్చాయో తెలీదు."

"ఎప్పుడు వచ్చాయి?"

"నిన్న సాయంకాలం మార్కెటింగ్ కి బయలుదేరాను. చీరలు బేరంచేసి పర్స్ తెరిచాను. వంద రూపాయలనోట్లు బయటకు తీశాను. ఒక నోటుమీద నా చూపు పడింది" ఆమె వానిటీ బాగ్ తెరిచింది.

ఆమె బాండ్ కి వందరూపాయిలనోటు అంటించింది. బాండ్ నోటును వెలుగుకు అడ్డంగా పట్టుకున్నాడు. జేబు లోంచి భూతద్దంతీసి నోటును పరీక్షించాడు.

"ఇది దొంగనోటు అని మీకు ఎలా తెలుసు?" అడిగాడు లాక్ కళ్ళు మూసుకునే.

బాండ్ అతడిని సీరియస్ గా చూచి, తరువాత ఆమెను చూచి పెదిమ విరిచి, "సమాధానం చెప్పండి మిస్ ...." అన్నాడు.

"సుందరి. సుందరీ అనే పిలవండి బాండ్! రిజర్వ్ బాంక్ అక్షరాలు!"

భూతద్దాన్ని అక్షరాలమీదికి జరిపి నాలుక కరుచుకున్నాడు బాండ్.

"తప్పు కనిపెట్టారా బాండ్?"

"లేదు" అన్నాడు లాక్ కళ్ళు తెరవకుండానే.

బాండ్ ఇబ్బందిగా కదిలి, "మిస్ సుందరీ! మీ తెలివిని అభినందిస్తున్నాను" అన్నాడు.

లాక్ కళ్ళు తెరవకుండానే చటుక్కున చెయ్యిచాపి కరెన్సీ నోటు లాక్కున్నాడు. క్షణంలో సగంసేపు ఒంటి కన్ను తెరచి తిరిగి కన్ను మూశాడు. నోటు జేబులో వుంచుకున్నాడు.

"రిజర్వడ్ బాంక్! అబ్సర్డు! 'డి' అక్షరం ఎక్కువయింది" అన్నాడు లాక్.

"ఎస్. మీరు పట్టేశారు."

"అంతేకాదు మిస్ సుందరీ! నిన్న మీరు మార్కెట్టుకు వెళ్ళలేదు."

బాండ్ వాళ్ళిద్దరినీ మార్చి మార్చి చూశాడు.

"వెళ్ళలేదా? మీరు ఎలా వూహించారు?" అడిగింది సుందరి.

"ఆ విషయం తర్వాత. అబద్ధం ఎందుకు చెప్పారు?"

సుందరి చిరాకుగా కదిలి, "మీరు కళ్ళు తెరిచి మాట్లాడితే బాగుంటుంది" అంది.

లాక్ ఆమెకు సమాధానం యివ్వలేదు "మీవద్ద యిటువంటి కరెన్సీ నోట్లు ఎన్ని వున్నాయి?"

"మొత్తం నాలుగు!"

"ఎప్పటినుండీ యివి మీ వద్దకు వచ్చాయో గుర్తించ గలిగారా?"

"చెప్పానుగా. నిన్న నే....బట్టల షాపులో."

"కథలు చెప్పక...."

బాండ్ కలగచేసుకున్నాడు. "లాక్! నీ ప్రవర్తన చాల అసహ్యంగా వుంది. మాడం! మీరు ఏం తీసుకుంటారు.

"ఆమె ఏం తీసుకుంటారు? ఇప్పుడేకదా హోటల్లో మసాలాదోసె తిని వచ్చారు!" అన్నాడు లాక్.

సుందరి అతడిని ప్రేతాన్ని చూచినట్టు చూచింది.

చటుక్కున లేచి లాక్ను కదపబోయింది. అప్పటికే లాక్ కళ్ళు తెరచి, "సుందరీ! అరికథలు ఆపి అసలు కథ చెప్పు" అన్నాడు.

సుందరి ఆగి, తలమీద చేతులు పెట్టుకుని కూర్చుంది.

"ఒక వారం క్రితం అనుకుంటాను. రోల్స్ రాయిస్

డ్రయివ్ చేస్తోన్నాను. దారికి అడ్డంగా ఒక బిచ్చగాడు వచ్చాడు. అతడు వందరూపాయిలు నోటు చూపించి కారు ఆపమన్నాడు. అతడి మొహం చూచి జాలివేసింది. కారు ఆపాను.

"అమ్మగారూ! వంద రూపాయలకు చిల్లర ఇస్తారా?" అడిగాడు అతడు.

నాకు చిరాకు కలిగింది. వందరూపాయిల చిల్లరకోసం రోల్స్‌రాయిస్ కారు ఆపుతాడా? అనిపించి అంతలో నే సర్దుకున్నాను. వానిటిబాగ్ తెరచి చూశాను.

"పది రూపాయిల నోట్లయినా సరే!" అన్నాడు అతడు.

నేను వందరూపాయిలనోటు తీసుకుని పదిరూపాయిల నోట్లు పది లెక్కపెట్టి యిచ్చాను.

ఇంటికి వెళ్ళాక కూడా నాకు ఆ విషయం పదేపదే గుర్తుకువస్తోంది. బిచ్చగాడి చేతిలో వందరూపాయిల నోటు ఏమిటి? కారు పోర్టికోలో ఆపి దిగాను. ఇంతలో మురారి వచ్చాడు.

"మురారా? అతదెవరు?" అడిగాడు బాండ్ మధ్యలో.

"మా బావ. మేనబావ."

"మేనమామ ఎవరు?"

"భద్రయ్య."

"ఆయన ఏం చేస్తోంటాడు!" అడిగాడు లాక్.

"అధిక ప్రసంగం!" గొణుక్కున్నాడు జాండ్.

"మురారి వచ్చి "అరె! డబ్బు పారవేసుకున్నావు ఏమిటి?" అన్నాడు.

"డబ్బా?" అన్నాను.

మురారి సీటుమీదనుండి మూడు వందరూపాయినోట్లు అందుకుని యిచ్చాడు. నేను వాటిని నిర్లక్ష్యంగా వానిటీ బాగ్‌లో వేసుకున్నాను. ఈ రోజు మార్కెటింగ్‌కి వెళ్ళాలని యిద్దరమూ బయలుదేరబోయాం. డబ్బు లెక్క పెడుతూ మురారే చూశాడు. రిజర్వ్‌డ్ బాంక్ అనే అక్షరాలు చూశాం. దొంగనోట్లు అని తెలుసుకున్నాం."

"అయితే మురారి మీ వెంట రాలేదేం!" అడిగాడు బాండ్.

లాక్ పరిహాసంగా నవ్వి, "ఆయన కారులో కూర్చు న్నారు" అన్నాడు.

సుందరి అతడిని విడ్డూరంగా చూచి, "చూడబోతే మీకు వ్యవహారం అంతా తెలుసు గాబోలు!" అంది.

లాక్ అతి సామాన్యంగా కదిలి, బయటకు వెళ్ళాడు. తిరిగి అతడు వచ్చేటప్పటికి అతడి వెంట ముఫ్ఫయ్యేళ్ళ యువకుడున్నాడు.

"మిష్టర్ మురారీ! కూర్చోండి!" అన్నాడు బాండ్ హుందాగా.

మురారీ, లాక్ కూర్చున్న తరువాత సుందరి బరువుగా నిట్టూర్చింది.

లాక్ అతడిని చిరునవ్వుతో చూచి, తరువాత సుందరి వైపు తిరిగాడు.

"సుందరీ! మీకు దొంగనోట్లు కనిపించి రోజుల తరబడి అయింది. అయినా ఈ రోజువరకూ మీరు వాటి విషయమై పరిశోధించమని మమ్మల్ని కోరలేదు" అడిగాడు లాక్.

"ఇంతకాలం కోరవచ్చునా లేదా అని తటపటా యించాను. చివరకు మురారిని సలహా అడిగాను.

'విషయం అంతు తెలుసుకో' అన్నాడు మురారి."

"మురారీ....మీరు చాలా మంచి పనే చేశారు!" అన్నాడు బాండ్.

లాక్ నవ్వి, "ఇపుడు చెప్పు సుందరీ! కొత్తగా ఏర్పడిన పరిణామం ఏమిటి?" అన్నాడు.

"బాగా వూహించారు. నా గాడ్రెజ్ బీరువాలో నోట్లకట్టలున్నాయి. అవి అన్నీ మారిపోయాయి. అంటే దొంగనోట్లు అయిపోయాయన్నమాట!"

"బీరువా తాళం చెడిందా?"

"చెడింది. అందుకే అనుమానంగా నోట్లకట్టలు పరిశీలించాను. అన్నీ దొంగనోట్లే!"

"ఈ విషయం ముందే చెప్పవచ్చుకదా!" కలగచేసుకున్నాడు బాండ్.

లాక్ అతడికి కనుసైగచేసి, "ఆల్ రైట్ మీ ఇంటిని ఒకసారి చూడాలి!" అన్నాడు ఆమెవైపు తిరిగి.

ఆమె తలూపి లేచింది.

## 2

రోల్స్‌రాయిస్ కారు గేటు దాటింది. అందమైన భవంతి పోర్టికోలో ఆగింది. కారులోంచి బాండ్, లాక్, మురారీ, డ్రయివింగ్ సీట్లోంచి సుందరీ దిగారు. సుందరి ముందు దారితీసింది. నలుగురు మెయిన్ హాలులో ప్రవేశించారు.

మెయిన్ హాలులో నడివయస్కురాలు చటుక్కున కుర్చీలోంచి లేచింది.

"మా అత్తయ్య పార్వతమ్మ. ఆమె ఒంటరిది నాకు లాగానే" అంది సుందరి.

పార్వతమ్మ చూస్తోంది.

"ఆమెకు మూగ, చెవుడూ వున్నాయి కదా!" అన్నాడు లాక్.

"అవును."

"మీ యిద్దరితోబాటు యింత విశాలమైన భవనంలో యింకా ఎవరెవరుంటారు?"

"ఒక తోటమాలీ, ఒక పనిమనిషీ ఇద్దరూ భార్యాభర్తలే, అవుట్ హౌస్‌లో వుంటారు."

బాండ్ తలూపాడు.

"మీ గదివైపు పదండి!" అన్నాడు లాక్.

సుందరి మేడమీదకు దారితీసింది.

అందమైన గది. విశాలంగా వుంది. గదిలో ఒకమూల గాడ్రెజ్ బీరువా వుంది. అదికాక రెండు కుర్చీలూ వాటిమధ్య రోజ్ వుడ్ టీపాయ్, గది గోడకు నిలువుటద్దమూ వున్నాయి.

బాండ్ అద్దంలోకి చూసుకున్నాడు. గది చాలవరకూ అద్దంలో ప్రతిఫలిస్తోంది.

అద్దంలోంచి కనిపిస్తోంది. సుందరి గాడ్రెజ్ బీరువాను సమీపిస్తోంది. తాళంచెవులతో బీరువా తెరచింది. నోట్లకట్టలు తీసి టీపాయ్‌మీద సర్దింది. లాక్ వాటిని పరిశీలనగా చూశాడు. జేబులోంచి వందరూపాయిల నోటు తీసి సరిపోల్చాడు.

బాండ్ అద్దంలోంచి గమనిస్తూనే అటు కదిలాడు. టీపాయ్‌మీద వందరూపాయిల నోట్లకట్టలు తాకి తల పంకించాడు.

"మీ యింట్లోకే నేరుగా దొంగనోట్లు వచ్చాయి. ఈ విషయమై మీరు ఎవరినయినా అనుమానించే అవకాశం వుందా?" అడిగాడు బాండ్.

సుందరి మాట్లాడబోయింది. కిటికీవద్ద అలికిడయింది. గాజు తలుపులకు అవతల ఎవరో కదిలినట్టయింది. బాండ్ బాణంలాగా పరుగెత్తాడు.

కిటికీ వద్ద పనిమనిషి చీపురు పట్టుకుంది. బూజులు దులుపుతోంది. బాండ్ ఆమెను సమీపించాడు. ఆమె అమాయకంగా కళ్ళెత్తి రెప్పలు టపటపలాడించింది.

"నీకు యిక్కడేదే పనిపడిందా?" అడిగాడు బాండ్.

ఆమె సైగ చేసింది. బాండ్ తలమీద మొట్టుకుని తిరిగి గదిలోకి వచ్చాడు.

"మీ పనిమనిషి కూడా మూగదా?" అడిగాడు బాండ్.

సుందరి మందహాసం చేసింది. "ఆమె భర్త రాములు ఆదే తోటమాలి — ఆమెను ఎవరితోనూ మాట్లాడవద్దంటాడు. అందుకే ఆమె మూగతనం ప్రదర్శిస్తుంది."

"ఆమెకు దొంగనోట్లతో సంబంధం వుందేమో!" అన్నాడు బాండ్....

"సీతకా? ఇంకా నయం!"

లాక్ మెల్లగా బాండ్ భుజం తట్టి, సుందరివైపు తిరిగి "తరచుగా యీ యింటికి ఎవరు వచ్చిపోతూంటారు?" అన్నాడు.

"నాకు ఈ పట్నంలో వున్నదల్లా మురారీ బావా, మేనమామా, మేనత్తా-వీళ్ళే బంధువులు! ఈ వారంలో మురారి తప్పించి యెవరూ రాలేదు."

"ఫ్రెండ్స్."

"ఫ్రెండ్స్ అంటూ పెద్దగా యెవరూ లేరు. లక్ష్మి అని మా క్లాస్‌మేట్ వుంది. అంతే!"

"ఆమె వచ్చి పోతూంటుందా!"

"అప్పుడప్పుడూ...."

"ఈ వారం రోజుల్లో వచ్చిందా?"

సుందరి ఆలోచించి, "నాలుగు వందరూపాయినోట్లు కనిపించిననాడు ఆమె వచ్చింది" అంది.

"లక్ష్మి అడ్రసు చెబుతారా!" అన్నాడు బాండ్.

"నాలుగూ ఆరూ ముప్ఫయి, మద్దిలపాలెం" చెప్పింది సుందరి. బాండ్ నోటుచేసుకున్నాడు.

"సుందరీ! పద! వందరూపాయిల చిల్లర అడిగిన ప్రదేశం చూపించు!"

సుందరి కదిలింది. నలుగురినీ ఎక్కించుకుని రోల్స్ రాయిస్ కారు హైవేమీద ఆగింది. రాళ్ళు కొట్టే ప్రాంతం అది. ఎత్తయిన బండరాళ్ళున్నాయి.

నలుగురూ కారు దిగారు. "ఇక్కడే! చిల్లర యిచ్చి వందరూపాయిల నోటు సంపాదించుకున్నాను!" అంది సుందరి.

"కారును చూచి బిచ్చగాడు వచ్చాడు కదా!" అడిగాడు.

సుందరి తలూపింది.

"ఎటునుండి వచ్చాడు?"

సుందరి ఎడమప్రక్కకు చూపించింది. అప్పటికే లాక్ ఎడమవైపు వున్న పెద్ద బండరాళ్ళవైపు కదిలాడు. బండరాళ్ళకు దిగువన పెద్ద క్వారీ వుంది. క్వారీకి బండ రాళ్ళకూ మధ్యగా రాళ్ళూ రప్పలూ పిచ్చి మొక్కలూ వున్నాయి.

పిచ్చి మొక్కలమధ్య ఆగాడు లాక్. చెత్త కాగి తాలూ వర్షానికి తడిసి, రంగు వెలసిపోయిన సిగరెట్టు పెట్టె రెండు సిగరెట్ పీకలూ అక్కడ కనిపించాయి.

లాక్ సిగరెట్ పెట్టె చేతిలోకి తీసుకున్నాడు. ఖాళీ సిగరెట్ పెట్టె!

"ట్రిబుల్ ఎక్స్....బొమ్మ అస్పష్టంగా వున్నా నాకు ఈ బ్రాండ్ తెలుసు" అన్నాడు లాక్.

బాండ్ విసురుగా పెట్టె లాక్కుని, "సుందరిని చూచి నీకు మతి పోయింది. ఆమె గమనిస్తోందని చెప్పి గొప్ప చేస్తోన్నావు" అన్నాడు.

"స్టాప్! సుందరి వస్తోంది."

సుందరి వాళ్ళిద్దరినీ సమీపించింది.

"మిస్టర్స్! రండి కారు దగ్గర మా మామయ్య మీ కోసం ఎదురు చూస్తూన్నాడు" అంది సుందరి.

"హాలో భద్రయ్యగారూ!" చురుకుగా అటు నడిచాడు బాండ్.

భద్రయ్య ఆప్యాయంగా అతడి చెయ్యి నొక్కాడు.

"నన్ను డిటెక్టివ్ బాండ్ అంటారు. 007 కాదు. మామూలు బాండ్!" నవ్వాడు బాండ్.

"సంతోషం బాబూ! మా అమ్మాయి....అదే మేన కోడలు యిబ్బందిలో వున్నట్టు ఈ రోజే తెలిసింది. మురారి కూడా చెప్పలేదు. ఈ కాలం పిల్లల తీరు అర్ధం కాదు బాబూ!"

భద్రయ్య మాట్లాడుతోండగా అక్కడికి లాక్ వచ్చాడు.

సుందరి తన మామయ్యకూ లాక్‌కూ పరస్పర పరిచయం చేసింది.

"సిగరెట్టు పెట్టె ఏమిటి బాబూ!" అడిగాడు భద్రయ్య. మురారి కూడా పెట్టెవైపు ఆశ్చర్యంగా చూశాడు.

"సుందరికి వందరూపాయిల నోటు అంటకట్టిన బిచ్చ గాడు యిక్కడే సుందరి రాకకోసం వేచికూర్చున్నాడు. అప్పుడే సిగరెట్స్ కాల్చి వుంటాడు. అతడు విడిచి పెట్టిన పెట్టే. త్రిబుల్ ఎక్స్ సిగరెట్ పెట్టె."

"మీ డిటెక్టివులకు పీటిమీద వ్రేలిముద్రలు కనిపిస్తాయి! అవునా?"

బాండ్ చురుకుగా చూచి, "వ్రేలిముద్రలు వుండటమంటూ సంభవిస్తే అవి ఎవరికయినా కనిపించితీరతాయి" అన్నాడు.

లాక్ కళ్ళు మూసుకున్నాడు.

"బిచ్చగాడి రూపురేఖలు వర్ణించు మిస్ సుందరి!" అన్నాడు బాండ్.

సుందరి చుట్టూ చూసింది. మురారి నన్ను కానట్టుగా చూచిన కొండవైపు చూపుసారించాడు.

"అతడు మామయ్యా అంత లావుగా వుంటాడు. మురారి బావ అంత ఎత్తు ఉంటాడు. నల్లగా మాసిన గడ్డం. తీక్షణమైన చూపులు. బట్టలు మాసి వున్నాయి" అంది సుందరి.

"కాళ్ళకు స్లిప్పర్స్ వున్నాయా?"

"చూడలేదు."

"పదండి పోదాం!" అన్నాడు లాక్ కళ్ళు తెరచి.

సుందరి రోల్స్‌రాయిస్ వైపు బయల్దేరింది. దాని వెనుక ఆగిన అంబాసిడర్ కారు వైపు భద్రయ్యా మురారీ కదిలారు.

"మనం ఎటు వెళ్దాం?" అడిగాడు బాండ్.

"నడిచి. నగరం వైపుగా" అన్నాడు లాక్.

"ఎందుకు?" బాండ్ అసహనంగా అడిగాడు.

"బిచ్చగాడి ఆరా తెలుస్తుంది!"

"ఎక్కడ?"

"ఆ కనిపించే కిళ్ళీకొట్టు దగ్గర."

"మిష్టర్ బాండ్ అండ్ లాక్!" పిలిచింది సుందరి.

అపరాధ పరిశోధకులిద్దరూ రోల్స్‌రాయిస్ వైపు నడిచారు. "మాకు కొద్దిగా పనుంది. మీరు వెళ్ళండి" అన్నాడు లాక్.

సుందరి నవ్వింది.

కార్లు రెండు బయలుదేరి వెళ్ళిపోయాయి.

లాక్, బాండ్ రోడ్డుమీద నడవసాగారు.

# 3

ఎక్కడో కోడి కూస్తోంది. గూర్ఖా హైవేమీద ఆగాడు. హైవే ప్రక్కగా కిళ్ళీకొట్టు వుంది. గూర్ఖా అటు నడిచాడు.

కిళ్ళీకొట్టును సమీపించాడు గూర్ఖా. బీడీతీసి ముట్టించుకున్నాడు. అగ్గిపుల్ల విసరబోతూ అలాగే నిలబడి పోయాడు. గాలికి అగ్గిపుల్ల ఆరిపోయింది.

కిళ్ళీకొట్టు తలుపు ఓరగా తెరచి వుంది. తలుపులోంచి నేలమీదకు ప్రాకినట్టు ఏదో వస్తువు కనిపిస్తోంది. గూర్ఖా వస్తువుమీదకు వంగాడు.

అవి కాళ్ళు.

గూర్ఖా కాళ్ళను తట్టి "సాములూ! సాములూ!" అన్నాడు. కాళ్ళు మంచుముక్కల్లా తగిలాయి.

గూర్ఖా చటుక్కున చేతులు వెనక్కి లాక్కున్నాడు.

జేబులోంచి బాటరీలైట్ తీశాడు. స్విచ్ ఆన్ చేశాడు. కిళ్ళీకొట్టులోకి ఫోకస్ చేశాడు.

సోములు వెల్లకితలా పడివున్నాడు. గూర్ఖా తిరిగి రోడ్డుమీదకు వచ్చాడు. మొహం, శరీరం చెమటలు పట్టాయి. షర్టు విప్పి గాలి పోసుకున్నాడు. చకచక రోడ్డుమీద నడవసాగాడు. పబ్లిక్ టెలిఫోన్ బూత్‌ను సమీపించాడు.

క్రయిమ్ బ్రాంచ్ ఆఫీసుకు ఫోన్ చేశాడు.

అరగంటలో నాలుగు పోలీస్‌వాన్‌లూ, ఒక అంబులెన్స్ వాన్ కిళ్ళీకొట్టుముందు ఆగాయి. క్రయిమ్ బ్రాంచ్ యిన్‌స్పెక్టర్ కుమార్ కిళ్ళీకొట్టుముందుకు నడిచాడు.

ఫోటోగ్రాఫర్ ఫోటోలు తీశాక వ్రేలిముద్రల నిపుణుడు కిళ్ళీకొట్టులో ప్రవేశించాడు.

"సోములు నీకు ఎలా తెలుసు?" అడిగాడు ఇన్‌స్పెక్టర్ కుమార్.

"నేను బీట్‌నుండి తిరిగి వచ్చేటప్పుడు సాధారణంగా సోములును నిద్రలేపి వెళ్తాను. మా యిద్దరికీ పది సంవత్సరాలనుండి దోస్తీ!" అన్నాడు గూర్ఖా.

"సోములు కిళ్ళీకొట్టులో పండుకుంటాడా?"

"అవును సార్! హైవే రాత్రివేళలో నిర్జనంగా వుంటుంది. కిళ్ళీకొట్టులో పండుకుని తన షాపును కాచుకుంటాడు."

శవాన్ని వెలుపలకు తీసుకువచ్చారు. తూర్పున వెలుగు రేకలు విచ్చుకుంటున్నాయి. పాథాలజీ సర్జన్ ముందుకు వంగి సోములు శవాన్ని పరీక్షించాడు.

"శవం తల సల్లగా వుంది. తలమీద దెబ్బ తగలడం వలన ఇలా జరిగివుండాలి" అని శవం తలయెత్తి చూశాడు సర్జన్. తల వెనుక భాగంలో వుబ్బెత్తుగా వుంది.

"చిన్న మెదడుమీద సరాసరి దెబ్బ తగిలింది" అన్నాడు సర్జన్ తిరిగి.

కుమార్ తలూపి, "హత్యాయుధం ఏమైవుంటుంది?" అన్నాడు.

"కిళ్ళీకొట్టులో వెతికించండి" అన్నాడు సర్జన్.

కుమార్ సార్జంటుకు పురమాయించాడు.

"ప్రాణంపోయి ఎంత సేపయి వుంటుంది?"

సర్జన్ శవం చెయ్యి వంచి చూశాడు. "రిగర్ మార్టిస్ ప్రారంభమవుతోంది. అంటే హత్య రాత్రి 12 తర్వాత 2 గం॥ల ముందు జరిగివుండాలి. హతుడితో బాగా పరిచయం వున్నవాడే చంపివుండాలి."

"ఆ విషయం ఎలా చెప్పగలరు సర్జన్?"

"కిళ్ళీ కొట్టులోనే జరిగింది హత్య. తలుపు ఓరగా తెరచి వుంది. హతుడూ హంతకుడూ కొట్టులో వున్న అతి తక్కువ స్థలంలో మాట్లాడుకుంటున్నారు. అంటే హతుడికి అంత సమీపంగా వ్యక్తి పరాయివాడై వుండడు కదా!"

"హత్య కిళ్ళీకొట్టు లోపలనే జరిగిందని ఎలా చెప్ప గలరు?"

"కిళ్ళీకొట్టు లోపల బిస్కట్ల సీసాలు పగిలివున్నాయి. కిళ్ళీలు కట్టే సామగ్రి తలక్రిందులయింది. అంటే ఇక్కడే హతుడిమీద దాడి జరిగిందన్నమాట!"

కుమార్ పాయింట్స్ నోట్ చేసుకున్నాడు. శవాన్ని అంబులెన్స్‌కు తరలించారు.

ఇద్దరు కానిస్టేబుల్సునూ, సార్జెంటునూ కిళ్ళీకొట్టు దగ్గర కాపలా వుంచి—కుమార్ జీపులో బయలుదేరాడు.

లాక్ కళ్ళు మూసుకు కూర్చున్నాడు. బాండ్ టేబులుమీద కాళ్ళు చాపి, సిగరెట్ ముట్టించాడు.

"లాక్! సుందరి పేరు సుందరేశన్ అని నీకు యెలా తెలుసు?" అడిగాడు బాండ్.

లాక్ మాట్లాడలేదు.

"సుందరి మన దగ్గరకు వచ్చేముందు మసాలాదోశె తిన్నదని చెప్పావు. ఎలా చెప్పగలిగావ్?"

"వంద రూపాయిలనోటు మసాలదోశె వాసన వేసింది. బిల్లు చెల్లించడానికి ఆమె దోశె తిన్న చేతితోనే వానిటీ బాగ్‌లో చెయ్యి పెట్టిందన్న మాట!"

"మరి షాపింగ్ విషయం?"

"చూడు బాండ్! సుందరి నిన్న మార్కెటింగ్ చేశానని చెప్పింది. బట్టలు కొనడానికి వెళ్ళిందట. అది మార్కెటింగ్ ఎలా అవుతుంది? షాపింగ్. బాగా నాగరికత వున్న యువతి ఎందుకలా కంగారుపడింది? అంటే ఎక్కడో ఎందుకో అబద్ధం చెబుతోందన్నమాట!"

"గుడ్ లాజిక్ మిష్టర్ షెర్లాక్!"

"లాక్. దట్సాల్!"

"ఆమె యింకా కొన్ని రహస్యాలు దాచినట్టు ఎలా తెలుసుకున్నావు?"

"అది వృత్తి రహస్యం బాండ్."

బాండ్ రెండు కాళ్ళూ టేబిలుమీదనుండి దింపి లాక్ కూర్చున్న కుర్చీని ఫెడీమని తన్నాడు. టేబిలుకి దూరంగా కుర్చీ తుళ్ళింది. లాక్ ఎగిరి కార్పెట్ మీద పడ్డాడు.

బాండ్ విలాసంగా నవ్వి, "నేనూ నీ వృత్తిలో

లేనా?" అన్నాడు.

లాక్ కార్పెట్ మీద పడుకుని కళ్ళు మూసుకున్నాడు.

"ఉన్నావు. విగ్రహం పుష్టి!"

"నాన్సెన్స్! నీకు సుందరిని చూచి మతి చలించింది."

"కాదు. నీకు జోగినాధం తెలుసా?"

"ఏ. జోగినాధం."

"ఏ! జోగినాధం. అరటికట్టల జోగినాధం. అరటి ఆకులు అమ్మి లక్షలు కూడబెట్టాడు."

"అతడా? ఆతడు చనిపోయి ఏడాదవుతోందికదా!"

"చనిపోయికాదు బాండ్! ఉరిపోసుకుని!"

"అవును. అతడు ఉరిపోసుకుని కదూ చనిపోయాడు."

"అతడు నా క్లయంట్ గా వుండేవాడు. అప్పట్లో నేనూ లా ప్రాక్టీస్ వెలగబెట్టాగులే! సుందరి అప్పుడు నాకు పరిచయం! ఒన్ వే ట్రాఫిక్ పరిచయం, ఆమె జోగినాధం కూతురిని నాకు తెలుసు. నేను తన తండ్రికి లీగల్ అడ్వయిజర్ నని ఆమెకు తెలియదు!"

"ఐ.సీ."

"అతడి ఆత్మహత్యకు కారణం సుందరి ప్రేమ పురాణం."

"ఈజిట్?"

"బాండ్! తెలుగులో ఆశ్చర్యపో. అంగ్లంలో కాదు! సుందరి ప్రియుడు మురారి. మురారి వలన ఆమె పెళ్ళి కాకముందే గర్భవతి అయింది. అబార్షన్! జోగినాధంకు తల కొట్టినట్టయింది."

"ఏం? మురారిని తన్ని అయినా పెళ్ళి చేయించవచ్చు కదా!"

"మురారి దేశంమీదకు పారిపోయాడు. జోగినాధం

కుమిలిపోయాడు. భద్రయ్య తన కొడుకు గురించి భరోసా కలిగించ ప్రయత్నించాడు. జోగినాథం నమ్మినట్టే నమ్మి ఉరితాటికి వ్రేలాడిపోయాడు పాపం!”

“ఏమైనా సుందరిదే తప్పు!”

“అందుకే ఆమె మురారిని యింకా ప్రేమిస్తోన్నట్టు గానే వుంది. మురారికి మాత్రం ఆమెమీద మోజు తప్పి పోయింది.”

“జోగినాథం ఆస్తి ఏమాత్రం వుంటుంది?”

“పాతిక ముప్ఫయిలక్షల పై చిలుకు వుంటుంది. ఈ ఏడాదిలో అది యింకా గుడ్లు పెట్టి వుంటుంది!”

“ఇంతకు బిచ్చగాడిగా నటించిన వ్యక్తి ఎవరు? అతడు నాలుగు వందరూపాయినోట్లు సుందరికి అందించడానికి కారణం ఏమిటి? సోములు మనల్ని ఈ రోజు ఉదయం రమ్మన్నాడు. అతడికి ఈ విషయాలు ఎంత వరకూ తెలుసు?”

“సోములు బిచ్చగాడిగా నటించిన వ్యక్తిని చూశాడు కదా! అతడికీ సోములుకూ పూర్వ పరిచయం వున్నదేమో!”

“నిన్న నువు సోములు కిళ్ళీకొట్టువద్ద కాపలా వుండవలసింది. ఏమైనా తెలిసేదేమో!”

“సోములు....” లాక్ కళ్ళు చటుక్కున తెరచుకున్నాయి. గుమ్మంలోంచి బూట్లు టకటకలాడించుకుంటూ పోలీస్ యిన్స్పెక్టర్, ఇద్దరు కాన్‌స్టేబుల్సూ ఒక హెడ్ కాన్‌స్టేబులూ వచ్చారు. లాక్ వద్దా, బాండ్ వద్దా కానిస్టేబుల్సు డ్యూటీ వేసినట్టుగా నిలబడిపోయారు.

“క్రయిమ్ బ్రాంచ్....” బాండ్ గొంతు పొడారి పోయింది.

"ఎస్. ఇన్‌స్పెక్టర్ కుమార్!"

లాక్ కళ్ళు మూసుకున్నాడు.

ఇన్‌స్పెక్టర్ కుమార్ బల్లమీద కాలు పెట్టాడు. ముద్దాయిని చూచినట్టుగా బాండ్‌నూ, లాక్‌నూ పరకాయించి చూశాడు.

"మీ యిద్దరూ ఎవరు?" లాఠీ టకటకలాడింది బల్ల మీద.

"డిటెక్టివ్ లాక్ అండ్ బాండ్!" బాండ్ గొంతు గుటకపడింది.

"మీలో లాక్ ఎవరు? బాండ్ ఎవరు?"

"శవాసనం వేసినవాడు లాక్!"

"బాండ్! మిమ్మల్ని యిద్దరినీ అరెస్టు చేస్తున్నాను."

"ఎం ...దు....కు?"

"సోములును హత్య చేసినందుకు!"

"సోములు హత్య చేయబడ్డాడా??"

ఇన్‌స్పెక్టర్ కుమార్ కార్పెట్‌మీదకు చూశాడు. "లాక్! నీ కళ్ళకు లాక్ పడిందా? లేవరా రాస్కెల్? హెడ్! వాడిని ముక్కలు విరగతన్ను. డిజ్ ఓబీడి యన్స్! పోలీసు అంటే ఎవడికీ లక్ష్యంలేదు!"

లాక్ మీదకు వంగబోయాడు హెడ్‌కానిస్టేబులు. లాక్ స్ప్రింగ్‌లా లేచాడు. "సోములు ఎన్ని గంటలకు చనిపోయాడు ఇన్‌స్పెక్టర్?" అన్నాడు.

కుమార్ వాళ్ళను వ్యంగ్యంగా చూచి, "మీ ఇద్దరూ ఎన్ని గంటలకు చంపారో అన్ని గంటలకే!" అన్నాడు.

"మాకు అతడిని చంపవలసిన అవసరం ఏం వుంది?"

"నిన్న అతడు కిళ్ళీకొట్టులో వుండగా మీ ఇద్దరూ అతడితో మాట్లాడారు. అతడితో మీరు మాట్లాడే అవ

కాళం ఏం వచ్చింది?"

బాండ్ గొంతు సవరించుకుని చెప్పబోయాడు.

"మీ యిద్దరికీ ప్రయివేట్, యిన్వెస్టిగేషన్ చేయ డానికి లైసెన్స్ వుందా?" అడిగాడు ఇన్స్పెక్టర్.

"వుంది సార్!"

"గుడ్ అంతా సిద్ధంగానే వుంచుకున్నారన్నమాట! పదండి స్టేషన్కు!" కుమార్ ఆవేశంతో వూగిపోయాడు.

అపరాధపరిశోధకులిద్దరూ కదిలారు. పోలీస్ జీపులో స్టేషన్కు చేరుకున్నారు.

బాండ్, లాక్ యిన్స్పెక్టర్తో సుందరి తమ దగ్గరకు వచ్చింది లాగాయితూ చెప్పారు.

"సుందరీ ఆమె బంధువులనూ అటు పంపించి మేమి ద్దరమూ సోములు దుకాణం చేరుకున్నాం. అతను బిచ్చ గాడిగా సుందరి చెప్పిన వ్యక్తిని చూశాడు. అతడి విషయమై పూర్తి వివరాలు యీరోజు యిస్తానన్నాడు" అన్నాడు లాక్.

"ఇదంతా నమ్మమంటావా మిష్టర్ లాక్?"

"మీ యిష్టం! నమ్మినా నమ్మకపోయినా సరే చెప్ప దగింది యింతే!"

"సుందరి ఫోన్ నెంబరెంత?"

లాక్ చెప్పాడు.

ఇన్స్పెక్టర్ కుమార్ డయల్ చేశాడు. అవతల సుందరి పలికింది.

"డిటెక్టివ్ లాక్ అండ్ బాండ్ మీ విషయంలో పని చేస్తున్నారా?" అడిగాడు కుమార్.

"అవును సార్! ఏమయింది?"

"మీరు ఒకసారి క్రయిమ్‌బ్రాంచ్ ఆఫీసుకు రావలసి వుంటుంది."

"తప్పకుండా" అవతల కిక్లోమంది.

పదినిమిషాల్లో సుందరి వచ్చింది. జరిగిన విషయం తెలుసుకుంది.

"వెరీ సారీ! మీరు యిటువంటి యిబ్బందిలో పడతారని వూహించలేదు. పోతేపోయిన డబ్బు! మీరు కేసు మానుకోండి!" అంది సుందరి.

"అదెలా సాధ్యం?" కుమార్ కలగ చేసుకున్నాడు. "సోములు హత్యకేసు తేలేవరకూ వీరిద్దరూ రిమాండ్‌లో వుండాలి!"

"నేను బెయిలు ఇస్తాను! ప్లీజ్! ఇన్‌స్పెక్టర్ గారూ! నామూలయిన వీరు జెయిలుపాలు కాకూడదు."

"ఆల్‌రైట్! వీరు నేను చెప్పేటంతవరకూ పట్నం వదలడానికి లేదు."

అపరాధ పరిశోధకులు తలలూపారు. తర్వాత లాక్ కళ్ళు మూసుకున్నాడు.

"మీ అనుమతి అయితే సోములు కిళ్ళీ దుకాణాన్ని ఒకసారి పరిశోధించాలని వుంది" అన్నాడు బాండ్.

కుమార్ అయిష్టంగా తలూపాడు.

రోల్స్‌రాయిస్ కారులో సుందరీ, బాండ్, లాక్ బయలుదేరారు. సోములు కిళ్ళీ దుకాణం ముందు కారు ఆపింది సుందరి. షాపుముందు పోలీసులు యిద్దరు కాపలా వున్నారు. కుమార్ పేరు చెప్పి బాండ్ కిళ్ళీకొట్టులో ప్రవేశించాడు. పగిలిన సీసాలూ, తిరగబడిన కిళ్ళీసామగ్రీ యథాతథంగా వున్నాయి. బాండ్ గాజు అద్దాల షోకేసులోకి చూశాడు. వాటిలో సిగరెట్ పెట్టెలున్నాయి.

వాటిమధ్య ఒక వరుస ఖాళీ వుంది. ఖాళీగా వున్న కేసు గోడమీద సిగరెట్ పెట్టె అట్ట అంటించి వుంది. ట్రిబుల్ ఎక్స్ సిగరెట్ పెట్టె!

"లాక్!" అరిచాడు బాండ్.

కళ్ళు మూసుకుని నిలబడ్డవాడల్లా చటుక్కున కళ్ళు తెరచి షాపులోకి నడిచాడు.

"ట్రిబుల్ ఎక్స్ సిగరెట్ పెట్టెలో మిస్టరీ వుంది!" అన్నాడు బాండ్.

లాక్ చటుక్కున పగిలిన గాజుముక్కలు దాటి మూలకు చెయ్యి చాపాడు. సిగరెట్ పెట్టె చేతికి తగిలింది. లాక్ పెట్టె బయటకు తీశాడు. ట్రిబుల్ ఎక్స్ పెట్టె! లాక్ పెట్టె తెరిచాడు. పెట్టెలో సిగరెట్లున్నాయి.

బాండ్ కళ్ళు పెద్దవి చేశాడు.

ఇద్దరూ కలసి షాపు బయటకు వచ్చారు. సుందరి కారు స్టార్టుచేసింది.

## 5

మద్దిలపాలెం రోడ్డు దిగాడు బాండ్. ఇళ్ళ నెంబర్లు చూసుకుంటూ ఒక పెంకుటింటిముందు ఆగాడు.

"లక్ష్మీ!" పిలిచాడు బాండ్.

ఒక పొతికేళ్ళ యువతి బయటకు వచ్చింది.

"ఎవరు!" అంది.

"నన్ను సుందరి పంపించింది. నా పేరు బాండ్" అన్నాడు బాండ్.

"బాండ్! ఆదేం పేరు జేమ్స్‌బాండ్‌లాగా."

"కావచ్చును. మురారితో మీ పరిచయం గురించి తెలుసుకోవాలి."

"ఎందుకు?"

"మురారిని సుందరి ప్రేమిస్తోంది. మీరు అతడిని పెళ్ళి చేసుకుంటారేమో తెలుసుకోమని నన్ను పంపించింది."

"అబ్సర్డ్! సుందరి అలాంటి విషయం వుంటే నాతోనే నేరుగా చెప్పి వుండేది. మిమ్మల్ని పంపి వుండేది కాదు."

బాండ్ నవ్వి, "సోములు మీకు బంధువు. అయినా మీరు అతడి బాడీని క్లయిమ్ చేయలేదు. ఎందుకని?"

"సోములు కొన్ని కొన్ని చట్టవిరుద్ధమైన పనులలో యిరుక్కున్నట్టు మాకు తెలిసింది. పైగా దారుణంగా ఎవరి చేతుల్లోనో హత్య చేయబడ్డాడు. ఆ కారణంగా నేను వెళ్ళలేదు."

"మురారికి ఈ హత్య విషయంలో సంబంధం వుండి వుంటే?"

"మీకు మతిపోయింది. మురారికి ఈ విషయంలో సంబంధం ఎలా వుంటుంది?"

"సోములు కిళ్ళీకొట్టుకు మురారి పోయిన వారం వెళ్ళాడు. తగాదా వేసుకున్నాడు."

"ఏ విషయంలో?"

"నీ విషయంలో. సోములు నీమీద మనసుపడ్డాడు. నీ విషయంలో యిద్దరికీ ఘర్షణ అయింది. ఆ సంగతి నీకు తెలుసా?"

"తెలుసు. కాని సోములును చంపవలసిన అవసరం లేదు మురారికి."

"ఏం?"

"సోములుమీద నేను అసహ్యం పెంచుకున్నాను. మురారికి సోములును చంపి నన్ను స్వాధీనం చేసుకో

కలసినంత అవసరం లేదు—"

"రాత్రి మురారి ఎక్కడ వున్నాడు?"

లక్ష్మి కళ్లు సిగ్గుగా చూశాయి. "ఇక్కడే!"

"మీరు యిద్దరూ కలసి సోములు కొట్టు దగ్గరకు వెళ్ళారు."

"అవును వెళ్ళాం."

"ఎందుకు?"

"సోములు మా యిద్దరినీ విడదీయడానికి కుట్ర పన్నాడు."

"ఎలా?"

"సుందరితో మురారికి సంబంధం వుంది. ఆమెను వంచించి మురారి పారిపోయాడు. ఆ విషయాలు నిరూపించే ఆధారాలూ, సుందరి ఎబార్షన్ చేయించుకున్న ఆసుపత్రి చీటీలూ సోములు సంపాదించాడు."

"వాటివలన మీ ప్రేమకు విఘాతం ఏమిటి?"

"మురారికి యింకా సుందరిమీద కొద్దో గొప్పో అభిమానం వుంది."

"నీమీద ప్రేమా, ఆమెమీద అభిమానమూ..."

"దాంట్లో నాకు తప్పు కనిపించలేదు."

"అవును. సుందరి దగ్గర లక్షలున్నాయి. నీ దగ్గర ప్రేమ వుంది!"

"మిష్టర్ బాండ్...!"

"రాత్రి నువ్వూ మురారీ సోములును కలిశారు. సుందరికి సంబంధించిన చీటీలు యివ్వమని కోరారు. తరువాత..."

"సోములు ఈ రోజు గడువు పెట్టాడు."

"అతడి వద్దకు ఎన్ని గంటలకు వెళ్ళారు నువ్వూ,

మురారీకి?"

"రాత్రి పది అయివుంటుంది."

"సోములు రాత్రి నిద్రమాత్రలు మ్రింగాడు" ఆమె ముఖంలోకి పరిశీలనగా చూశాడు.

"నేను ఆ మాట మురారితో చెప్పాను. మేం వెళ్ళేసరికే అతడు మగతలో వున్నాడు."

"మగతలో వుండే మీతో మాట్లాడాడు. మగతలో వుండే ట్రిబుల్ ఎక్స్ సిగరెట్ పెట్టెమీద నీ పేరూ మురారీ పేరూ రాశాడు."

"సిగరెట్ పెట్టెమీద యిద్దరి పేర్లూ రాశాడా?"

"అవును."

"అంటే సోములు నిద్రమాత్రలు మ్రింగి చనిపోయాడన్నమాట!"

బాండ్ మాట్లాడలేదు. నిద్రమాత్రలతో చనిపోయి వుంటే అతడి చిన్న మెదడు మీద దెబ్బ ఏమిటి?

వాకిట్లో రోల్స్‌రాయిస్ కారు ఆగింది. కారులోంచి సుందరీ, లాక్ దిగారు.

లక్ష్మిని సుందరి ఆప్యాయంగా పలకరించింది.

"లక్ష్మీ! నువు మాకుగానీ క్రయిమ్ బ్రాంచ్ యిన్‌స్పెక్టర్‌కిగానీ చెప్పకుండా పట్నం వదలిపెట్టడానికి లేదు" అన్నాడు బాండ్.

లక్ష్మి అలాగేనన్నట్టు మాతి త్రిప్పింది. బాండ్ కారును సమీపించాడు.

"బాండ్! మన యిద్దరి బుర్ర చెడిపోయింది! త్వరగా సుందరిని పిలువ్!" అన్నాడు లాక్.

"సుందరీ! త్వరగా రా!" అరిచాడు బాండ్.

"బాండ్! డ్రయివింగ్ సీటులో కూర్చో!" లాక్

కళ్ళు మూసుకుని ముందు సీటులో కూర్చున్నాడు. సుందరి వెనక సీటులో కూర్చుంది.

రోల్స్‌రాయిస్ కారును రోడ్డుమీద వురికించాడు బాండ్. కారు మార్చ్యురీ వార్డుముందు ఆగింది. సుందరిని చెయ్యి పట్టుకుని లాక్ మార్చ్యురీ వార్డులోకి పరుగెత్తాడు.

ఐస్ పలకల మధ్య వున్న శవాన్ని చూపించాడు. సోములు శవం తెల్లగా పాలిపోయి వుంది.

"గుర్తుపట్టు సుందరీ! ఇతడే బిచ్చగాడిగా నటించాడు. అవునా?" అన్నాడు లాక్.

సుందరి స్మృతులు పేర్చుకుంటోంది.

"ఇతడే అతడు...!" ఆమె పెదిమలు వణికాయి.

## 6

"సోములు మరణం పెద్ద మిస్టరీ అయిపోయింది" కుమార్ పాలోచనగా డిటెక్టివుల మొహాల్లోకి చూశాడు.

"సోములు నిద్రమాత్రలు ఎందుకు మ్రింగాడు? నిద్ర మాత్రలు అతడే మ్రింగాడా? యెవరయినా మ్రింగించారా? మ్రింగించివుంటే చిన్నమెదడుమీద బలంగా కొట్టడం దేనికి? సోములుకు బాగా పరిచయం వున్న వ్యక్తి లేదా వ్యక్తులు అతడిని హత్య చేసివుంటే ఈ దొంగనోట్ల వ్యవహారం ఏమిటి?" అన్నాడు బాండ్.

లాక్ కళ్ళుమూసుకు వింటున్నాడు.

"సుందరి యింట్లో గాడ్రెజ్ బీరువాలో నోట్లు ఎవరు మార్చారు? ఎవరికి అవకాశం వుంది?" అన్నాడు కుమార్.

మురారిని యింటరాగేట్ చేశారా?" అడిగాడు

బాండ్.

"లేదు. మురారి తండ్రి భద్రయ్యను యింటరాగేట్ చేశాను. మురారి ఈ ఉదయమే పనిమీద కలకత్తా వెళ్ళాడు."

"రాత్రంతా అతడు లక్ష్మితో గడిపాడు. తెల్లవారు తోనే కలకత్తా వెళ్ళాడు. తండ్రే కావాలని అతడిని కలకత్తా పంపివుంటాడు."

"కావచ్చు. అతడు కలకత్తా వెళ్ళినట్టు అతడిమీద అనుమానం వచ్చిన తర్వాత తెలిసింది. మురారిని త్వరగా రప్పించమని భద్రయ్యను హెచ్చరించాను."

"తోటమాలి భార్య సీత ఇతరులతో యెందుకు మాట్లాడటం లేదు?" లాక్ కళ్ళు మూసుకునే అన్నాడు.

"దానికీ యీ సందర్భానికీ సంబంధం ఏమిటి?"

"వుండవచ్చు. గదిలో నేనూ, బాండ్ గాడ్రెజ్ బీరువాను పరిశీలించేటప్పుడు సీత కిటికీ వెనుక ప్రత్యక్ష మయింది. అంటే ఆమె ఆ మాటలు వినాలని ప్రయత్ని స్తోందన్నమాట. భర్తతో తప్ప ఆమె మాట్లాడదట. ఇదేం మూగతనం? మూగాంబిక! సీతనూ తోటమాలినీ వెంటాడాలి. వాళ్ళిద్దరికీ ఏదో రహస్యం తెలుసు!" లాక్ కళ్ళు తెరిచాడు.

"ఆల్ రైట్! పదండి. సుందరి యింటికి వెళ్ళవద్దాం" కుమార్ లేచాడు.

జీపులో ముగ్గురూ సుందరి యింటిముందు దిగారు. సుందరి యింట్లో లేదు. సుందరి అత్తయ్య సైగలతో చెప్పింది.

"తోటమాలి ఎక్కడ?" అడిగాడు కుమార్.

ఆమె అవుట్ హావుస్ వైపు చెయ్యి చూపించింది.

కుమార్, లాక్, బాండ్ అటు నడిచారు.

అవుట్ హౌవుస్ నిశ్శబ్దంగా వుంది. అవుట్ హౌవుస్ తలుపులు దగ్గరకు చేరవేసి వున్నాయి.

కుమార్ తలుపు తోశాడు. తలుపులు సులువుగా లోపలకు తెరుచుకున్నాయి. కుమార్ గదిలోపల ప్రవేశించాడు. గదిలోంచి వంటింట్లోకి దారివుంది. వంటిల్లు అపరిశుభ్రంగా వుంది. యెక్కడ గిన్నెలు అక్కడే వున్నాయి. ఎంగిళ్ళు తీయలేదు.

"సీతా!" పిలిచాడు కుమార్. కాని జవాబులేదు.

వంటిల్లు దాటి పెరట్లోకి వచ్చాడు. అరటి చెట్లమధ్య నిలబడ్డాడు. అరటిచెట్ల చివర పొదలున్నాయి. వాటి ప్రక్కగా నుయ్యి. లాక్, బాండ్, అవుట్ హౌవుస్ లోంచి పెరట్లోకి వచ్చారు.

నూతిచుట్టూ మెత్తటి మట్టి. మట్టి దాటాక నూతి పళ్ళెం. లాక్ మట్టికి యివతల నిలబడ్డాడు.

"పళ్ళెంమీద అడుగుజాడలున్నాయి" అన్నాడు లాక్.

"పళ్ళెం శుభ్రంగా వుంది. అడుగుజాడలు నూతి గోడవైపు వున్నాయి. మట్టి జాడలు అవి తిరిగివచ్చినట్లు లేవు" కుమార్ ఆశ్చర్యంగా పళ్లెం సమీపించాడు.

నూతిలోకి వంగి చూశాడు. నీటిమీద ఎర్రచీర బుడగలాగా తేలుతోంది. జుత్తుపాయలుగా విడిపోయి నీటిమీద పరచుకుంది.

శవం బోర్లాపడివుంది.

కుమార్ హాట్ తీసి చేతితో పట్టుకున్నాడు. లాక్, బాండ్ మొహాలు చూసుకున్నారు. తర్వాత లాక్ కళ్ళు మూసుకున్నాడు.

ఇన్‌స్పెక్టర్ కుమార్ అవుట్ హౌస్‌లోకి పరు గెత్తాడు.

# 7

కుమార్ ప్రశ్నలు వేయడం మొదలు పెట్టాడు. తోటమాలి రాములు ఏడవడం మినహా సమాధానాలు యివ్వడంలేదు. అరగంట గడిచింది. రాములు కొంతవరకూ నిమితపడ్డాడు.

"రాములూ! నీ భార్యను చివరిసారిగా ప్రాణాలతో యెప్పుడు చూశావు?" అడిగాడు కుమార్.

"ఉదయం ఎనిమిది గంటలకు సార్! నాకు అమ్మ గారింట్లోంచి కాఫీ తెచ్చి యిచ్చింది. నేను పనిమీద బయటకు వెళ్ళాను."

"ఆమె ఉదయం నిమితంగా వుందా?"

"వుంది సార్!"

"నువ్వు బయటకు అంటే ఎక్కడికి వెళ్ళావు?"

"తోటలో పాతదానికి హైబ్రీడ్ మొక్కలకోసం సార్!"

"నర్సరీకా?"

"అవును సార్! బెంగుళూర్ నర్సరీ."

"సరిగ్గా ఎనిమిది గంటలకే వెళ్ళావా? బాగా గుర్తుకు తెచ్చుకో."

"అవును సార్! ఎనిమిది గంటలకే!"

కుమార్ రిసీవర్ ఎత్తాడు. టెలిఫోన్ డైరెక్టరీ తిరగ వేసి తర్వాత డయల్ చేశాడు.

"బెంగుళూర్ నర్సరీ .... ఎవరు మాట్లాడుతున్నా రండీ?" అటునుండి వినిపించింది.

"క్రయిమ్ బ్రాంచ్ యిన్‌స్పెక్టర్ కుమార్‌ను మాట్లాడుతున్నాను. ఈ రోజు మీ వద్దకు రాములు అనే అతడు వచ్చాడా?"

"రాములా సార్? ఎవరతడు?"

"సుందరి అని లక్షాధికారిణి. ఆమె యింటి తోట మాలి."

"వచ్చాడు సార్! హైబ్రీడ్ మొక్కలకోసం!"

"థాంక్స్" కుమార్ రిసీవర్ క్రెడిల్ చేశాడు.

"మీ ఆవిడ ఆత్మహత్య చేసుకోవడానికి ప్రత్యేకమైన కారణం వుందా?"

"దానికి నూతిలో దూకాలన్న బుద్ధి ఎందుకు పుట్టిందో నాకేం తెలియదు సార్!"

"మీ యిద్దరికీ మధ్యలో కలతలున్నాయా?"

"లేవు సార్!"

"మీ ఆవిడ పరాయి వాళ్ళతో మాట్లాడదట. కారణం ఏమిటి?"

"దానికి ఎవరితో ఏం మాట్లాడుతుందో తెలియదు సార్!"

కుమార్ తలపంకించసాగాడు. బాండ్ వైపూ లాక్ వైపూ మార్చి మార్చి చూశాడు. లాక్ మోచేత్తో బాండ్‌ను పొడిచి, "రాములు చేతులు మచ్చలు పడ్డాయి" అన్నాడు. పైకి మాత్రం లాక్ అన్నాడు. "పోస్టు మార్టం రిపోర్ట్ రావాలి కదా!"

రాములు తనను కానట్టు చూశాడు.

రాములు చేతులమీద పొడలు పొడలుగా మచ్చలున్నాయి.

# 8

కారు బెంగుళూర్ నర్సరీముందాగింది.

"రాములును గురించి వర్ణించగలరా?" అడిగాడు లాక్.

"పొడవుగా వుంటాడు గూడకట్టు పంచె...." నర్సరీ యజమాని చెప్పాడు.

లాక్ పళ్ళు గిట్ట కరిచాడు. రాములు పొట్టిగా వుంటాడు. లుంగీ పంచె కట్టుకుని పైకి మడత మడుస్తాడు.

"తలకు పాగా చుట్టుకున్నాడా?"

"అవును సార్!"

లాక్ తలూపి అతడికి కృతజ్ఞతలు చెప్పి బయట పడ్డాడు. రోల్స్‌రాయిస్ కారు పోలీస్ స్టేషన్ ముందాగింది.

కుమార్ వాళ్ళను నవ్వుతూ చూశాడు.

"నిద్రమాత్రల పొట్లంమీది వ్రేలిముద్రలు సీతవే! ఆమె గ్లాసులో మాత్రలు కలిపి త్రాగింది. ఆమె వ్రేలి ముద్రలు గాజు గ్లాసుమీద వున్నాయి."

"ఇన్‌స్పెక్టర్ గారూ! నిద్రమాతలు మ్రింగాక సీత తనకుతానే నూతిలో దూకిందా?" అడిగాడు లాక్.

"ఊపిరితిత్తులలో నీరు చేరలేదు. అంటే నూతిలోకి పడేసరికే ఆమెలో ప్రాణంలేదు."

"నిద్రమాత్రలతోచే ప్రాణంపోయింది. తరువాత ఆమెను నూతిలో పారవేశారన్నమాట!"

"నిద్రమాత్రల పొట్లంమీద ఆమె వ్రేలిముద్రలూ, నూతి పళ్ళెంమీద ఆమె పాదాల ముద్రలూ అచ్చు ఒత్తారు."

"తోటమాలి రాములుకు అంత తెలివితేటలు

న్నారా?"

"బెంగుళూర్ నర్సరీకి రాములుకు బదులుగా వెళ్ళిన వ్యక్తి అతడికి యీ తెలివితేటలు నుప్పివుంటాడు. ఆ వ్యక్తికోసం గాలించనక్కరలేదు. రాములును పట్టుకుని నాలుగు వుతికితే చాలు!"

గుమ్మం దగ్గర అలికిడయింది. శాల్యూట్ కొట్టి సార్జెంట్ లోపలకు వచ్చాడు.

బాండ్, లాక్ బయటకు నడిచారు.

"మారు తాళం చెవుల గుత్తి సిద్ధంగా వుంది" అన్నాడు లాక్.

"ఇంట్లో అతడి భార్య వుంటుందేమో!" అన్నాడు బాండ్.

"వుండవచ్చు. లేదా ఫోన్ చేసి ఆమెను సుందరి యింటికి రప్పించవచ్చును."

బాండ్ పబ్లిక్ టెలిఫోన్ బూత్‌లో ప్రవేశించాడు. రెండు నిమిషాల తర్వాత బూత్ నుండి బయటపడ్డాడు.

"ఆమె బయలుదేరుతుంది. సుందరి యింటికే!" అన్నాడు.

"గుడ్ ...." లాక్ కారును వురికించాడు.

గేటుముందు ఆగింది కారు. లాక్, బాండ్ కారు దిగారు. వేగంగా గేటుదాటి తలుపుముందు నిలబడ్డారు.

"చాలా తొందరగా బయలుదేరింది. సుందరికి ప్రమాదం అనే చెప్పి వుంటావు" మారు తాళాలగుత్తి బయటకు తీశాడు లాక్. క్షణాలలో తలుపు తెరచుకుంది.

ఇద్దరూ లోపలకు నడిచారు. మెయిన్ హాలుకి అటు యిటూ గదులు వున్నాయి. ఇద్దరూ రెండు ప్రక్కలా వెతకసాగారు. అయిదు నిమిషాల తర్వాత ఇద్దరూ తింగి

మెయిన్ హాలులో కలుసుకున్నారు.

"బాంక్ అక్కౌంట్ పుస్తకం దొరికింది. అమవుంట్ సరిపోయింది" అన్నాడు బాండ్.

"రైట్!" లాక్ ముందుకు నడిచాడు. మెట్లు పైకి వెళ్తున్నాయి. మెట్ల ప్రక్కగా నడవా దారితీస్తోంది. అక్కడ గోడతో నడవా అంతమయింది.

"లాక్! నువు అన్నమాట నిజమే! రాములు చేతులు కెమికల్స్ వాడినందువల్లనే మచ్చలుపడ్డాయి. అతడికి కెమికల్స్‌తో పని ఏమిటి?"

"అవును...బాండ్! రాములు బదులుగా మురారి బెంగుళూర్ నర్సరీకి వెళ్ళాడు. అంటే రాములుకు ఎలిబీ యిచ్చాడు. రాములు ఆ సమయంలో సీతను చంపాడు."

లాక్ గోడను సమీపించాడు. గోడ తడిమాడు. బాండ్ గోడలకున్న కాలెండర్లు తప్పించాడు. గోడ రంగులో కలిసిపోయిన స్విచ్ కనిపించింది. బాండ్ స్విచ్ నొక్కాడు.

గోడలో కొంత భాగం అడ్డం తప్పుకుంది. మనిషి పట్టేటంత భాగం. లాక్ గోడలోంచి లోపలకు నడిచాడు. బాండ్ అతడిని అనుసరించాడు. గోడ వెనుక పెద్ద హాలు వుంది. హాలులో రకరకాల యంత్ర సామగ్రీ. బల్లలమీద పాత్రలూ వాటిలో రంగుల మిశ్రమాలూ వున్నాయి. లాక్ వాటిని దాటాడు. రాక్‌లో వరుసగా అమర్చిన బ్లాకులూ, వాటికి అవతల సమతూకంలో కత్తిరించివున్న తెల్లని విదేశీ కాగితమూ వున్నాయి. కాగితాల కట్ట లోంచి ఒక కట్ట ఎత్తాడు బాండ్.

"వంద రూపాయిల నోటు ముద్రించే కాగితాలు!"

అన్నాడు బాండ్.

లాక్ తలూపి ఫోటోలు తీయసాగాడు.

## 9

డిటెక్టివ్ బాండ్ హాస్తవానికి రాములు బెంబేలెత్తిపోయాడు.

"రాములూ! నువు సీతను హత్య చేశావు. నీ చేతులతోనే ఆమెకు నిద్రమాత్రలు యిచ్చావు. తరువాత ఆమెను నీటిలో గిరవాటు వేశావు. నూతి పళ్ళెంమీద ఆమె పాదం ముద్రలు అచ్చువేశావు. నిద్రమాత్రల పొట్లంమీద, గాజు గ్లాసుమీద ఆమె వ్రేలిముద్రలు వేశావు" లాక్ అతడి మెడ పట్టుకున్నాడు.

బాండ్ అతడి నోటివద్ద మైక్ పెట్టాడు. టేప్ రికార్డర్‌ను చేతిలో పట్టుకున్నాడు. రాములు బిగుసుకుపోయాడు. "అవును బాబూ! నా సీతను నేనే చంపుకున్నాను. నాది తప్పే బాబూ" అన్నాడు.

"సోములును ఎవరు చంపారు?" అడిగాడు లాక్.

"నేను కాదు!"

లాక్ అతడిని యీడ్చిపెట్టి తన్నాడు. రాములు బోర్లగిలపడి కిటికీ దగ్గర ఆగాడు. పెదిములూ, మోచేతులూ చురచురమంటున్నాయి. బాండ్ అతడిని లేవనెత్తాడు. మైక్ అతడి నోటిముందు పెట్టాడు.

రాములు మాట్లాడబోయాడు. కిటికీ అవతల ఎవరో కదిలారు. బాండ్ చటుక్కున రాములును యివతలకు లాగబోయాడు. అప్పటికే కిటికీ చువ్వల మధ్య పిస్తోలు ప్రత్యక్షమయింది. పిస్తోలూ పిస్తోలును పట్టుకున్న చెయ్యి మాత్రమే కనిపిస్తోన్నాయి. ఆ వ్యక్తి కిటికీ చాటున

నిలబడ్డాడు. లాక్ పిల్లిలాగా కదిలాడు.

ట్రిగ్గర్ మీద అతడి వ్రేలు బిగుసుకుంటోంది.

రాములును ప్రక్కకు లాగాడు బాండ్. అదే క్షణంలో పిస్తోలు ప్రేలింది. మరుక్షణంలో అతడి చెయ్యి కిటికీ వూచల మధ్యకు జారింది. పిస్తోలు పట్టుకున్నవాడి తల చువ్వలకు తాకింది. అతడు వెనక్కి తిరగబోయాడు. లాక్ అతడి వెనుక నిలబడి మరల తన్నాడు.

బాండ్‌కి పిస్తోలు పట్టుకున్న చెయ్యి అందింది. చెట్టు కొమ్మను వెనక్కి వంచినట్టు చేతిని వంచి బలంగా వెనక్కి విరిచాడు.

లాక్ అతడి తల పట్టుకుని వంచి బలంగా డొక్కలో తన్నాడు. మురారి వెల్లకిలా పడ్డాడు. పడినవాడు మెలక తిరిగాడు. బోర్లగిల మూడంకె వేసి అలాగే వుండి పోయాడు.

"మురారీ! నువు సోములును ఎందుకు చంపావు?" లాక్ అతడిని మరల ఫెడీమని తన్నాడు.

మురారి భళ్ళున వాంతి చేసుకున్నాడు. నేలమీద రక్తం కెరడుపడింది. పెదిములు తుడుచుకుని, "వాడు సుందరికి మామీద అసహ్యం పుట్టించాలని చూశాడు. నేను దొంగనోట్లు ముద్రణలో సతమతమవుతోన్నాను. తోటమాలి రాములు నాకు సహాయకారి. రాములును కూడా తన గుప్పెట్లోకి తీసుకుని ఆడించాలనుకున్నాడు. సుందరి యింట్లో నా అనుమతి లేకుండా దొంగనోట్ల కట్టలు వుంచి అసలు నోట్లు ఎత్తుకుపోయాడు. అతడిని వదిలిపెట్టడం నాకు చేతకాలేదు. లక్ష్మి సహాయంతో చంపేశాను. అని చూసిన సీత బెదిరిపోయింది. రాములు

చేత ఆమెను చంపించాను" అన్నాడు.

పోర్టికోలో పోలీస్ జీపు ఆగింది. జీపులో లక్ష్మి వుంది. ఆమెకు తోడుగా మురారి, రాములూ జీపులో కూర్చున్నారు.

జీపు కదిలింది.

"పద! బాండ్! సుందరికి విషయం చెప్పి, మన పీజు వసూలు చేసుకుందాం!" అన్నాడు లాక్ కళ్ళుమూసుకుని.

బాండ్ అతడి కనురెప్పలు పట్టుకు లాగాడు. లాక్ నిశ్చలంగా కళ్ళు మూసుకునే వున్నాడు.

—:ఐ పో యిం ది:—

సీరియల్

# విషసర్పాల సికిందర్

(గత సంచిక తరువాయి)

"ఫ్లాప్ అయిందని నాకు తెలుసు. ఇప్పుడేం చేస్తున్నారు?"

"ఆ స్కూటర్ని ఫాలో కాలేకపోయాం, బాస్. కొంతదూరంలోనే మిస్ అయిపోయింది. మీకేదైనా మెసేజ్ అందిందేమోనని...."

"ఆ స్కూటర్ నెంబర్ 6878 **A P T.** ముందు మీ కారుదనుకున్నారు వాళ్ళు. ఇప్పుడు రెండిట్లో దేనిదైనా కావచ్చని అనుకుంటున్నారు. బెదిరి చావకండి, మిమ్మల్నెవరూ పట్టుకోలేరు. మీరా స్కూటర్ని ఎలాగైనా పట్టుకోండి. ఆమెని క్యాచ్ చేయండి. లేకపోతే శంభూ, నిన్ను యాసిడ్లో పడేస్తాను...."

శంభూనాథ్ ఆందోళనగా ఫోన్ పెట్టేశాడు.

అతనికి కొంచెం దూరంలోనే టెలిగ్రాఫ్ కౌంటర్లో యువర్ బ్రదర్ డైడ్, స్టార్ట్ ఇమ్మీడియట్లీ—అని బుక్ చేసి ఒకోడాకి, విషాదంగా కదిలాడక్కడ్నుంచి ఇరవై ఏళ్ళ ముఖేష్.

అతను తల వంచుకుని చకచకా బయటికొచ్చేసి, ఎడమపక్క గేటు కేసి అడుగులేయసాగాడు.

అక్కడే శంభూనాథ్ కోసం కారులో తన దండులో ఎదురు చూస్తున్న జింబో ఉలిక్కిపడి, "హో.... ఈ ముఖేష్ ఇక్కడేం చేస్తున్నాడు?" అన్నాడాశ్చర్యంగా.

సరిగ్గా అప్పుడే ముఖేష్ అతన్ని చూశాడు, కారుని చూశాడు, కారులో మిగిలినవాళ్ళనీ చూశాడు, అతడి ముఖంలో రక్తం వేగంగా ప్రసరించింది. స్తబ్ధుడయి పోయాడు.

"ముఖేష్ ఎవరు?" అడిగాడొకడు.

"ఆ దారూవాలా బార్‌లో నౌకరు!" తేరుకుంటూ అన్నాడు జింబో. "అదిగో నన్ను చూశాడు....గుర్తు పట్టాడు.... వెళ్ళిపోతున్నాడు!"

ముఖేష్ గేటులోంచి భయపడి, నిలువునా వణికి పోతూ గబగబా వెళ్ళిపోతున్నాడు. వెళ్తూ అతను మళ్ళీ వెనక్కి తిరిగిచూశాడు. కారలాగే వుంది. అతను నెంబర్ ప్లేట్‌ని చూసి వేగంగా జనంలో కలిసి వెళ్ళిపో సాగాడు.

అప్పుడే శంభూనాథ్ బయటికొస్తున్నాడు.

"హేయ్....కమాన్!" అరిచాడు జింబో చేత్తో పిలుస్తూ.

శంభూనాథ్ వురికి వచ్చి కారెక్కాడు, "ఏమిటి? ఏం జరిగింది?"

"కొంప మునిగింది!"

"ఏం జరిగింది?"

"ఆ దారువాలా నౌకరు మనల్ని చూశాడు!"

"ఎక్కడ?"

"అదిగో వెనక్కి వెళ్ళిపోతున్నాడు...." డ్రైవర్ని చూశాడు జింబో, "సులేమాన్! డ్రైవ్ ఫాస్టు! హిట్

హింసా!"

సులేమాన్ స్టార్టు చేసి వెనక్కి తిప్పాడు కారుని. వేగం పెంచి దూకించాడు రామకృష్ణ థియేటర్ల వైపు.

అది చూసి ముఖేష్ పరుగు ప్రారంభించాడు.

థియేటర్ గేటులోంకి దూరిపోయి, అవతలి గేటు దగ్గరికి వురకసాగాడు.

సులేమాన్ వేగంగా కారుని గేటులోంకి తిప్ప బోయాడు—

"యూ ఆర్ ఫూల్!" అరిచాడు శంభునాథ్, అతన్ని వారిస్తూ, "ఏం చేస్తున్నావ్ నువ్వు తెలుసా! వాడికి డాష్ ఇస్తే మన నెంబర్ చూస్తారెవరైనా— దొరికిపోతాం! వదిలెయ్ వాణ్ని—"

సులేమాన్ ఆపేస్తూ, "అయితే మనమీ కారొది లేయాలిప్పుడు....!" అన్నాడు.

"అవసరంలేదు. వీడు ప్రాణభయంతో వున్నాడు. వాడి సేట్ కి ఎందుకు జరిగిందో బాగా తెలుసు వాడికి. నెంబర్ల జోలికి పోడు. తిప్పు కారు!"

"ఎక్కడికి?" జింబో అడిగాడు.

శంభూనాథ్ అరిచాడు, "సుహాసిని ఇంటికి!"

"అక్కడికా!"

"అవును, ఇప్పటికే ఆలస్యమయి వుండొచ్చు, పోనివ్వు త్వరగా!"

జింబో అయోమయంగా చూశాడు కారు దూసుకు పోతూంటే.

అవతలి గేటులోంచి సందులోపడ్డ ముఖేష్, జి.పి.ఓ. కేసి వురికి, అప్పుడే వస్తూన్న చార్మినార్ బస్సెక్కేశాడు.

జాన్ అక్కడ కాస్తాపి దిగాడు—

డ్రింక్ మోర్ బార్ తలుపు మూసి వుంది.

తలుపుమీద కొట్టి, కొన్ని క్షణాలు యెదురుచూశాక, తలుపు తీసి చూశాడు కిషోర్. అతను జాన్‌ని చూసి చటుక్కున పక్కకి తొలిగాడు, "రండి, సాబ్" అంటూ.

జాన్ లోపలికెళ్ళాడు.

"సాబ్, డ్రింక్ తీసుకుంటారా?"

"ఇవ్వు, కిషోర్ ...." అలసటగా అన్నాడు జాన్, టేబిలుముందు కూర్చుంటూ.

లోపలంతా నిశ్శబ్దంగా వుంది.

కిషోర్ రెండు నిమిషాల్లో తిరిగి వచ్చాడు, ట్రేలో గ్లాసుతో వెనుక రఫీ వచ్చాడు.

డ్రింక్ తీసుకుంటూ జాన్, "ముఖేష్ ఏడీ?" అనడిగాడు.

"పోస్టాఫీసుకెళ్ళాడు సాబ్, టెలిగ్రాం ఇవ్వడానికి" చెప్పాడు రఫీ.

జాన్ అతన్ని చూశాడు. "ఓహో, మీ సేట్ గురించి నాకూ బాధగా వుంది. చాలా తోడ్పడ్డాడు పోలీసులకి...రఫీ ఉదయం వచ్చినప్పుడు నేనొక విషయం అడగడం మర్చిపోయాను."

"ఏమిటి సాబ్?"

"ఇక్కడికొచ్చే కష్టమర్లందరూ మీకు తెలుసా?"

రఫీ, కిషోర్‌లు మొహాలు చూసుకున్నారు.

"కొంతమంది తెలుసు, సాబ్" ఇద్దరూ చెప్పారు.

"వాళ్ళలో అనుమానించదగ్గ వాళ్ళున్నారా?"

"తెలియదు, సాబ్. చెప్పడం కష్టం."

"రాత్రి మీరెప్పటివరకున్నారు?"

"పదకొండు వరకే, సాబ్."

"ఇక్కడికెవరైనా బ్లాక్ అంబాసిడర్‌లో రావడం చూశారా ఎప్పుడైనా?"

"లేదు సాబ్, చూడలేదు."

"APT 6878."

"లేదు సాబ్, చూడలేదు."

"మీ సేట్ డైరీలాంటిది వుంచుకుంటాడా?"

"లేదు సాబ్, అన్నీ జ్ఞాపకం వుంచుకుంటాడు."

జాన్ నీరసంగా చూశాడు, తాగడం పూర్తిచేస్తూ, "వెల్, బ్లూ కలర్ మెటాడార్ వ్యాను ఎప్పుడైనా ఇక్కడికొచ్చిందా?"

"లేదు సాబ్, ఎప్పుడూ రాలేదు."

"రఫీ, కిషోర్, మీరు భయపడవల్సిన అవసరంలేదు. వివరాలు చెప్తే మీకే ప్రమాదం రాదు."

"భయపడడం లేదు, సాబ్. మీకు సహాయపడాలనే అనుకుంటున్నాం."

"సరే, అలాటి వెహికల్స్‌తో ఎవరైనా వస్తే వెంటనే మీరు పోలీసులకి ఫోన్ చేయాలి, తెలిసిందా?"

"అలాగే చేస్తాం, సాబ్."

ఫోన్ మోగిందొక్కసారి.

కిషోర్ వెళ్ళి ఎత్తాడు.

జాన్ అతన్ని చూస్తూ కూర్చున్నాడు. అతను మాట్లాడి, ఏదో విని, కళ్ళు పెద్దవి చేశాడు. "అరె, ముఖేష్ భాయ్, అలాగా! ఎక్కడ?...ఎప్పుడు? అలాగే అలాగే.... చెప్తాను, వెంటనే చెప్పేస్తాను....నువ్వక్కడే వుండు! ఎక్కడికీ వెళ్ళకు...."

అగ్రనింకేదో మాట్లాడి ఫోన్ పెట్టేసి, వురికి వచ్చాడు జాన్ దగ్గరికి. "సాబ్, తెలిసింది! ఆ కారెవరిదో తెలిసింది! అందులో ఒకడ్ని గుర్తుపట్టాడట ముఖేష్—ఆ కారు నెంబర్ కూడా చూశాడట!"

"ఎక్కడున్నాడిప్పుడు?"

"అఫ్జల్‌గంజ్ బస్ స్టేషన్ నుంచి ఫోన్ చేశాడు, సాబ్! అక్కడే వున్నాడు! వాళ్ళు చంపడానికి వెంటపడ్డారట! తప్పించుకుని పారిపోయాడట!" అని ముఖేష్ ఫోనులో చెప్పిన వివరాలు జాన్‌కు చెప్పాడు.

జాన్ విసురుగా వెళ్ళి ఫోనెత్తాడు. ఒక నెంబర్ తిప్పి, "కంట్రోల్ రూం—" అన్నాడు ఆతృతగా.

* * *

శంకర్ తిరిగి కారు దగ్గరకొచ్చి, "ఇంట్లో ఎవరూ లేరు, తాళంతీసి వచ్చాను...." అన్నాడు గబగబా.

వెంటనే శంభూనాథ్ కారుదిగి, జింబోతో వేగంగా కదిలాడా ఇంటివైపు. ఇద్దరూ గేటులోంచి లోపలికి నడిచి, మెట్లెక్కి వరండా చేరుకొని, తీసివున్న హాలు తలుపులోంచి లోపలికెళ్ళిపోయారు.

జింబో వెంటనే తలుపు మూశాడు.

శంభూనాథ్ వాచీ చూసుకుని, ఇంట్లో చుట్టూ చూసి, వెళ్ళి సోఫాలో కూర్చున్నాడు. మళ్ళీ అసహనంగా లేచి, వాచీ చూసుకుని, అటూ ఇటూ పచార్లు చేయసాగాడు, చేతులు వెనుక కట్టుకొని.

జింబో చిత్రంగా చూడసాగాడు అతన్ని. ఫోను మోగింది ఒక్కసారి.

శంభూ వెళ్ళి రిసీవర్ జాగ్రత్తగా ఎత్తి చెవి దగ్గర పెట్టుకుంటూ, మాట్లాడవద్దని చేత్తో సూచించాడు

జింబోకి.

"హలో .... సతీష్?" అంది అవతలి నుంచి ఒక గొంతు.

శంభూనాథ్ వెంటనే పలికాడు, "నేను సతీష్ నే!"

"ఎవరూ?"

"నరేన్ కుమార్ని. నేను మీకు తెలియదు. మీ చెల్లెల్ని ఇందాక రక్షించుకొచ్చాను.... మీరేం భయపడకండి. ఆమె ఇక్కడ క్షేమంగానే వుంది.. ."

"ఎక్కడ?"

"డిఫెన్స్ అకాడెమీ దగ్గర హనుమాన్ టెంపుల్ వుంది తెలుసా? అక్కడున్నాం. ఆ ముఠాని వదిలించుకున్నాం! ఇప్పుడే ప్రమాదం లేదు! మీరు వెంటనే బయల్దేరి వస్తారా....ఏం చేయాలో ఆలోచిద్దాం...."

శంభూనాథ్ మిశ్చీవస్ గా నవ్వుకుంటూ ఫోన్ పెట్టేశాడు.

జింబో నోరు తెరచుకుని చూస్తున్నాడు.

"ఎలా మార్చాను గొంతు?" అన్నాడు శంభూనాథ్ భుజాలెగరేస్తూ.

"యూ ఆర్ జీనియస్!....హై — హయ్యా! హై — హయ్యా! జయమ్ము నిశ్చయమ్మురా, భయమ్ము లేదురా.." డాన్స్ చేయపొగాడు జింబో.

"ఆగు!" అన్నాడు శంభూనాథ్ మళ్ళీ ఫోనెత్తుతూ.

"బాస్, ఎనీ మెసేజ్?" అన్నాడు రెస్పాన్స్ రాగానే.

"బ్రూటస్, మీ కారు నెంబర్ ఎలా తెలిసిపోయింది వాళ్ళకి?"

శంభూ అదిరిపడ్డాడు. "బాస్ ....ఏమంటున్నారూ?"

మళ్ళీ అదే అరుపు అవతలనుంచి.

"ఎలా—ఎలా తెలిసింది, బాస్?"

"నాకేం తెలుసు? నన్నడక్కు! వచ్చి చెప్పు ఎలా జరిగిందో! వాళ్ళకి చిక్కి ఏదైనా చెప్పారంటే చంపేస్తాను!

శంభూనాథ్‌కి చెమటలు పట్టేస్తున్నాయి. "లేదు బాస్, చిక్కము! కారుని వదిలేస్తాం! గుడ్ న్యూస్ బాస్...."

"ఏమిటి?"

"ఆమె ఎక్కడుందో తెలిసింది!"

"నిజం చెప్తున్నావా?"

"నిజం, బాస్, అక్కడికే పోతున్నాం! బస్సెక్కి పోతాం...."

"విష్‌యూ గుడ్ లక్. ఆమెని తీసుకు రండి."

"థాంక్యూ, బాస్!" ఫోన్ పెట్టేసి చెమటలు తుడుచుకున్నాడు శంభూనాథ్.

అతను జింబోకి సైగ చేసి, పరుగుతీశాడు బయటికి.

• • •

"ఇప్పుడు మనకేం కాదు, సతీష్ వొచ్చేస్తున్నాడు.." అన్నాడు నరేన్ కుమార్.

సుహాసిని తల వంచుకుని నేల చూపులు చూస్తోంది.

న్యూక్టరాపి ఆ గుడి మెట్లమీద కూర్చునివున్నా రిద్దరూ, రోడ్డుమీద వచ్చేపోయే మిలిటరీ వాహనాల్ని చూస్తూ.

నరేన్ మనసు ఇప్పుడు ఎటెటో తేలిపోతోంది....

సుహాసిని అలా తలవంచుకునే కూర్చుని వుంది శిలలా. ఆమెను మాట్లాడించాలని, నవ్వించాలని విశ్వప్రయత్నమూ

చేసి నరేన్, లాభంలేక ఆమెనే గమనిస్తూ కూర్చు న్నాడు మౌనంగా.

ఆమెని తీసుకుని బయల్దేరినప్పట్నించీ ఆమె ఒక్క మాట పలకలేదు—ఇందాక తమ ఇంటి ఫోన్ నెంబర్ తప్ప. అదీ ఎంతో బలవంతంమీద.

"సుహాసినీ, నన్నింకా నిరసిస్తున్నావా?" అడిగేడతను కాస్సేపటికి, ఆమెనలాగే సూటిగా చూస్తూ.

ఆమె అలాగే వుంది, తలెత్తలేదు.

"ఇలా చూడు..నా కళ్ళలోకి. నీ కళ్ళలో ఏముందో చూడనీ. ఓహ్, నన్నిలా చంపకు సుహాసినీ! చిత్రవధ చేయకు..."

అప్పుడామె చివాల్న తలెత్తి అతని కళ్ళలో కళ్ళు పెట్టి కణకణలాడే చూపులు చూసింది.

నరేన్ బెదిరిపోయాడు. అప్రయత్నంగా దూరంగా జరిగాలు.

"ఓ గాడ్! నన్ను ద్వేషించకు, సుహాసినీ! చచ్చి పోతాను—"

ఆమె చటుక్కున ముఖం తిప్పుకుని రోడ్డుమీదా, చెట్లనీ తీక్షణంగా చూడసాగింది. ఆమె గుండెలు ఎగ సెగసి పడుతున్నాయి. ముక్కు పుటాలు అదురు తున్నాయి. పెదవులు వణుకుతున్నాయి....ముఖ కండ రాలు బిగుసుకుంటున్నాయి.

గాభరాపడ్డాడు నరేన్—దుఃఖం కట్టలు తెంచుకో బోతోందా? కోపాన్ని ప్రజ్వరిల్లబోతోందా?

"తలూపు, నామీద కోపంలేదని తలూపు. సుహాసినీ, ప్లీజ్, ఒక్కమాట మాట్లాడు.... నేను నీవాడ్నేనని చెప్పు....నీ గుండెలో చోటుందని....ఇప్పుడైనా..."

సుహాసిని చటుక్కున తల పైకెత్తి చూడసాగింది, కదులుతున్న మబ్బుల్ని. అవి మళ్ళీ వర్షం కురిపించేటట్లున్నాయి..ఆమె కళ్ళు వర్షించేటట్లు లేవు. అవి శుష్కించి వున్నాయి.

అతడి ముఖం ఎరుపెక్కింది. పిడికిలితో రాతిమీద కొట్టాడు. ఓహ్, డామిట్! ఏం చేస్తున్నాడు తను? ఎందుకిలా పిచ్చిగా ప్రవర్తిస్తున్నాడు? ఇప్పుడామెకి చెప్పాల్సినమాటలా అవి? ఆమె పరిస్థితి ఏమిటి? ఆమె ఆలోచనలేమిటి? బ్లడీఫూల్ని. డర్టీ ఫెలోని, ఇంత సిల్లీగా ప్రవర్తించడమా తను?

టేకిటీజీ మనసా, టేకిటీజీ.

మరి కొంచెం ఓపిక, సహనం. ఆమెకు కొంత సమయమివ్వు. ఆమె అట్టర్ కన్ఫ్యూజన్లో వుందిప్పుడు.... ఆలోచించుకోనీ. అప్పటి ఆవేశం చూపలేదుగా? ఈ మౌనం అంగీకారంగానే .... పోనీ అర్ధాంగీకారంగానే తీసుకో. ఆమె నీదే....తప్పక నీదే అవుతుంది....కుదుటపడు!

తేరుకుంటూ అతను ఆమెవైపు ఓ చూపు విసిరాడు.

ఆమె మనిషేనా అనిపించిందతనికి...

ఆ సమయంలోనే ఆ గుడి వెనుకకు చేరుకున్నారు వాళ్ళు ఆరుగురూ.

ఆ కంటోన్మెంట్ ప్రాంతం నిర్మానుష్యంగానే వుంటుందెప్పుడూ, అప్పుడొకటీ అప్పుడొకటీ వెహికల్స్ వెళ్తూ. ఆ చుట్టుపక్కల చాలావరకు బయట ప్రదేశాలే, మైదానాలు.

శంభూనాథ్ అనుచరులకి ఆదేశాలిస్తున్నాడు! మీరు ముగ్గురూ - జింబో, సులేమాన్, శంకర్ - ముందు

కళ్ళండి. జాగ్రత్త! వాడి దగ్గర రివాల్వర్ వుంది - స్టీవెన్స్ దగ్గర లాక్కొని చంపింది. వెళ్ళండి, క్షణంలో జరిగిపోవాలి!"

"ఓ. కే!" వాళ్ళు ముగ్గురు కదిలారు.

శంభూనాథ్ మిగిలిన ఇద్దరివైపు తిరిగాడు. "సుభాష్, సంతోష్—మీరిద్దరూ వెళ్ళి ఏదైనా జీపు నాపండి. వాళ్ళొచ్చేలోపు తీసుకొచ్చేయాలి!"

"ఓ. కే!" వాళ్ళు కూడా కదిలారు.

మొదటి జట్టు గుడిముందుకి, రెండో జట్టు దూరంగా రోడ్డుమీదికి.

రోడ్డుమీద దూరంగా వస్తూ కన్పించిన ఒక టోంగా జీపును చూసి, విసురుగా కదిలారు. సుభాష్, సంతోష్‌లు రోడ్డు మధ్యకి—చేతులు జేబుల్లో పెట్టుకొని.

ఆ జీపులో ఇద్దరు ఆర్మీ ఆఫీసర్లు నవ్వుకుంటూ, కులాసాగా కబుర్లతో తమ నివాసానికి సాగిపోతున్నారు....

అది సమీపిస్తూంటే సుభాష్, సంతోష్‌లు ఇంకా దగ్గరయ్యారు. మరి కొంతదూరముందనగా, అది వేగం తగ్గిపోతూ నెమ్మదిగా వచ్చి ఆగింది, రోడ్డు మధ్య చేతులూపుతున్న వాళ్ళముందు.

అంతే, అప్పుడు వాళ్ళు మెరుపు వేగంతో జీపు చెరోవైపుకు కదిలారు .... ఇక్కడ సుహాసిని ఉలిక్కిపడి లేచింది నరేన్ ముఖంలో భయాందోళనల్ని చూసి. క్షణంలో అతని శరీరంలో నాలుగుచోట్ల రంధ్రాలు ఏర్పడి రక్తం చిమ్మడం చూసింది. విరుచుకుపడిపోతూనే, అప్పుడతని చేతిలో ప్రత్యక్షమైన రివాల్వర్‌తో తన వెనుక ఇద్దరు నేలకూలడం చూసింది....

సుహాసిని అతన్ని ఒళ్ళోకి లాక్కుంటూ, "ఓహ్...."

నరేన్ ....నువ్వెందుకొచ్చావూ...అసలు..." అని మాత్రం అనగలిగిందామె.

వెనుకనుంచి రెండు చేతులు ఆమెని అమాంతంగా లేపుకుపోయాయి. ఆమె నరేన్‌ని వదిలేసింది. అతడామెని గుడి వెనక్కి ఎత్తుకుపోతున్నాడు శరవేగంగా....

చూపులకు అందినంతవరకు ఆమె కళ్ళు చూశాయి చురకత్తుల్లా మెరుస్తూ నరేన్‌ని, అతడి అంతాన్ని. 'నన్ను ద్వేషించకు సుహాసినీ...' అతని అంతిమ కోర్కెని...

ఆర్మీ ఆఫీసర్ల శవాల్ని పొదల్లోకి ఈడ్చేసి జీపెక్కారు సుభాష్, సంతోష్‌లు. రోడ్డు దిగి వేగంగా గుడి వెనుకకు డ్రైవ్ చేసుకొచ్చారు. శంభూనాథ్, జింబోలు, స్పృహలేని సుహాసిని దేహాన్ని జీపులో పడేసి, ఛడాలున ఎక్కి కూర్చున్నారు.

జీపు స్టార్టయి జువ్వలా దూసుకుపోసాగింది...

* * *

సరిగ్గా గంట తర్వాత ఆ కారు—బ్లాక్ అంబాసిడర్ APL 4698 సుహాసిని ఇంటి ప్రాంతాల కనుగొనబడింది.

వెంటనే రిజిస్ట్రేషన్ చెకింగ్ జరిగింది. కానీ ఆ నెంబరుగల కారు ఎవరికీ లేదు. అవి ఫేక్ నెంబర్లు. జాన్‌ని నిరాశ ఆవరించింది.

ఆ తర్వాత కాస్సేపటికి డిఫెన్స్ అకాడమీ దగ్గర హనుమాన్ టెంపుల్ ముందు శవాల రిపోర్టందింది.

శవాల్ని గుర్తించగానే సుహాసిని గురించి ఆందోళన మరింత ఎక్కువైంది పోలీసు వర్గాల్లో.

అప్పుడు అక్కడే పొదల చాటున మరి రెండు శవాలు గొడ్ల కాపరి రిపోర్టు చేయగానే మొత్తం కన్టోన్మెంటులో సంచలనం రేగింది. ఆర్మీ ఆఫీసర్ల హత్యలు

ఇట్టే పరిస్థితిని బోధపర్చాయి.

క్షణాలమీద వాళ్లు ప్రయాణించిన వెహికల్ నెంబర్ ప్రతి పోలీస్ స్టేషన్ కీ ట్రాన్స్‌మిట్ చేయబడింది. మొత్తం డిపార్టుమెంట్ లక్ష్యం ఆ జీపే అయింది. కానీ దాని అయిపు వాళ్ళెంత ప్రయత్నించినప్పటికీ లేదు—

"వెల్, వాళ్ళ స్థావరం మనకు తెలియదు. ఆ వెహికల్ అక్కడికే చేరివుంటుంది, సుహాసినితో సహా!" అనుకున్నాడు జాన్, నిస్పృహతో.

•　•　•

పదిహేడు గంటలు.

అంటే దాదాపు ముప్పావురోజు.

ఇలాటి వాతావరణం మధ్య ఇన్ని గంటలు—ఏకాంతంగా గడపడం మాటలు కాదు. అందులోనూ బందీయై బయటి సంబంధాలు మృగ్యమై, గాలీ వెలుతురు చొరని బందీకానలో.

దుర్భరం!

కసురుకున్నాడు లాల్.

కసురుకునీ, కసురుకునీ, అతను రాత్రినుంచీ అలసిపోయి వున్నాడు.

అడుగు దూరం కదిలే వీలులేదు. కాలికి కడియం తొడిగి దానికి గొలుసు అతికించి వుంది. ఆ గొలుసుని పడుకున్న కాట్ కే చుట్టి తాళం వేసివుంది.

బానిసలనాటి కాలం గుర్తొస్తోంది.

కంటిమీద కునుకులేదు. కడుపులో ఆకలిలేదు. ఆలోచనలకి అంతులేదు.

రాత్రినుంచీ అలా పడివున్నాడు మంచంమీద.

ఎప్పుడో తెల్లారాక ఎవడో వచ్చి బ్రెడ్, పాలు, పళ్ళూ పెట్టి పోయాడు.

ఒక దినపత్రిక పారేసి పోయాడు.

ఒక రేడియో చెవి దగ్గర ఆన్ చేసి పోయాడు.

వాడు మాట్లాడడంలేదు. లాల్ వాడి ప్రవర్తనకి అవమానం ఫీలవుతూ అయిష్టంగానే ఆహారం తీసుకున్నాడు. ఫ్యాను గాలిలో ఫ్లోరసెంట్ ట్యూబ్ కాంతిలో పేపరు చదివి రిలాక్స్ అవుతూ ట్రాన్సిస్టర్ విన్నాడు.

పేపర్లో విషయాలు ఆందోళనపర్చాయి.

మధ్యాహ్నం ఒంటిగంటా పదినిమిషాలకి ప్రాంతీయ వార్తల్లో కోర్టు దగ్గర దౌర్జన్యకాండ తెలుసుకున్నాడు. తప్పించుకున్న సుహాసిని కోసం దుండగులు వెతుకుతున్నారని తెలుసుకున్నాడు. ఆ తర్వాత ఏమైందీ ఇంకా తెలియదు.

మళ్ళీ ఆరుగంటల పదిహేను నిమిషాలకి వినాలి.

ఇంకో గంటన్నర ఆగాలి.

నిట్టూరుస్తూ లాల్, ముఖం రుద్దుకుంటూంటే, తలుపు తీస్తున్న అలికిడయింది. అతడి చేతిలో చాలా వస్తువులున్నాయి. అతను నవ్వుతూ వచ్చి వాటిని పక్కనే టేబుల్ మీద సర్దసాగాడు.

ఒక బ్రాందీ సీసా, కాఫీ పాట్, నీళ్ళ జగ్గు, ప్లేటులో చపాతీలు, జామ్ బాటిల్ ఒకటి, సిగరెట్లు, టవల్ మొదలైనవి...

"ఎక్స్‌క్యూజ్ మీ సర్, మిమ్మల్ని నిర్లక్ష్యం చేసినందుకు చింతిస్తున్నాను...." అన్నాడతను దగ్గరకొచ్చి చేతులు కట్టుకొని.

ఇతను ఉదయం వచ్చినవాడు కాదు. లాల్ అతన్ని ఆసక్తిగా చూశాడు. అతన్ని చూసి అప్రయత్నంగా నవ్వు వచ్చింది.

"థాంక్యూ సర్, మీరు అర్థం చేసుకున్నందుకు."

అతను సీసా విప్పి గ్లాసులో ఒలికించాడు బీరుని. దాన్ని లాల్ కిస్తూ "మా ఆతిథ్యంలో ఇక మీకే లోటు రాదు, సర్. మా పనుల్లో వుండిపోయి మిమ్మల్ని అలక్ష్యం చేశాం. ఇకనుంచి మీ సేవకుడ్ని నేను" అన్నాడు.

"నాకెందుకింత మర్యాద?" అన్నాడు లాల్, లేచి అందుకుంటూ.

"ఆజ్ఞ సర్, పైనుంచి."

"ఎవరు పైన?"

"బాస్."

"ఎవరాయన?"

"బాస్."

"పేరేమిటి?"

"బాస్. ఎక్స్‌క్యూజ్ మీ సర్, ఒక్క క్షణం...."

అతను చకచకా బయటికెళ్ళిపోయాడు.

లాల్ తాగడం పూర్తిచేసి, చపాతీలు అందుకున్నాడు. జామ్ కలుపుకుని తింటోంటే వచ్చాడా మనిషి, ఈసారి పెద్ద కేసెట్ రికార్డర్‌తో.

"మీ కన్ని సౌకర్యాలు సమకూర్చబడతాయి, సర్. మీరు మీ ఇంట్లో వున్నట్లే భావించండి...." దాన్ని టేబుల్ మీద వుంచుతూ అన్నాడు.

"నీ పేరేమిటి?" అడిగాడు లాల్ నవ్వుతూ.

"జింబో, సర్."

వింతగా చూశాడతన్ని లాల్. "ఆఫ్రికానించి వచ్చావా?"

"లేదు, సర్. ఈ ఆంధ్రాలోనే పుట్టాను. నా పేరులో చిన్న చరిత్ర వుంది, సర్."

"ఏమిటది?"

"నేను పుట్టగానే మా అమ్మ నాకు 'అంజిగాడు'ని పేరు పెట్టాలనుకుందిట, సర్. కానీ నాన్న 'బోస్‌బాబు' అన్నాడట. చివరికిద్దరూ పోట్లాడుకుని 'జింబో' అని రాజీకొచ్చారట, సర్.... పేరు సార్వజనీయాలు. మీ పేరు విన్‌స్టీన్ అన్నా ఆశ్చర్యపోను, సర్."

"నువ్వు పేరుకు తగ్గట్లే వున్నావు."

నవ్వాడు జింబో. "ఉండాలి, సర్ — ఆకారం, రూపురేఖలు — పేరుకు తగ్గట్టు."

"బాగా మాట్లాడతావ్."

"మూడ్‌నిబట్టి, సర్. లేకపోతే చాలా మితభాషిని. కాని మృతభాష కాదు సర్, నాది. నేను చాలా చాలా గ్రంధాలు చదివి జీర్ణించుకున్నవాణ్ణి. చెప్పమంటారా సర్, కొన్ని?"

"చూడు జింబో, ఇప్పుడు నా మనసేం బాగాలేదు."

"సర్....?"

"వెళ్ళి ఓక్‌హౌస్ నవలలు పట్టుకొస్తున్నావా, కాస్సేపు నవ్వుకుంటూ మనసు తేలికబర్చుకుంటాను?"

"దట్ గ్రేట్ హ్యూమరిస్టు!"

"అవును, పట్టుకొస్తావా?"

"తప్పకుండా!" జింబో ప్లేటు తీసుకుని, కప్పులో కాఫీ పోసిచ్చాడు, "ఇక పాట వేస్తాను, సర్, మీ మనసు

తేలికవుతుంది....ఏ పాట కావాలి, సర్? చాహేకా— కామిలా—బేవఫా—తేరే ప్యార్ మే—వేయమంటారా, సర్? నా ఇష్టం."

"ప్రేమలో దెబ్బ తిన్నావా?"

"దెబ్బలో కూడా తియ్యదనం తెలుసా సర్, మీకు?"

"స్టాంపు."

"అయితే పాట వినండి."

"వద్దు, ప్రేమగీతాలు వద్దు. దేశభక్తి గీతాలు వుంటే వేయ్."

"సారీ సర్, అది మా ఆశయాలకి వ్యతిరేకం. ఈ పాట వినండి, సర్....ఎవరివో నీ వెవరివో....ఘంటసాల వారి గాన మాధుర్యం, సర్."

"జింబో....నా ప్రాణం తియ్యకు."

"ఓ.కే, సర్. మీరు వద్దంటే వద్దు."

సిగరెట్ అందించాడు జింబో. కప్పు కింద పెట్టి లాల్ తీసుకున్నాడు. జింబో గ్యాస్ లైటర్‌తో దాన్ని వెలిగించాడు.

"ఇక రెస్టు తీసుకోండి, సర్. మీకు ఆయుష్షు."

"అదేమిటి?"

"మీరిలాగే తిరిగి వెళ్ళాలనేది మా కాంక్ష."

"అదెప్పుడు?"

"మేము పంపినప్పుడు."

"ఎంత టైము తీసుకుంటుంది?"

"చెప్పలేం, రోజులు పట్టవచ్చు. మా పనులన్నీ పూర్తికావాలి. మీరు వేరే ప్రయత్నాలు చేసే అవసరం లేదు. మేమే క్షేమంగా తిరిగి పంపుతాం. మీ దగ్గర

వస్తువులు తీసుకున్నందుకు మన్నించండి. అవి తిరిగి ఇచ్చేస్తాం. చిన్న మనవి. మీ గోళ్లు కూడా కత్తిరించాం చూసుకోండి—ఫ్రస్ట్రేషన్‌లో మమ్మల్ని రక్కకుండా."

లాల్ చూసుకున్నాడు. "ఓహ్, బాగున్నాయి. క్రాఫు కూడా చేస్తే బాగుండేది."

"సారీ సర్, ఇక్కడ బార్బర్ లేడు."

"ఓ.కే. నువ్వెళ్ళు, చాలా థాంక్స్."

జింబో ట్రేలో వస్తువులు పెట్టుకుని వెళ్ళిపోతూ, ఆగి తిరిగాడు. "చిన్న రహస్యం, సర్."

"ఏమిటి?"

"ఆమెని తీసుకొచ్చా."

"ఎవరిని?"

"సుహాసినిని."

లాల్ ముఖం బిగుసుకుంది, "ఓహ్, ఐసీ.... దేనికి?"

"తెలుసుకుంటారు" నవ్వాడు జింబో, "మీకు పరిచయం చేస్తాను."

కలవరంగా, ఆశ్చర్యంగా చూస్తున్న లాల్‌ని వదిలేసి, నిష్క్రమించాడు జింబో.

• • •

"హత్య! హత్య! బాబోయ్, గదిలో శవం వుంది!" దబదబ పరుగెత్తుకొచ్చి నిలువునా వణికిపోతూ అరిచాడు రూం బాయ్, కౌంటర్ దగ్గర.

క్లర్కులిద్దరూ తటాలున తలలెత్తి చూశారు.

"ఏం కూశావ్?" అన్నాడొకడు.

"హత్య, సార్! ముఫ్ఫైయో నెంబర్ గదిలో శవం వుంది!"

క్లర్కులిద్దరూ పకపకా నవ్వారు. "వీడికి మతి

చెడింది! వద్దురా అంటే హారర్ సినిమాలు చూస్తాడు.... రాత్రి చూశాడు" అన్నాడు క్లర్క్.

"నిజం సార్, నమ్మండి! ఆయన కిందపడివున్నాడు! గుండెలో కత్తి వుంది!"

వాళ్ళిద్దరు రూం బాయ్‌ని సీరియస్‌గా చూశారు. ఎందుకో వాడి మాటలు నమ్మాలనిపించింది, ముఖం చూస్తే.

"పద రాజ్, సంగతేమిటో చూద్దాం" అన్నాడొకడు లేస్తూ.

ఇద్దరూ కదిలారు. రూం బాయ్ వెనుక రాగా, మెట్లెక్కి మూడో అంతస్తు చేరుకున్నారు. ముప్ఫై నెంబర్ గది ఆ చివర్లో వుంది. ఇద్దరూ వెళ్ళి జాగ్రత్తగా ఒక రెక్క తీసివున్న తలుపులోంచి చూశారు. తటాలున ఒక అడుగు వెనక్కి వేశారు.

"నిజమే వీడు చెప్పింది!"

వాళ్ళు వూపిరి బిగపట్టి చూస్తున్నారు లోపలికి. అతను గది మధ్యలో పడివున్నాడు, గుండెలో కత్తి దిగి.

మొన్న రాత్రే అతనీ హోటల్‌లో గది తీసుకున్నాడు. ఇవ్వాళ హతుడయ్యాడు.

అతని పేరు భగవంతురావు, బిజినెస్ మాగ్నెట్.

• • •

ఆ రెండు రోజుల వర్షానికి యెక్కడ వున్నారో, ఇవ్వాళ ఉదయం తిరిగి యధావిధిగా తయారయ్యారు యాచకులూ, సోమరులూ, కోఠి ఫిరోజ్ గాంధి పార్కులో.

ఈ పార్కు ఎప్పుడూ వీళ్ళతోనే నిండివుంటుంది. వీళ్ళు స్వర్గంలో వ్యాహ్యాళి భరింప శక్యంకానిది కాబట్టి,

డిగ్నిఫైడ్ పౌరులా ఛాయలకి వెళ్ళరు.

అక్కడ ఒక సోమరిని ఒక యాచకుడు వేధిస్తున్నాడు. యాచకులకి కామన్ సెన్స్ వుండనట్టే, వాళ్ళని వెంటేసుకు తిరగడానికి సోమరులకి సివిక్ సెన్స్ వుండదు.

సోమరి నడుస్తున్నాడు, యాచకుడు వెంటపడుతున్నాడు.

"నీకూ నాకూ తేడా ఏమిటో తెలుసా?" అడిగాడు సోమరి చటుక్కున ఆగి.

"ఏమిటి?" అన్నాడు యాచకుడు, తెలీదన్నట్టు తలూపి.

"సిగ్గు!" అని చెప్పి వెళ్ళిపోయాడు సోమరి.

యాచకుడు అర్థంచేసుకోడానికి ప్రయత్నిస్తూ, మళ్ళీ వెంటపడ్డాడు.

సోమరి ఒకచోట ఆగిపోయి చూస్తున్నాడు. అతని ముఖంమీద తమాషా నవ్వు వెలిసింది. యాచకుడికి చూపిస్తూ, "అదేమిటో చెప్పుకో చూద్దాం!" అన్నాడు.

యాచకుడు కుతూహలంగా ముందుకు వచ్చి చూస్తూ, అదిరిపడి వెనక్కి దూకాడు. "శవాలు! అవి శవాలు! బాబోయ్—"

సోమరి పకపకా నవ్వాడు. "ఎందుకలా బెదురుతావ్, నువ్వే చంపేశావ్!"

"లేదు—నేను చంపలేదు—నేనెందుకు చంపుతాను—వాళ్ళెవరో నాకు తెలియదు—" వణికిపోతున్నాడు యాచకుడు.

సోమరి అలాగే నవ్వుతున్నాడు, "నీలాటివాడే చంపి వుంటాడు, తిండికోసం!"

"ఓర్నాయనో! ఓరిబాబో! నాకేం తెలీదు! నే నేం చంపలేదు!" పరుగెత్తసాగాడు అక్కణ్ణించి యాచకుడు,

ఎదురైన అందరినీ హెచ్చరిస్తూ.

రానున్న అపాయం చూసి, యాచకులతో పాటు సోమరులంతా ఉడాయించేశారు అక్కడ్నించి. క్షణాల్లో ఖాళీ అయిపోయింది పార్కంతా.

కానీ ఈ సోమరి మాత్రం శవాల్నే చూస్తున్నాడు, గడ్డం నిమురుకుంటూ.

"పాపం, అన్నదమ్ములై వుంటారు ..." జాలిపడ్డాడు.

గుండెల్లో కత్తులు దిగి, ఆ పొదల్లో పడివున్నారు అన్నదమ్ములు. వాళ్ళ పేర్లు జగదీష్, మోహన్‌లు.

• • •

ఈ జీవితాంతం ఈ యవ్వనం ఆగవు ఏ క్షణం.

అనుక్షణం క్షీణం క్షీణం ఆయుక్షీణం—ఛఛ—

ఆ మెచూర్ కవిగారు కుస్తీ పడుతున్నాడు పదాలతో.

రేపు జరిగే సమ్మేళనంలో తన కవిత వినిపించాల్సి వుంది మరి.

శ్రోతల నించి ట్రెమెండస్ రెస్పాన్స్‌ని కూడా పొందవల్సి వుంది.

మరిప్పుడు చూస్తే సృష్టి జరగడంలేదు—ఏమిటి దారి?

మనిషికి ఒకటే హృదయం....అన్నట్టు—మనసుకు ఒక్కటే మూడ్ వుంటే ఎంత బాగుండేది?

ఇహ లాభంలేదనుకుంటూ కలం మూసేసి, ఒళ్ళు విరుచుకుంటూ లేచాడు.

'దిల్ సుఖ్ నగర్' అని ఏ ముహూర్తాన నామకరణం చేశారోగానీ, ఇక్కడ ఎవరి 'మనసూ సుఖం'గా లేదనడానికి తన కేసునే నిదర్శనంగా తీసుకోవల్సి వుంటుంది.

రెండు నిమిషాల తర్వాత అతను మూడ్‌ని వెతు

తొక్కుంటూ సాగిపోతున్నాడు, సైకిల్ మీద.

సైకిలు తొక్కుతూ, కొత్తగా ఏర్పడ్డ హౌసింగ్ బోర్డు కాలనీ దాటేసి, సన్నని బాటగుండా దూరంగా దారితీస్తున్నాడు బయలు ప్రదేశానికి. అలాటి ప్రదేశాలే అతనికి మూడ్ నిస్తాయట!

అతడి మనసు అలాగే భావాల్ని అన్వేషిస్తూ, పదాల్ని అల్లుకుంటూ విహరిస్తోంది వేరే లోకంలో.

ఆ మెచూర్ కవి రవీందర్ తన కవితలోని రెండో పాదాన్ని—క్షణ క్షణం అనుక్షణం అయుక్షణం—అని మార్పుచేస్తే ఎలా వుంటుందని ఆలోచిస్తూ ధడాలున దేనితో గుద్దేసి, ధభీమని కిందపడ్డాడు—సైకిలుతోసహా.

'పదధ్యానంలో ప్రమాదం—' పాదం తట్టిందతనికి.

దేనిమీద పడ్డాడో తెలుసుకోగానే విచిత్ర ధ్వని చేశాడు.

ఆలకించడానికి శ్రోతలు లేరు మరి.

విన్యాసాలు చేస్తూ పైకి లేచి, సైకిలు వదిలేసి, నోటి కందిన రెండు పద్యపాదాలతో పరుగులంకించుకున్నాడు.

'కాదిది కల ఈ కళేబరం—లేదిక రేపు కవి సమ్మేళనం!'

అతను అదృశ్యమయ్యాడు—అదృష్టవంతుడు.

ఇక్కడ — బాటమీద కాళ్ళు జాపి, వెల్లకిలా విప్పారిన కళ్ళతో చూస్తోంది, వాచ్‌మన్ వరదయ్య శవం.

అతని గుండెలో కత్తి దిగబడి వుంది.

• • •

ఆ వీధిలో బీడీ వెల్గించుకుని అర్జున్‌సింగ్ గంభీరంగా నడుస్తున్నాడు. అతన్ని చూస్తూనే చాలామంది అదృశ్యమవుతున్నారు. వాళ్ళెవరో అతనికి తెలుసు, వెధవలు.

అవసరమున్నప్పుడు కాళ్ళు పట్టుకుంటారు, అడిగేటప్పుడు పత్తా లేకుండా పోతారు. ఛూ, తిట్టుకున్నాడతను ఉమ్మేస్తూ. ఈ ప్రపంచంలో అప్పిచ్చినవాడంత పిచ్చివాడు లేడు!

అతనొక ఇంటిముందాగి తలుపు కొట్టాడు, జవాబు లేదు.

అతను కోపంతో తలుపుని తన్నాడు. ఛుక్కున తెరచుకున్నాయి రెక్కలు.

అతను లోపలికి చూశాడు, యెవరూ కన్పించలేదు. వీధిలో జనం అతన్ని దొంగచాటుగా గమనిస్తున్నారు.

అతను లోపలికి వెళ్ళి, "వస్తారా బయటికి?" అని అరిచాడు.

ఎవరూ రాలేదు.

అతను వాకిట్లో నడిచి ముందు కిటికీ దగ్గరాగాడు. అది తెరిచే వుంది. అందులోంచి చూస్తూ, "బయటికి రా, మస్తాన్!" అన్నాడు.

అప్పుడు కన్పించాడు మస్తాన్ —గదిలో నేలమీద, గుండెలో కత్తితో.

"బాప్రే, మర్ గయా!" అతను గబగబా అక్కడ్నించి కదిలాడు.

అర్జున్ సింగ్ ఆదరాబాదరా అదృశ్యమవడాన్ని వింతగా చూశారు అక్కడివాళ్ళు.

* * *

"ఎవరన్నారు?" అన్నాడు జాన్ చురుగ్గా ఇన్స్పెక్టర్ కృష్ణన్ని చూస్తూ.

"శవా లంటున్నాయి!" అన్నాడు కృష్ణన్ సిగరెట్ పీలుస్తూ, "అన్నీ ఒకేలా వున్నాయి. ఈ

అయిదు హత్యలూ ఒకేరకమైన కత్తులతో, ఒకే పద్ధతిలో జరిగాయి. కత్తులన్నీ అలాగే వదిలివున్నాయి, గుండెల్లో దింపి. వాటి పిడులన్నిటిమీదా పాము బొమ్మ ముద్రించి వుంది. వాటన్నిటికీ లేబుల్స్ కట్టి వున్నాయి. ఆ లేబుల్స్‌మీద వివరాలు. వీటినిబట్టి ఇవన్నీ ఒకే వ్యక్తి చేత జరిగాయని అనుకోవచ్చు."

"ఆ వ్యక్తి సుహాసినే అంటారు?"

"నిస్సందేహంగా. డైమండ్ హోటల్‌లోంచి వస్తున్నప్పుడు ఆమెని ఒక ఆటో డ్రైవర్ కళ్లారా చూశానంటున్నాడు. పత్రికల్లో ఆమె ఫోటో అతనికి బాగా గుర్తుందట. ఆమె సుహాసినీయే అని నమ్మకంగా చెప్తున్నాడు."

"శవాలింకా హాస్పిటల్లో వున్నాయా?"

"వున్నాయి."

"అయితే వెళ్ళి చూద్దాం. ముందు హోటల్ డైమండ్‌కి—" అన్నాడు జాన్ లేస్తూ.

ఇద్దరూ కారులో ప్రయాణిస్తున్నారు. అప్పుడు కృష్ణన్ అన్నాడు, "లాల్ జాడ ఇంకా తెలియలేదా, జాన్?"

"నో, ఇంకా లేదు, కృష్ణన్."

"ఏమైపోయాడు మనిషి?"

జాన్ మాట్లాడలేదు, అతని ముఖం సీరియస్‌గా మారింది.

డైమండ్ హోటల్‌లో గొడవగా వుంది—

అప్పుడే శవాన్ని తొలగిస్తున్నారు.

ఒక ఇన్‌స్పెక్టర్ దగ్గరకొచ్చి కత్తిని చూపిస్తూ, దానిమీద వేలిముద్రలేవన్నాడు.

జాన్ దాన్ని తీసుకుని చూశాడు. దాని బ్లేడు యస్

ఆకారంలో వుంది. పిడి గోధుమ రంగులో గుండ్రంగా వుంది. దానికి దారంతో లేబిల్ ఒకటి వేలాడుతోంది.

దానిమీద ఇలా వుంది—

3. భగవంతరావు, బంజారా హిల్స్
కోడల్ని చెర చిని పాపానికి,
సమయం రాత్రి 2-30— తేది 16- 2-82.

"ఈ రైటింగ్ యెవరిదంటారు?" అడిగాడు జాన్ కృష్ణన్ని.

"సుహాసినిదే కావచ్చు, తెలుసుకుంటాం" అన్నాడు కృష్ణన్ దాన్ని తీసుకుంటూ.

రిసెప్షన్ చేరిన జనం తమకు తోచిన విధంగా తీసుకుంటున్నారు హత్య గురించి.

"ఈ రైటింగ్ని ఆమె ఇంట్లో ఆమె నోట్స్తో పోల్చి చూడండి—" అంటూ జాన్, ఇన్స్పెక్టర్ చూపించిన ఆటో డ్రైవర్ వైపు తిరిగాడు.

డ్రైవర్ సలాము చేశాడు.

"నువ్వు చూసినప్పుడు ఆమె ఏ చీరలో వుంది?" అడిగాడు జాన్.

"తెల్ల చీర, అదే రంగు జాకెట్టు."

జాన్కి స్ఫురించింది....అవే బట్టలు. మార్చుకోలేదు.

"ఆమె ఎటు, ఎలా వెళ్ళింది?"

"ఆమె దూరంగా ఆపివున్న కారు దగ్గరికి నడిచి వెళ్ళింది.

"అందులో ఎవరున్నారు?"

"ఆమె ఒక్కతే — యెక్కి స్టార్టు చేసుకుని వెళ్ళి పోయింది."

"ఏ కారది? నెంబర్ మాశావా?"

"నెంబర్ చూడలేదు. వైట్ అంబాసిడర్."

"ఆమె చేతిలో ఏముంది?"

"ఏమీ లేదు....గ్లవ్స్ తొడుక్కున్నట్టు చూశాను."

జాన్, కృష్టన్ వైపు తిరిగాడు. "మిగతా మర్డర్ ప్లేసెస్‌లో ఆమెనెవరైనా చూశారా?"

"లేదు, అలా ఇంకా రిపోర్టు అందలేదు."

జాన్ కౌంటర్‌లో క్లర్క్‌ని చూశాడు. "రాత్రి డ్యూటీలో వున్నది మీరేనా?"

తలూపాడతను.

"ఆమె ఎప్పుడొచ్చింది ఇక్కడికి?"

"ఒంటిగంటన్నరకి, సర్. ఒంటిగానే వచ్చింది. ఆమె దగ్గర ఏమీ లేదు. తనకు గది కావాలంది. నాల్గో ఫ్లోర్‌లో నలభై రెండో నెంబర్ ఇచ్చాను. ఆమె గదికెళ్ళి సుమారు గంట తర్వాత గబగబా కిందికొచ్చి బయటికెళ్ళిపోయింది—అంతే, మళ్ళీ రాలేదు."

జాన్ రిజిష్టర్ తెరచి చూశాడు. అందులో 'నళిని' అని పేరు వ్రాసి వుంది. అడ్రసు ఏదో ఇచ్చింది, హైద్రాబాదుదే.

"ఆమెని మీరంతకుముందు చూడలేదా?" జాన్ అడిగాడు రిజిష్టర్ మూస్తూ.

"లేదు—" అన్నాడు క్లర్క్.

"నిన్న పేపర్స్‌లో ఆమె ఫోటో వచ్చింది" జాన్ అన్నాడు మళ్ళీ.

"దాన్నిప్పుడు గుర్తుచేసుకున్నాను. ఫోటో చూశాను గానీ, రాత్రి ఆమెని చూసినప్పుడు నాకు స్ఫురించలేదు."

"ఆమె అలాగే వుందని నమ్మకంగా చెప్పగలరా?"

"నమ్మకంగా చెప్పగలను."

"ఆమె గదిలో ఏమున్నాయి?" అడిగాడు జాన్, ఇన్‌స్పెక్టర్ వైపు తిరుగుతూ.

"మిస్టర్ జాన్, రక్తంతో — నేను దొరకను — అని వ్రాసి వుంది గోడమీద!"

"ఓహ్, ఛాలెంజా?"

"కావచ్చు."

జాన్ నిట్టూరుస్తూ చుట్టూ చూశాడు. జనం ఇంకా గుసగుసలాడుకుంటున్నారు. జాన్ కళ్ళు అప్పుడొక వ్యక్తి మీద అప్రయత్నంగా పడ్డాయి. అతను ఇన్‌స్పెక్టర్ పక్కనే నిల్చున్నాడు. అతను ఎవరితోనూ మాట్లాడ్డం లేదు. వింటున్నాడు అందర్నీ గమనిస్తూ. అతడి కళ్ళు చురుగ్గా చూస్తున్నాయి. ఎందుకో అతని ఎడమ చెయ్యి అందరి ముందుకు రావడంలేదు. వెనుక దాస్తున్నాడు. జాన్ మెల్లిగా కదిలి అతను గమనించకుండా ఆ చేతిని చూశాడు వెనుక.

ఆ చేతికి షర్టు స్లీవ్ బటన్‌ని చూశాడు. అది కుడి చేతికంటే వేరుగా వుంది. చేతిలో ఏమీ లేదు. ఓసారి ఆపాదమస్తకమూ పరిశీలించాడతన్ని జాన్. అతడి వంటి మీద ఎత్తుగా ఏమీ కన్పించడంలేదు, దుస్తుల్లోపల. జాన్ నిదానంగా వెళ్ళి అతని పక్కన నిలుచున్నాడు.

అతనది చూశాడు. ఎడమ చెయ్యి ప్యాంటు జేబులో పెట్టుకుని వేగంగా తలుపువైపు కదుల్తున్నాడు.

జాన్ ఆలస్యం చేయలేదు. విసురుగా కదిలాడు.

అది చూసి ఆ మనిషి పరుగుతీశాడు.

వాళ్ళిద్దర్నీ చూసి కృష్ణన్ వెనుక ఉరికాడు.

అతని వెనుక మిగిలిన ఇన్‌స్పెక్టర్లు వురికారు.

ఆ మనిషి గిర్రున తిరిగి తలుపు దగ్గర్నుంచి రివాల్వర్

ప్రేల్చాడు.

ఒక్కసారి కేకలు వెలువడ్డాయి. జనం చెల్లాచెదురయ్యారు.

బుల్లెట్ సీలింగ్ కి తగిలింది.

జాన్ తంగబడి మరుక్షణం మెరుపులా మాసుకెళ్ళాడు అతని కేసి.

అతను బయటికి వురుకుతున్నాడు.

జాన్ ఆగలేదు. అధికారులూ ఆగలేదు. అందరూ అతన్ని తరుముతున్నారు.

ఆగంతకుడు అందకుండా వురుకుతూ ఆవరణలో ఆగి, మళ్ళీ ప్రేల్చాడు రివాల్వర్ని. దాన్నుంచి తప్పించుకున్నాడు గానీ, ఒక ఇన్ స్పెక్టర్ భుజం పట్టుకుని కింద పడ్డాడు.

జాన్ అతడివెంట పరుగెత్తాడు కాని, ఆగంతకుడు క్షణాలలో మాయమయ్యాడు.

జాన్ గబగబా చెప్పాడు, "వాడు దొరకలేదు. హోటల్ దగ్గరే యెటో మాయమయ్యాడు. ఇహ దొరకడు — సిటీలో ఫిరోజ్ గాంధిపార్క్, దిల్ సుఖ్ నగర్ ఓల్డు సిటీ ప్రాంతంలో మర్డర్స్ జరిగాయి. అక్కడా శవాల్ని అలాగే వుంచి దర్యాప్తు ఆలస్యం చేయమనండి!....ఓహ్, వద్దు. మీ కమ్యూనికేషన్స్కి సీక్రెసీ లేదిప్పుడు. శత్రువులు ఎప్పటికప్పుడు వింటున్నారు. మీరు స్వయంగా ఆ చోట్లకి మీ మనుషుల్ని పంపండి-దర్యాప్తు ప్రొలాంగ్ చేయమనండి- నేనక్కడికి వచ్చేవరకూ!"

కృష్ణన్ తికమకగా చూశాడు. "ఎందుకు?"

"నాకు టైంలేదు, కమాన్ ఆ పని వెంటనే

చేయండి!" జాన్ పక్కనే పోతున్న టాక్సీని ఆపి ఎక్కాడు, "ఇంటికి పోనీ!"

"ఇల్లెక్కడ, సార్?"

చెప్పాడు జాన్. చెప్పి సిగరెట్ వెల్గించుకున్నాడు. అతని మెదడు వేగంగా ఆలోచిస్తోంది. ఇల్లెప్పుడు చేరిందో తెలియదు టాక్సీ. దిగి ఫేర్ చెల్లించేసి లోపలి కురికాడు. వేగంగా కదుల్తూ కబోర్డులోంచి కెమెరా డెస్కులోంచి రివాల్వర్ తీసుకున్నాడు. కెమెరాలో కొత్త రోల్ లోడ్ చేసి, రివాల్వర్ లో గుళ్ళు చూసు చూసుకున్నాడు.

అప్పుడు చకచకా బట్టలు విప్పేసి, సాదా తెల్ల ప్యాంటూ షర్టూ తొడుక్కున్నాడు. బూట్లు విడిచేసి చెప్పులు వేసుకున్నాడు. తెల్ల కళ్ళద్దాలుతీసి తుడిచి పెట్టుకున్నాడు. డ్రెస్సింగ్ మిర్రర్ ముందు నిలబడి తల వెనక్కి దువ్వుకున్నాడు. రేజరందుకుని, షేవింగ్ క్రీం పూసుకుని, మీసాలు తీసేశాడు.

రూపం పూర్తిగా మారిపోయింది.

తన రివాల్వర్ని ప్యాంటులో పెట్టుకుని, టేబుల్ మీద రైటింగ్ పాడ్ అందుకొని, ఒక బాల్ పాయింట్ పెన్ను జేబులో పెట్టుకుని, ఇంటికి తాళంవేసి బయట పడ్డాడు.

పెద్ద పెద్ద అంగలేస్తూ మెయిన్ రోడ్డుమీదికొచ్చి, మెకానిక్ మన్సూర్ షాపు దగ్గర ఆగాడు, "బైక్ కావాలి నాకు, మన్సూర్" అన్నాడు.

"అలాగే సాబ్, ఇది పట్టుకెళ్ళండి" ఎరుపు రంగు జావా తీసిచ్చాడు మన్సూర్.

జాన్ ధడాలున దానిమీద కూలబడి, స్టార్టు చేసుకొని

వెళ్ళిపోయాడు.

• • •

ఫిరోజ్ గాంధి పార్కు బయట బైక్ దిగి జాన్, గేటులోంచి లోపలకి వురికాడు, మెడలో కేమెరాతో.

లోపలంతా కోలాహలంగా వుంది. జనం తండోప తండాలుగా వచ్చి చూసిపోతున్నారు. శవాలున్న చోటు నుంచి దూరంగా వుంచుతున్నారు వాళ్ళని పోలీసులు.

అన్నదమ్ముల శవాలిప్పుడు భంగిమలు మారాయి.

అధికారులు పక్కకు నిలబడి చర్చించుకుంటున్నారు.

జాన్ వాళ్ళని విష్ చేసి, వాళ్ళ మొహం చూస్తోంటే వెళ్ళి చకచకా ఫోటోలు తీసుకున్నాడు శవాలకి, విలేఖరి పాత్ర నటిస్తూ.

అప్పుడు పాడ్ పట్టుకుని అధికారుల్ని చేరుకున్నాడు.

"మెసెంజర్ రాలేదా?" అడిగాడు వాళ్ళని రహస్యంగా.

"మెసెంజర్ ఎవరు?"

"మీ వాళ్ళు పంపిన మనిషి—నన్ను గుర్తుపట్టలేదా?"

"మీరు జాన్ కదూ?"

"అవును."

"ఏమిటీ వేషం?"

"ఏమీ లేదు...."అని జాన్ చుట్టూ చూశాడు. ఓ పది మంది గుంపులుగా నిల్చుని హత్య గురించి మాట్లాడుకుంటున్నారు. జాన్ వాళ్ళని గమనిస్తూ "ఇక మీ పని ముగించుకోవచ్చు" అన్నాడు జాన్ ఇన్‌స్పెక్టర్‌తో.

"ఏమిటిదంతా, జాన్?"

"ఏమీ లేదు....కత్తులు ఏవి?"

రెండు కత్తులు ఇన్‌స్పెక్టర్ అందించాడు.

జాన్ వాటిని చూశాడు. అవే కత్తులు అలాగే వున్నాయి. వాటికి లేబిల్స్ కట్టి వున్నాయి.

1. జగదీష్‌ప్రసాద్, విద్యార్థి.
   చెల్లెల్ని చెరచిన పాపానికి.
   సమయం: రాత్రి 12.00— తేది 16-12-82.
2. మోహన్‌కుమార్, విద్యార్థి.
   చెల్లెల్ని చంపిన పాపానికి.
   సమయం: రాత్రి 12.30— తేది 16-12-82.

"ఈ రెండు కత్తులు ఒకేలా వున్నాయి. వీటిమీద త్రాచుబొమ్మని చూశారా?"

"చూశాను. కోడె త్రాచు కాటేస్తోంది...." అన్నాడు జాన్, వాటిని ఇచ్చేస్తూ. అప్పుడు తాపీగా చూస్తూ, గుంపుగా నిలబడ్డ జనాన్ని కేమెరా ఎత్తి రెండు స్నాప్స్ లాగాడు.

వాళ్ళలో కదలిక ప్రారంభమైంది—

మొదటి స్నాప్ కే ఆ గుంపులోంచి ఓ మనిషి వేరు పడి, గబగబా వెళ్ళిపోతున్నాడు....అతడి పర్సు యెడమ స్లీవ్ గుండీని చూశాడు జాన్. అతని కళ్ళు మెరిశాయి. చటుక్కున కదిలి ఆ మనిషి వెనుక నడవసాగాడు....ఆ మనిషి ఒకసారి వెనక్కి చూసి ఉలిక్కిపడి వేగం పెంచాడు. జాన్ కూడా పెంచాడు. వాళ్ళిద్దర్నీ అందో ళనగా చూస్తూండిపోయారు అధికారులు. ఆ మనిషి అప్పుడొక్కసారి పరుగుతీయసాగాడు — జాన్ వెంట పడ్డాడు వెంటనే! కానీ అతనికందకుండా గేటును దాటేశాడా మనిషి. జాన్ గేటు దాటబోతున్నాడు వేగంగా—

అప్పుడే పెద్ద ప్రేలుడు సంభవించింది.

చెవి పక్కగా రొదచేసుకుంటూ వెంట్రుకవాసిలో వెళ్ళిందొక బుల్లెట్.

అక్కడ గభాల్న కూర్చుండిపోయి రివాల్వర్ తీసి కాల్చాడు జాన్, మళ్ళీ వెంటనే లేచి వురుకుతూ రెండో సారి కాల్చాడు.

ఆ రెండు గుళ్ళనీ తప్పించుకుని ఆగంతకుడు పక్కనే ఆటోలో కూకాడు. తక్షణం ఆటో కదలకపోవడంతో మొండికేసిన డ్రైవరు నెత్తిమీద మోది, అవతలినుంచి దూకేసి తిరిగి పరుగు ప్రారంభించాడు, బ్యాంక్ స్ట్రీట్ కేసి.

జాన్ కి మళ్ళీ కాల్చడానికి వీలుదొరకలేదు. ట్రాఫిక్ లోంచి రేసు గుర్రంలా దౌడుతీశాడు. అప్పుడే యాభై గజాల దూరంలోకి వెళ్ళిపోయాడు ఆగంతకుడు. అతన్ని పట్టుకోమని అరవాలనుకున్నాడు జాన్. కానీ వాడి చేతిలో రివాల్వర్ కి యెవరూ బలికావడం ఇష్టంలేదు. వీళ్ళ కాల్పులు, పరుగులు చూసి మనుషులు చెల్లాచెదురయిపోతున్నారు. బయట శబ్దాలు విన్న అధికారులు పార్కులోంచి వురికివచ్చారు. కానీ వాళ్ళకేం కన్పించలేదు.

అప్పటికే సాగర్ టాకీసుదగ్గర వున్నాడు ఆగంతకుడు.

ఆగంతకుడు జాన్ ని దిమ్మెరపోయేలా చేస్తూ ఉన్నాడిలా, ఆబిడ్స్ ట్రాఫిక్ ఐలాండ్ వద్ద అడ్డుకోబోయిన ఇద్దరు అధికారుల్ని తొడల్లోకి షూట్ చేసి, కారు రెండు టైర్లనీ బరస్టు చేసేసి, అలాగే ముందుకు పారిపోయాడు.

అధికారులు పక్కకు పడిపోయారు.

కారు ఓ వైపుకు ఒరిగిపోయింది.

పిచ్చి కోపంతో రెచ్చిపోయిన జాన్ రివాల్వర్

ప్రయోగిస్తూ వాడివెంటపడ్డాను. మరి రెండు గుళ్ళు వృథా అయ్యాయి. బయట జరుగుతున్న గొడవకి పోలీస్ స్టేషన్‌లోంచి పరుగెత్తుకొచ్చారిద్దరు ఇన్‌స్పెక్టర్లు. పరిస్థితి గ్రహించి వెహికల్స్ ఎక్కేశారప్పుడు—

ఒకరి వెనుక ఒకరుగా పరుగెత్తుకొస్తున్న ఆ సాయుధుల్ని చూడగానే భయంతో కార్లని లాంప్ పోస్టులకి పెట్టేసేవాళ్ళూ, టూ వీలర్స్‌ని బెదిరిపోయి వదిలేసి కిందపడిపోయేవాళ్ళూ దారిపొడుగునా లెక్కలేనంతమంది.

ఆగంతకుడు ఇంకోసారి వెనుదిరిగి కాల్చిన బుల్లెట్ జాన్‌ని స్పృశించలేదుగానీ, షాపులోకి వురుకుతున్న ఓ వృద్ధురాలిని పడగొట్టేసింది, చెంపలోకి దూరిపోతూ. అప్పుడాగంతకుడు పరుగెత్తికెళ్ళి ఒక బస్సు నందుకున్నాడు—డబుల్ డెక్కర్—హోటల్ ఎమరాల్డ్ ముందు.

చేతిలో పొగలు గక్కుతున్న రివాల్వర్‌తో లోనికి జొరబడుతున్న దుండగుడ్ని చూసి కెవ్వు కెవ్వున అరిచి అలజడి సృష్టించారు ప్రయాణీకులు. డ్రైవర్ కంగారుపడి బస్సాపేసి చూశాడు. ప్రయాణీకులు ఇంకా అరుస్తూ కిందికి దూకేయసాగారు—జొరబడుతున్న ఇంకో ఆగంతకుడ్ని చూసి—జాన్‌ని.

మొదటి ఆగంతకుడు పైకి వురుకుతున్నాడు. జాన్ వెనుక వురికాడు. ఇద్దరూ పైకి రాగానే అక్కడి ప్రయాణీకులూ కేకలేసుకుంటూ కిందికి దౌడుదీయసాగారు.... జారి, మెట్లమీద ఒకరుపడి దొర్లుకుంటూ వచ్చి కింద పడుతున్నారు. లేచి బయటికి దూకుతున్నారు. అప్పటికే వచ్చి చుట్టుముట్టేసిన వాహనాల్లో అధికారులు ఏమీ చేయలేకపోతున్నారు — లోపలికెళ్ళడానికి జనం అడ్డు

పడుతూంటే.

పైన జాన్ మెడలోంచి కేమెరా జారి కిందపడి పోయింది. రివాల్వర్ లేపుతున్న ఆగంతకుడిమీదికి లంఘించి ముఖంమీద మోదాడు. రెండుసార్లు ట్రిగ్గర్ లాగి, అది ప్రేలకపోవడంతో, దాన్ని పదేసి జాన్‌తో కలబడ్డాడు ఆగంతకుడు. జాన్ చేతిలో రివాల్వర్ అతడి ముఖంమీద ఫెడీ ఫెడీమని తగుల్తోంది. కేకవేసి ముఖం పట్టుకుని కిందపడ్డాడు ఆగంతకుడు—జాన్ అతనిమీదికి దూకి పిడికిళ్ళతో బలమంతా ఉపయోగించి కొట్టసాగాడు. వాడు భరించలేక అరుస్తున్నాడు. ఛాతీమీద పడుతున్న రివాల్వర్ పిడి ఘాతాలకి కాళ్లు తన్నుకుంటున్నాడు. తన్నుకుంటూ జాన్ చేతిని పట్టుకుని కొరికేశాడు. జాన్ వదిలేయగానే రివాల్వర్ పట్టుకుని రెండుసార్లు ట్రిగ్గర్ లాగేశాడు—రెండు గుళ్ళూ పైన టాపుని చీల్చుకుంటూ వెళ్ళిపోయాయి. జాన్ అప్పుడు వెంటనే దాన్నిపట్టుకుని గురిని తననుంచి తప్పించాడు. అప్పుడు మూడో బుల్లెట్.

వాడి ఛాతీలో ఏర్పడ్డ రంధ్రాన్ని చూసి జాన్ లేచి పోయాడు.

రంధ్రంలోంచి బొటబొటా రక్తం కారుతోంది.

జాన్ ముఖం తుడుచుకుంటూ పైకొస్తున్న అధికారుల్ని చూశాడు. చేతుల్లో రివాల్వర్స్‌తో వచ్చిన అధికారులు ఉద్రేకపడ్డారు అక్కడి దృశ్యాన్ని చూసి.

జాన్ ఆయాసం తీర్చుకుంటూ కేమెరాని ఎత్తుకున్నాడు.

“ఏమిటిది, మిష్టర్!” అరిచాడొక అధికారి.

“ఈ బాస్టర్డ్స్ నా పార్ట్నర్‌ని బంధించారు!” చెప్పాడు జాన్ పళ్ళు బిగువున.

"అయితే—అందుకని చంపారా?"

"నో—వీళ్ళింకా ఏమేం చేస్తున్నారో మీకు తెలియదు. ఇన్‌స్పెక్టర్, దయచేసి మీరు వెంటనే నే చెప్పిన ప్రకారం చేస్తారా? ప్రశ్నలడక్కండి. తక్షణం హెడ్ క్వార్టర్స్‌కి ఫోన్ చేసి-రిపీట్—టెలిఫోన్ చేసి—అక్కడ నిన్న కాప్చర్ చేసుకున్న APY 4698 బ్లాక్ అంబాసిడర్‌ని వెంటనే దిల్‌సుఖ్ నగర్ బస్ డిపోముందు తెచ్చిపెట్టమని చెప్పండి! ఓ.కే.?"

"ఓహ్!—జాన్!"

"వైర్‌లెస్ వాడకండి. అలాగే కోఠీ పార్కుముందు నా రెడ్ జావా వుంటుంది—దాన్ని కూడా ఆ కారు పక్కన పెట్టించండి!"

"మరి ఇతను?"

"ఇతని బాడీ సెర్చి చేయండి—" అన్నాడు జాన్ ఆగంతకుడి శవాన్ని చూస్తూ, "మీకు జేమ్స్‌బాండ్ సినిమా చూసినంత ఎక్సైట్‌మెంట్ లభిస్తుంది."

• • •

5. మస్తాన్ ఖాన్, పాతనగరం కేడీ.
నజ్మాబేగంని చెరచిన పాపానికి.
సమయం: రాత్రి 9.30—తేది 13-12-82.

జాన్ ఆ లేబిల్‌ని చూసి, కత్తిని అక్కడి ఇన్‌స్పెక్టర్‌కిచ్చేశాడు. "అవే అక్షరాలు. రైటింగ్ ఒక్కటే. దీన్ని బాలకృష్ణన్‌కి అందించండి, క్రైం బ్రాంచ్‌లో. ఈ మర్డర్స్‌కి అతనే ఇన్‌ఛార్జి."

"కానీ మీ ఉద్దేశ్యమేమిటి? మమ్మల్ని ఇంతసేపు ఎందుకాపారు?"

"నా ఉద్దేశ్యాలడక్కండి, మీకు నచ్చవు. నేనిక్కడ

ఫ్లాష్ తీయడానికీ, దర్యాప్తు చేయడానికీ రాలేదు. టు హెల్ విత్ ఇట్! ఈ హత్యలతో నాకు పనిలేదు. నాకీ శవం అవసరంలేదు—మీ పని ముగించుకోండి."

"మరి మీకేం అవసరం?"

"నాకు జనంతో అవసరముంది."

"ఈ హత్యల గురించి మీరేమనుకుంటున్నారు?"

"బాగయిందనుకుంటున్నాను. ఇలాంటి డిజనరేట్స్ కిలాంటి గతి పట్టాల్సిందే. సుహాసినీ జిందాబాద్!"

జాన్ బయటకొచ్చి జనాన్ని చూశాడు. పదిహేను మందికంటే ఎక్కువ లేరు. జాన్ వాళ్ళ దుస్తుల్ని శ్రద్ధగా చూస్తూ, నిదానంగా కేమేరా ఎత్తి క్లిక్ మనిపించాడు.

"అదేమిటి, ఫోటో ఎందుకు తీశారు?" ఇన్స్పెక్టర్ అడిగాడు.

జాన్ మాట్లాడలేదు.

ఆ జనం చెదిరిపోయారు వెంటనే.

వాళ్ళలోంచి ఒకడు అందరికంటే ముందు వెళ్ళిపోతున్నాడు—పెద్ద పెద్ద అంగలేసుకుంటూ.

అతను ఎరుపురంగు షర్టు తొడుక్కున్నాడు.

అతన్ని చూసి జాన్, "వాడ్ని పట్టుకోండి!" అనరిచాడు.

అప్పుడా ఎర్ర షర్టు మనిషి వెనక్కి చూసి, రివాల్వర్ చూపించాడు. పెద్దగా ఏదో అరిచి, తిరిగి గబగబా వెళ్ళి సందులోకి తిరిగి అదృశ్యమయ్యాడు. జాన్ తెగించి అటువైపు పరుగెత్తాడు. సందులోకి తిరగ్గానే కొంత దూరంలో ఎర్రషర్టు మనిషి, మళ్ళీ వెనక్కిచూసి ఈసారి రివాల్వర్ పేల్చేశాడు!

జాన్ తటాలున పక్కనున్న ఇంటి అరుగుమీదికి దూకేశాడు. పిల్లలూ ఆడవాళ్ళు కీచు అరుపులతో లోపలికి దూరిపోయి తలుపులేసుకున్నారు. జాన్ తన ఖాళీ రివాల్వర్ని చూసి కసురుకుంటూ మళ్ళీ లేచి వీధిలోకి వురికాడు—

వీధి అదిరిపోయేలా రెండుసార్లు గాలిలోకి కాల్చి అదే దారి తీస్తున్నాడు ఎర్రచొక్కా మనిషి. జాన్ అతనికి ముప్ఫై గజాల దూరంలో వున్నాడు. అతని వెనుక పోలీసు జీపు వచ్చేస్తుంది....

అది శరవేగంతో జాన్ని దాటుకుని పోతూండగా ఎర్రచొక్కా మనిషి ఈసారి పూర్తిగా రెచ్చిపోయి, గురి చూసి కాల్చాడు వెనక్కి.

అద్దాన్ని చీల్చుకుంటూ జీపులో అందరి మధ్యనుంచి దూసుకెళ్ళింది బుల్లెట్!

అప్పుడు ఇన్స్పెక్టర్ చేతిలో రివాల్వర్ బదులు పలికింది— రెండుసార్లు.

మొదటిసారి మోకాలులోకి, రెండోసారి వీపులోకి.

చేతులు గాల్లోకి విసిరి బోర్లాపడ్డాడు ఎర్రచొక్కా మనిషి.

జాన్ పరుగెత్తుకెళ్ళి చేరుకున్నాడు—

జీపులోంచి పోలీసులు దిగారు.

అతన్ని వెల్లకిలా తిప్పి చూశారు. చనిపోయాడప్పుడే.

"మిస్టర్ జాన్, ఎవరితను? ఏం చేశాడు?"

అప్పుడు జాన్ కూర్చుని శవం చేతికి గుండీ విప్పి, స్లీవ్ని పైకి లాగాడు. ఆ గుండీకి అతికించి వున్న సన్నని తీగ, ఆ ఎడమచేతి మీదుగా చంకవరకూ వెళ్ళి, అక్క

డ్నించి ఛాతీపక్క భాగంమీదుగా కింద నడుము దగ్గర కొచ్చింది. నడుముకింద, ప్యాంటు లోపలినుంచి ఎడమ జేబువున్న రంధ్రంలోంచి వెళ్ళి కనెక్టు చేయబడి వుంది. మైక్రో కాసెట్ రికార్డర్‌కి.

ఆ గుండీ మైక్రోఫోన్.

ఆతను శత్రువర్గపు ప్రతినిధి.

• • •

రాజ్‌భవన్ సమీపంలోని ఒక రెస్టారెంట్‌నుంచి శంభూనాథ్ మాట్లాడుతున్నాడు తనబాస్‌తో, ఫోన్‌లో.

"కొంప మునిగింది బాస్, గల్లంతయింది!"

"ఏం జరిగింది?"

"వాళ్ళకి తెలిసిపోయింది — భాస్కర్ తప్పించుకొచ్చాడు డైమండ్ హోటల్‌నించి!"

"సరే, వాడెక్కడో ట్రాక్ వదిలివుంటాడు. వాడి పీక నొక్కేసెయ్. అరమైందా? వంటిమీద సరుకు పీకెయ్. అందులో పనికొచ్చే విషయాలుంటే నాకు పంపు. లేకపోతే తగలబెట్టేసెయ్."

"అలాగే, బాస్...." అన్నాడు శంభూనాథ్ కంగారుగా, "అలాగే!"

"మిగతా ముగ్గురేమయ్యారు?"

"ఇంకా రాలేదు, బాస్. ఎదురుచూస్తున్నాను."

"మీరంతా దద్దమ్మలు, వెధవలు, గాడిదలు. ఆదిలోనే ఆర్పేసేలా వున్నారు పరిస్థితి చూస్తే. ముందింకా బోలెడు జరగాల్సి వుంది—ఆ ముగ్గుర్నించి కూడా ఇలాంటి రిపోర్ట్సే అందాయా, నిన్ను యాసిడ్‌లో పడేస్తాను, శంభూ...."

"ఓహ్...." శంభూనాథ్ బాధగా అన్నాడు.

"వెళ్ళు! వాళ్ళేమయ్యారో చూడు! అక్కడికి

మనుషుల్ని పంపు!"

"అలాగే, బాస్....అలాగే! ఏదైనా మెసేజ్....?"

"నో మెసేజ్, నోర్మ్యాసుకో!"

శంభూనాథ్ బాధగా ఫోన్ పెట్టేశాడు. తిరిగివచ్చి భాస్కర్ యెదుట కూర్చున్నాడు. భాస్కర్ ప్రక్కన ఇంకో ముగ్గురున్నారు. భాస్కర్ ఏమయిందన్నట్టు చూశాడు.

శంభూనాథ్ చెప్పాడు, "మిగతాచోట్లకి మనుషుల్ని పంపమన్నాడు, వాళ్ళేమయ్యారో చూడ్డానికి...సుభాష్, సంతోష్, దాస్ — మీరు ముగ్గురూ వెళ్ళండి. వెంటనే నాకు ఫోన్ చేయండి, ఇక్కడే వుంటాను. ఓ.కే? ఇక వెళ్ళండి వెంటనే!"

వాళ్ళు ముగ్గురూ లేచి వేగంగా వెళ్ళిపోయారు.

శంభూనాథ్ గెడ్డం రుద్దుకుంటూ భాస్కర్‌ని జాలిగా చూశాడు.

"ఏదీ, నీ ఇన్ఫర్మేషన్ చూద్దాం!" అన్నాడతను.

భాస్కర్ జేబులోంచి ఆ పరికరాన్ని తీశాడు.

దాన్ని శంభూనాథ్ చెవి దగ్గరగా తీసికెళ్ళి ఆన్ చేశాడు.

•  •  •

అక్కడ దిల్‌సుఖ్ నగర్ కాలనీలో జనాన్ని పోలీసులు అదుపులో వుంచుతున్నారు. మోటార్ సైకిల్ శబ్దానికి అందరి దృష్టి జాన్‌మీద పడింది. అతను రిపోర్టర్‌లా దిగివెళ్ళి అక్కడి అధికారుల్ని కలిశాడు. వాళ్ళు తనని గుర్తించాక, రిపోర్టర్ పాత్ర నిర్వహించాడు, శవానికి ఫోటోలు తీసుకుంటూ.

"మిస్టర్ జాన్, మమ్మల్నెందుకు ఆగమన్నారు?"

అడిగాడు అక్కడి ఇన్‌స్పెక్టర్.

జాన్ కళ్ళతో వారిస్తూ అతన్ని దూరంగా తీసికెళ్ళాడు. "ష్, గట్టిగా మాట్లాడకండి. మనకు కనిపించని శ్రవణేంద్రియాలు పనిచేస్తున్నాయిక్కడ. ప్రతి హత్యాస్థలంలోనూ వాళ్ళ గ్యాంగ్ మనుషులు ప్లాంట్ చేయబడ్డారు. మైక్రోఫోన్‌తో మీరేం మాట్లాడుకుంటున్నారో రికార్డు చేస్తున్నారు. వాటిద్వారా వాళ్ళు తీసుకోవలసిన జాగ్రత్తలు తీసుకుంటూరు...."

"ఓహ్, ఈ లేబిల్స్‌మీద నెంబర్లు చూస్తే ఇలాటివి ఇంకా జరుగుతాయనిపిస్తోంది!"

"ఇతని శవంమీద ఏముంది?"

చూపించాడు ఇన్‌స్పెక్టర్ కత్తిని. దానికి కట్టివున్న లేబిల్‌ని.

1. వరదయ్య, వాచ్‌మన్.
పసిపాపని చెరచిన పాపానికి.
సమయం: రాత్రి 9.45— తేది 16-12-81.

"అదే కత్తి.... అదే వ్రాత" అన్నాడు జాన్ దాన్ని చ్చేస్తూ, "హత్యాక్రమం హతుల పేర్ల ముందు సూచించబడింది.... ఓ.కే, ఇక శవాన్ని తొలగించండి."

"మీ పార్ట్‌నర్ జాడ ఏమయింది, జాన్?"

"ఆ ప్రయత్నంలోనే వున్నాను."

"మమ్మల్నెందు కాపారు?"

"శత్రువు కోసం...." అని జాన్ గుంపులోకి చూశాడు. అటు కదిలి కెమెరా ఎత్తి, "జస్ట్ మినిట్.. అలాగే నిల్చోండి. ఈ హత్యలు జనాన్నెంత ఆకర్షిస్తున్నాయో తెలుపడానికి మీ ఫోటోలు అవసరం మా పత్రికకి...." అంటూ ఒక స్నాప్ తీశాడు. జనం కదల

లేదు. ఇంకా కుతూహలంగా ఎగబడ్డారు. జాన్ మరో స్నాప్ తీస్తున్నప్పుడు ఓ మనిషి నెమ్మదిగా జారుకోసాగాడు. అతడికి తన ఆనవాలు రికార్డు కావడం ఇష్టం లేదు. చంపేసాడు శంభూనాథ్ ...."

రెస్టారెంట్లో శంభూనాథ్ ఆ టేపు వినడం పూర్తిచేసి, ఆఫ్ చేసి తన జేబులో పెట్టుకున్నాడు. "గుడ్ జాబ్, భాస్కర్. డైమండ్ హోటల్లో మనకి చిక్కులేర్పడలేదు...." అన్నాడు.

"లేదు, వాళ్ళకి సుహాసిని ఆజ దొరకలేదు. ఆమెని ట్రేస్ చేయలేదు" అన్నాడు భాస్కర్ ఉత్సాహంగా.

శంభూనాథ్ తలూపాడు, "అవును, నిన్ను తప్ప."

"అంటే?" భాస్కర్ కళ్ళు చిట్లించి చూశాడు.

"నిన్ను ట్రేస్ చేయగలరు ..." అని శంభూనాథ్, బాస్ తనకేం చెప్పాడో వివరించాడు.

భాస్కర్ ముఖంలో భీతి ప్రవేశించింది.

"కానీ పొరపాటు అందరూ చేస్తారు, కదూ భాస్కర్?" అన్నాడు శంభూనాథ్ తిరిగి, జాలిగా చూస్తూ, "అయితే అందరూ క్షమించరు. మన బాస్ గురించి నీకు తెలుసుగా? అతడొక నిర్ణయం తీసుకున్నాడంటే తిరుగుండదు! వెళ్ళిపో నువ్వు, భాస్కర్ నువ్వెళ్ళిపో. దూరంగా .... దూరం దూరం .... చాలా దూరంగా వెళ్ళిపో! ఇంకెప్పటికీ కానరాకు. నువ్వంటే నాకెంతో యిష్టం. ఎలా చంపను? నువ్వు పారిపో భాస్కర్, ఎవరికీ కనిపించకుండా! నాకుగానీ, బాస్ మనుషులకిగానీ, పోలీసులకిగానీ కనిపించవద్దు! అర్థమవుతోందా? ఇక వెళ్ళిపో ..."

భాస్కర్ కలవరంగా చూశాడు.

శంభూనాథ్ ఉరిమి చూశాడు. "వెళ్ళిపో ఇక్కడ్నుంచి—తక్షణం!"

భాస్కర్ లేచి, చెమటలు తుడుచుకుంటూ, బణికి పోతూ, దాడు తీశాడు అక్కడ్నించి....

ఆ వెళ్ళిపోతున్న మనిషిని చూస్తూ జాన్ కెమెరా దించాడు. అతన్ని జాగ్రత్తగా చూశాడు. అతను గబ గబా సాగిపోతున్నాడు కాలనీ వైపు. బ్లూ షర్టు. పొడుగు చేతులు. అదే గుండీ యెడమ చేతికి.

అతను గమనించకుండా జాన్ మనుషుల చాటున నిల్చుని, గబగబా వెళ్ళిపోతున్న అతన్ని చూడసాగాడు. ఆ మనిషి రెండుమూడుసార్లు వెనక్కి చూశాడు. అలా వెళ్తూ వెళ్తూ కాలనీ చేరుకుని, అక్కడే నిర్మానుష్యమైన వీధిలో ఆగివున్న బ్లాక్ అంబాసిడర్‌ని చూశాడు.

అతని కళ్ళు పెద్దవయ్యాయి. నెంబర్ ప్లేటుని చూసి వూపిరి బిగబట్టాడు. వెంటనే అటూ ఇటూ చూశాడు. యెవరూ కన్పించలేదు. అతన్నెవరూ గమనించడంలేదు. అతను కొన్ని క్షణాలు తటపటాయిస్తూ అక్కడే నిల్చున్నాడు. మళ్ళీ మైదానంలోకి సూటిగా చూశాడు. యెవరూ రావడంలేదు. అతను వెంటనే డోర్ తీసి కారెక్కాడు.

ఇదంతా గమనిస్తూ, జాన్ మోటార్ సైకిల్ దగ్గరికి కదిలాడు.

అప్పుడా కారు స్టార్టయి వెళ్ళిపోతూండడం చూశాడు.

వెంటనే బైక్ స్టార్టు చేశాడు.

ఆ కారు వేగంగా వెళ్ళిపోతోంది.

జాన్ వేగంగా అనుసరించాడు.

ఆ మనిషి వెనక్కి చూడడంలేదు. కారుకి రియర్ వ్యూ

మిర్రర్ లేదు. ఆ కారు మెయిన్ రోడ్డు చేరుకుని ఒక షాపు ముందాగింది.

జాన్ కూడా దూరంగా ఆపి చూశాడు.

ఆ మనిషి కారు దిగి ఒక హార్డువేర్ షాపులోకి పోతున్నాడు.

జాన్ సిగరెట్ వెల్గించుకున్నాడు.

అయిదు నిమిషాల తర్వాత ఆ మనిషి తిరిగివచ్చాడు. అతడి చేతిలో పెయింట్ టిన్ను, ఒక బ్రష్షు కన్పించాయి జాన్‌కి.

అతను కారెక్కి తిరిగి బయల్దేరాడు.

జాన్ కూడా బైక్ స్టార్టు చేశాడు.

ఆ కారు సరూర్ నగర్ వైపు వెళ్తోంది.

ఓ నిర్మానుష్యంగా, చెట్లున్న ప్రదేశంలోకి కారుని తిప్పి అదృశ్యమయ్యాడా మనిషి. జాన్ మరికొంత దూరం వెళ్ళి రోడ్డుమీదే ఆపి కూర్చున్నాడు.

అప్పుడు పావుగంట తర్వాత తిరిగి బయటకొచ్చి రోడ్డెక్కిందా కారు-దాని నెంబర్ ప్లేటు APT 6383 కాస్తా APD 6888గా మారిపోయాయి.

ఆ కారు వేగంగా వురుకుతోంది తిరిగి సిటీలోకి.

జాన్ కూడా వేగంగా అనుసరిస్తున్నాడు. ఎంత వేగంగానంటే, కాస్సేపట్లో నే కళ్ళముందు జరిగిందా న్నుంచి తేరుకుని తప్పించుకోలేనంతగా!

బ్రహ్మాండమైన విస్ఫోటనంతో పేలిపోయిందా కారు, టెలివిజన్ స్టేషన్ ముందు!

దానిలోకి పెన్‌బాంబును విసిరిన సంతోష్ మాయమయ్యాడెటో క్షణాల్లో!

కేవలం దానికి అయిదు గజాల దూరంలో జాన్

బైక్ నాపగల్గి తప్పించుకున్నాడు—

"డామిట్! గాడ్....ఓ గాడ్, నా శ్రమంతా బూడిదైంది!"

అతను తల బాదుకోసాగాడు కింద కూర్చుని.

• • •

ఒక గద్ద 'కీచ్....' మంటూ అరుచుకుంటూ ఇంటి కప్పుమీంచి వెళ్ళిపోయింది.

బయట టకటక అడుగుల చప్పుడు దగ్గరవుతూ, కొన్ని క్షణాల తర్వాత చటుక్కున తెరచుకుంది తలుపు.

జింబో తొంగిచూశాడు నవ్వుతూ. "సుహాసిని, సర్. వచ్చింది మిమ్మల్ని కలుసుకుంటుంది....ఓ.కే?"

అతన్ని చూసి వెంటనే లేచి కూర్చున్నాడు డిటెక్టివ్ లాల్. అతని కాళ్ళకు గొలుసుల బంధం అలాగే వుంది.

"సర్, కులాసే కదా?"

తలూపాడు లాల్, తలుపువతలకి చూస్తూ.

ఇంకో మనిషి ఒక యువతితో లోపలికి ప్రవేశించాడు.

లాల్ ఆమెనే చూస్తూ విస్తుపోసాగాడు.

జింబో ఆమెకు కాట్‌కు కొంచెం దూరంలో వున్న కుర్చీని చూపించాడు. ఆమె కూర్చున్నాక ఇద్దర్నీ తృప్తిగా చూసి, "మాట్లాడుకోండి....కానీ ఆవేశాలు ప్రదర్శించకండి, ప్లీజ్!..పదినిమిషాలే టైము వుంటుంది" అని వెనక్కి తిరిగి తలుపు దగ్గరికి నడిచి, ఆ ఇంకో మనిషితో బయటికెళ్ళిపోయాడు.

తలుపు మూసుకుంది.

లాల్ సిగరెట్ వెల్గించుకుంటూ ఆమెను పరీక్షగా చూడసాగాడు.

ఆమె కూడా అతన్నే చూస్తోంది, వాడి చూపులు.

ఆమె ముఖమంతా నీరసించి బలహీనంగా వుంది. కానీ ఆమె నిటారుగా, చురుగ్గా కూర్చుంది. ఆమె కళ్ళలో వున్న భావమల్లా ఒక్కటే. కసి! ఇక దేనికీ వెనుకాడ దల్చుకోని తెగింపు. ఇంకా ఏదో చేసేయాలన్న తపన, తాపత్రయం.

లాల్ బరువుగా నిట్టూర్చి పెదవి విప్పాడు. "నీ గురించి చాలా వింటున్నాను, సుహాసినీ. నువ్వు సాగిస్తున్న మరణకాండ రేడియోలో తెలుసుకున్నాను. యెందుకు నువ్విలా చేస్తున్నావో నీకసలు తెలుసా? నువ్వు స్పృహతోనే చేస్తున్నావా ఇవన్నీ?"

ఆమె తీవ్రంగా చూసింది, "ఎందుకలా అనుకొంటున్నారు?"

"నువ్వు స్పృహతో వుంటే ఇటువంటి పనులు చేయవు."

"నేను స్పృహతోనే వున్నాను. నేనేం చేస్తున్నానో నాకు తెలుసు. ఇకముందు ఏం చేయబోతున్నానో కూడా తెలుసు."

"ఇకముందు కూడానా, సుహాసినీ? ఇంకేం మిగిలిందని?"

"ఈ ప్రపంచంలో నిర్మూలించాల్సింది ఎప్పుడూ మిగిలే వుంటుంది, డిటెక్టివ్ గారూ."

"ఓహ్, నాకు తెలియదు."

"ఎలా తెలుస్తుంది మీకు? మీకిది అనుభవమయ్యే అవకాశంలేదు—మీ మగజన్మ కొద్దీ. నా స్థానంలో వుండి చూస్తే తెలుస్తుంది—నా పరిస్థితి, నా మనస్థితి, ఈ దుస్థితి—"

"అవును, అర్థం చేసుకున్నాను. కానీ ఈ పరిస్థితిలో

నువ్వు చాలా అవివేకంగా ప్రవర్తిస్తున్నావనుకుంటాను."

"ఎందుకనుకుంటారు?"

"నువ్వే చూడు— ఈ ముఠా నీ తండ్రిని చంపింది. నీ తల్లి చావుకి వాళ్ళే కారకులయ్యారు నిన్ను ప్రేమించిన వాడ్ని వాళ్ళే అంతం చేశారు. వాళ్ళు నీకిన్ని ఘోరాలు చేసినా— వాళ్ళతోటే నువ్వు చేతులు కలపడం వివేకమనిపించుకుంటుందా? క్షమించరాని ద్రోహం నీవాళ్ళ పట్ల."

ఆమె కటువుగా అంది. "చూడండి, డిటెక్టివ్ గారూ, చచ్చి ఏ లోకానో వున్న నా వాళ్ళకోసం ఇక్కడ బ్రతికున్న నేను పాటుపడలేను. వాళ్ళు నా కోసం ఇప్పుడేం చేస్తారు? నేనేదో వాళ్ళకోసం చేస్తే నా తృప్తికేగా? వాళ్ళ తృప్తి నాకెలా తెలుస్తుంది? కాబట్టి నాకిలాంటి సెంటిమెంట్స్ లేవు. నాకు నా కర్తవ్యం ముఖ్యం. నా కాయుష్షు యెక్కువేం లేదు, వింటున్నారా? ఈలోగా నేను చేయాల్సిందేదో వుంది. దీనికి అడ్డంకులెన్నో వున్నాయి. వాటిని తట్టుకోవాలంటే నాకు వీళ్ళ ఆశ్రయం పొందటం తప్ప మార్గంలేదు. బయటవుండి ఒక్కదాన్ని ఇవన్నీ సాధించలేను. నన్ను దహించివేస్తున్న ప్రతీకారం తీర్చుకోవాలంటే, ఈ హంతకుల అండ కోరుకోవడం కంటే గత్యంతరంలేదు నాకు...."

"నీ వాదం అర్థంలేకుండా వుంది" అన్నాడు లాల్ కోపంగా, "నీ వాళ్ళ విషయంలో నీ అభిప్రాయం నీ పిరికితనాన్నే తెలుపుతుంది, సుహాసినీ. నీ మానాన్ని దోచుకున్న వాళ్ళమీద ఏర్పడ్డ కసి—నీకు నీ వాళ్ళను పొట్టన పెట్టుకున్న వాళ్ళమీద లేదంటావా? యూ ఆర్ స్టుపిడ్, మైండ్ లెస్, పర్వర్టెడ్ గర్ల్, అన్ ఫెయిత్

ఫుల్ డాటర్. ఐ హేట్ యూ, సుహాసినీ!"

ఆమె ఉద్రేకంగా చూసింది, "ఏమిటి మీరసహ్యించుకునేది? ఎవర్ని మీరసహ్యించుకునేది? ఆడవాళ్ళని హింసించే దుర్మార్గుల్ని అసహ్యించుకోండి. స్త్రీని గౌరవించని నీచుల్ని అసహ్యించుకోండి! పైకి పెద్దమనుషుల్లా వుంటూ వెనుక ఆ చెడు పనులుచేసే అవినీతిపరుల్ని అసహ్యించుకోండి! చేతనైతే వాళ్ళని అరికట్టండి!. ఆడవాళ్ళని రక్షించండి! వాళ్ళకి న్యాయం కల్పించండి! లేదూ, మీకు చేతకాదంటే వూరుకోండి! వూరికే విమర్శలు చేయకండి—నాకు నీతులు బోధించకండి!"

"నువ్వేదీ అర్థంచేసుకునే స్థితిలో లేవు."

"అవును, నేను, నావాళ్ళపట్ల ద్రోహం చేస్తున్నాను. కానీ బ్రతికివుంటూ బ్రతకలేక జీవచ్ఛవల్లా వున్న నాలాంటి స్త్రీలకోసం నేనేం చేయబోతున్నానో తెలుసా, డిటెక్టివ్ గారూ? వాళ్ళ బాధలు రూపుమాపుతాను. వాళ్ళ కష్టాలు కడతేరుస్తాను. వాళ్ళింకముందు ఏ భయాలూ లేకుండా జీవించేలా చేస్తాను. ఆడదంటే ఆడుకునే బొమ్మకాదని కళ్ళు తెరిపిస్తాను ఆటగాళ్ళకి. వాళ్ళ ఆటలన్నీ కట్టిస్తాను. ఆడదానిపై చెడు దృష్టి వేసేముందు నన్ను తలచుకుని జంకేలా గుండెల్లో నిద్రపోతాను—"

"ఓహ్.... చాలా చాలా చేస్తున్నావు."

"చూస్తూండండి — రేపట్నించి ఏం జరుగుతుందో!"

"ఏం జరుగుతుంది? కన్పించిన ప్రతి మగవాడిమీదా నీ కసి తీర్చుకుంటావా? అయితే నీ యెదురుగా నేనున్నాను—"

"మీరైనా మరెవరైనా ఆడదానిపట్ల అన్యాయంగా ప్రవర్తించారని తెలిస్తే వదలను!"

"ఓహ్....ఐసీ...."

"ఏ దుర్మార్గుడూ నానుంచి తప్పించుకోలేడు!"

"కానీ వాళ్ళనెలా తెలుసుకుంటావు నువ్వు?"

"అది మీకే తెలుస్తుంది—రేపుదయం చూడండి"

ఆమె లేచి నిలబడింది వెంటనే, "నేను చేస్తున్న పనులు ఎప్పటికప్పుడు మీకు తెలుస్తుంటాయి. బహుశ నేను మళ్ళీ మిమ్మల్ని కలవకపోవచ్చు. వస్తాను, విశ్రాంతి తీసుకోండి."

ఆమె వెనక్కి తిరిగి చకచకా నడిచింది తలుపు దగ్గరికి.

లాల్ ఆమెనే చూస్తూండిపోయాడు ఆందోళనగా.

* * *

ఆమర్నాడుదయం బహుశ ఇంకే విపరీతాన్ని ఆశించకుండా నిదురలేచిన జంటనగరాల ప్రజలకి, అంతా పసుపుమయంగా కన్పించింది....

ఎటు చూసినా పసుపురంగు. ఎటు వెళ్ళినా పసుపు రంగు. పసుపు....పసుపు....పసుపు....నగరమంతా పసుపుమయమే!

ప్రతి ఒక్కరి చేతిలో ఆ పసుపు రంగు కరపత్రాలే!!

ప్రతీ ఇంట్లో, ప్రతీ వీధిలో, ప్రతీ కూడలిలో, ప్రతీ షాపులో, ప్రతీ హోటల్లో, ప్రతీ స్కూల్లో, కాలేజిలో ప్రతీ పార్కులో, ప్రతి రైల్వేస్టేషన్ లో, ప్రతీబస్టాపులో, ప్రతీ ప్రభుత్వ కార్యాలయంలో, ప్రతీ బస్సులో...అవే! అవే! అవే! అంతటా అవే!

సంచలనం ప్రజల్లో. ఉరుకులూ పరుగులూ! ఉద్రేకాలు. ముచ్చట్లు. కొందరికి వినోదమైతే, కొందరికి

భయాందోళనలు. కొందరికి ఫార్సు అయితే, కొందరికి సీరియస్ విషయం. ప్రతీ భాషలో ప్రతీవారినీ అవి ఆకర్షిస్తున్నాయి. అదరగొడుతున్నాయి. ఇంతవరకూ జరిగిన హత్యల పరంపర ఇంకా వాళ్ళ మనసుల్లో భయాందోళనల్ని తొలగించలేదు. ఇప్పుడీ కరపత్రాల జడివాన వాళ్ళని ఇంకా ఉక్కిరి బిక్కిరి చేస్తోంది!

ఇంత సంచలనం కల్గిస్తున్న ఆ కరపత్రంలో విషయం ఎవరూ, యెన్నడూ, కనీ వినీ ఎరుగనిది! .... అసలు వూహించలేనిది! పసుపు రంగు దేనికి చిహ్నం?

అభాగినులార! అదృష్టవిహీనులార! విధివంచితులార! శుభవార్త!

ఇదిగో మీకు వచ్చేసింది శుభోదయం....

మీరింతకాలం మీ దౌర్భాగ్యానికి దుఃఖిస్తున్నారా? మీ శకలమైన జీవితాల్ని చూసి జడుసుకుంటున్నారా? చెదిరిపోయిన మీ కన్నె కలల పంటకి మిమ్మల్ని మీరు నిందించుకుంటున్నారా? కాటుతిన్న మీ మనో మాన మర్యాదలకి నిస్సహాయులై —శవాలుగా జీవిస్తున్నారా? కూలి ధ్వంసమైన మీ స్వప్న సౌధాలకి క్రుంగి కృశిస్తున్నారా?

అయితే ఇక మీకు భయంలేదు....

అవును విచారం లేదంటున్నాము.

దుఃఖము ఇక వలదంటున్నాము.

ఎందుకని? అదెలాగ?

ఎలాగంటే—ప్రియ సోదరీమణులార — సదా మీ సర్వ రక్షణకై అభయ హస్తాన్ని చాస్తూ ఇదే సుమా హస్తాన వెలసిందొక నవసేవాసైన్య సమితి!!

ఈ సమిది మీది. మీ సమస్యలు మావి.

మీ సమస్యా పరిష్కారమూ, మా ఈ ప్రయోగ లక్ష్యమూ, ఈ నవనాగరిక నర సమాజములో చీడ పురుగులన దగినవారిని ఏరివేయడమే.

ఎచట స్త్రీలు స్వేచ్ఛతో, సుఖసంతోషాలతో వుంటారో, అదే నిజమైన, స్వచ్ఛమైన మానవ సమాజము; ప్రపంచము.

అటువంటి ప్రపంచ స్థాపనమే మా పరమధ్యేయంగా స్వీకరించి, సర్వ స్త్రీ జన రక్షణకు చిత్త శుద్ధితో శ్రమించుటకై రంగ ప్రవేశము చేస్తున్న మా ఈ సేవా సంస్థకు, మీనుంచి పూర్తి ప్రోత్సాహ సహకారాలు లభిస్తాయని ఈ సందేశం ద్వారా ఆశిస్తూ, మా ఈ మహత్తర, నిస్స్వార్థ లక్ష్య సాధనకు ఎట్టి ఆటంకమూ ఎదురవబోదని గాఢంగా విశ్వసిస్తున్నాము.

సోదరీమణులార!

మీకు తెలుసు—గత కొన్ని దినములుగా మన నగరములో జరుగుతున్న సంఘటనలు-లైంగిక అవలక్షణాలు ప్రకోపించడమే అట్టి దురదృష్టకర, సభ్య విహీన సంఘటనలకు కారణమని మీకు వేరే చెప్పనవసరము లేదు. అటువంటి ఒక దుష్కృత్యానికి బలియైన అభాగిని, సుహాసిని గాథ ఇంకా మీ హృదయాలని చలింపజేస్తూనే వుంటుంది....

అదిగో!

మా ఆశయ సాఫల్యతకు ఎన్నో కష్టనష్టాల కోర్చి, విజయము పొంది, ఎట్టకేలకు మా ప్రతినిధిగా కొనిరాబడిన ఈ ప్రచండ, ప్రళయ స్వరూపిణి సుహాసినీ దేవియే మా అధ్వర్యములో మీ కన్నీళ్ళనీ, కష్టాలనూ కడతేర్చడానికే కంకణం గట్టిందని చెప్పడానికి, మాకు

గర్వము చాలడంలేదు!

ఆమె చతురతకు మచ్చుతునక లనదగిన అయిదు వధింపులను నిన్న మీరు గాంచారు!

ఆమె శక్తియుక్తులపట్ల వూహించని విశ్వాలతాళ్ళా ర్యాలతోపాటు, ఆమెపైన ఎనలేని భక్తిగౌరవాలూ మీకు ఏర్పడే వుంటాయి!

అందుకే — ప్రియ సోదరీమణులార — ఆమెకు ఈ అమూల్యమైన సేవలను ఈ సందర్భముగా వినియోగించుకోవడం మీ విద్యుక్తధర్మమని విజ్ఞప్తిచేస్తూ, దీనికి మీరెప్పుడు వెనుదీయబోరని ఇందుమూలంగా విశ్వసిస్తున్నము.

ఇప్పుడు మీరు చేయవలసినదల్లా అతి సులభమైన, స్వల్ప ప్రయత్నమే!

మిమ్మల్ని వంచించిన, లేక వంచించబూనిన, లేక వంచించ బూనుతున్న అప్రాచ్యుడియొక్క పూర్తి చరిత్రను, లిఖితపూర్వకముగా మా చేతులలో వుంచడమే!

ఆ పిదప అంతయూ మా ధ్యేయానుసారంగానే జరిగిపోతుంది....

దీనికి మీకయ్యే ఖర్చు—ఒక పోస్టుకవరు ఖరీదు మాత్రమే!

కనుక సిద్ధంకండి!

ఇక త్వరపడండి! త్వరపడండి! ఇప్పుడే పూనుకోండి!

రండి ముందుకు! చేయూతనివ్వండి మాకు! నీచ ప్రబుద్ధుల్ని నిర్మూలించి నందనవనాన్ని నిర్మిద్దాం!

ఇట్లు

—సదా మీ శ్రేయస్సునుకోరే

P. S. అడ్రసు చెప్పండి—
అంత మొందిస్తాం!

స్నేక్ సైటీ
17, ప్రకాష్ నగర్, బేగం పేట,
హైదరాబాద్—500016.

సుహాసినీదేవీ జిందాబాద్! స్నేక్ సొసైటీ వర్ధిల్లాలి!!

* * *

ఒకటి కాదు, రెండు కాదు. లక్షల సంఖ్యలో కరపత్రాలు ప్రజల చేతులు మారుతున్నాయి.

దీనివల్ల పోలీస్ హెడ్ క్వార్టర్స్‌లో కలిగినంత సంచలనం మరెక్కడా లేదు. వాళ్ళకిది ఓపెన్ ఛాలెంజి! ఛాలెంజీల్ని ఎదుర్కోవడం వాళ్ళకి ప్రిస్టేజి ఇష్యూ.

ఒకవైపు డి. జి. పి. ఆఫీసులో ఉన్నతాధికారుల అత్యవసర సమావేశం ఏర్పాటవుతూండగా, మరోవైపు ధైర్యంగా ప్రకటించబడ్డ ఆ శత్రుకూటమి చిరునామాకు కొన్ని సాయుధ దళాలు తరలి వెళ్ళాయి... బేగం పేటకి.

అక్కడాశించినట్టే ఎదురైంది—ఆ చిరునామాగల మేడ ఖాళీగా వుంది, తాళంవేసి. తీవ్రంగా దర్యాప్తు చేసి, ఆ మేడ యజమానిని ఎర్రమంజిల్‌లో పట్టుకున్నారు. అప్పుడా మేడని రెండు రోజులక్రితమే ఒక పెద్దమనిషి అద్దెకి తీసుకుని అడ్వాన్సు చెల్లించాడని చెప్పాడతను.

అతను అడ్రసు ఇవ్వలేదు. యజమాని చెప్పిన అనవాలు ఉపకరించలేదు.

ఆ మేడముందు మఫ్టీల్ని ప్లాంట్ చేశారు.

(ఇంకా వుంది)

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాదిపాటు పత్రిక లేదా సప్లిమెంట్ బహుమతిగా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రూ. 10/- లకే మా ఏజెంట్ ద్వారా గాని వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 120/-లు ముందుగా పంపవచ్చును.



# క్రైమ్‌లో తమాషాలు

## "అబద్ధం!!"

"నీ కెంతమంది అన్నదమ్ములు?"

"ఒక్కడే."

"అబద్ధం. ఇప్పుడే మీ అమ్మ తనకు ఇద్దరు కుమారు లని అంది కదా!" అన్నాడు జడ్జి కోపంగా.

—చాగాపురం నాగేశ్వరరావు, గద్వాల.

## శత్రువు?

అర్ధరాత్రి సమయం.

ఊరి శివార్లలో దూరంగా విసిరేసినట్లుందా బంగళా. ప్రక్కనే ఊడలు దిగిన మర్రిచెట్టు. చుట్టూ కాంపౌండ్ గోడ. ఆ నిశీధి నిశ్శబ్దంలో ఆ బంగళా గంభీరత దయ్యా లకే భీతిగొలిపేట్టుగా వుంది.

ఆ బంగళాలో ఎయిర్ కండిషన్డు రూమ్‌లో ఫోమ్‌బెడ్ మీద, ప్రశాంతంగా, గాఢంగా నిద్రపోతున్నాడు డిటెక్టివ్ బాండ్.

సరిగ్గా అప్పుడు....

ఉన్నట్లుండి మెలకువ వచ్చింది బాండ్‌కు. వెంటనే అతని చేతులు ఆటోమాటిక్‌గా కరాటే పొజిషన్‌లోకి వచ్చేశాయి. మొద్దుబారిన అతని చేతులు అతడు కరాటేలో

ఎన్నో ఏళ్ళ శిక్షణ కలవాడని తెలుపుతున్నాయి.

కొన్ని క్షణాలపాటు కదలకుండా అలాగే వున్నాడు. కేవలం కళ్ళ చివరల నుండి చుట్టూ పరికించాడు.

అతనికింకా ఆ శబ్దం వినిపిస్తూనే వుంది. "అవును ఆ శబ్దానికే తనకు మెలకువ వచ్చింది."

దిండు కిందే కోల్ట్ పిస్టల్ వుంది.

"ఎక్కడినుండి వస్తూందది?"

"బయటినుండా....కాదు....ఈ రూమ్ ఎయిర్ కండీషన్లు....అంటే, చప్పుడు రూమ్‌లో నుండే వస్తోందన్న మాట....!

బాండ్ బుర్ర చురుగ్గా పని చేసింది. కళ్ళు వేగంగా వెతికాయి.

ఏకాగ్రత వల్ల అతని నుదుట చిరుచెమట పట్టింది.

కనుక్కున్నాడు....

అవును....అదే....తన మెలకువకు అదే కారణం.

అతని చేతులు చాప్ పొజిషన్‌లోకి వచ్చాయి.

అతను వేగంగా కదిలాడు....అతి వేగంగా....

ప్రత్యర్థి తప్పించుకోలేనంత వేగంగా....

అతను చేసిన శబ్దం ఆ రూమంతా ప్రతిధ్వనించింది.

విజయగర్వంగా చేతివంక చూసుకున్నాడు.

రక్తం....

మనిషి రక్తం! దోమ త్రాగిన మనిషి రక్తం!!

అలసటగా దిండుమీద వాలిపోయాడు .... డిటెక్టివ్ బాండ్.

—కోటకొండ మురళీమోహన్, కర్నూలు.

